శ్రీ

# వసురాయమహాప్రబంధము



వడ్డాది సుబ్బారాయకవి

ప్రణీతము



రెండవకూర్పు 1000 ప్రతులు

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారిచే

సరస్వతీ పవర్ ప్రెస్ నందు

ముద్రింపఁబడియె

రాజమహేంద్రవరము

 1925 [దీనివెల 1-8-0



వసురాయచాటుపద్య, ప్రసవామోదంబు దెసలఁ బర్వ సదాక్షి

ణ్యసమీరుఁ డైనప్రభువి, శ్వసుందరుఁడు ప్రాణసఖుఁడు వసురాయనికిన్.

శ్రీరస్తు.

శ్రీపరమాత్మనేనమః

# పీఠిక

---

ఉ॥ నన్నయతిక్కనాదిరసనల్ గురియించినచాటుధార లీ
మన్నన నింకఁబోలు; నణుమాత్రము తప్పిన మబ్బదెందు; హా!
జున్నలలోనఁ జిన్నిపువుజున్నెటు, లట్టులు పద్దియంబులన్
మిన్నలు చాటువుల్, రససమృద్ధి ననిర్వచనీయమాధురిన్.

ప్రాస్తావికప్రకరణము (2)

ఇప్పటికి సుమా రొకయర్ధశతాబ్దమునుండి నే నప్పుడప్పుడు వివిధప్రస్తావముల రచించుచు వచ్చినట్టియు, సమకాలీను లైనపండితకవులమెప్పును బొందినట్టియు, బహుజనులకుఁ గంఠస్థము లయినట్టియు, సహస్రాధికము లయినపద్యము లొకకోశమున భద్రపఱుపక పోయినయెడలఁ గాలము గడచినకొలఁది నవి వినాశము నొందునో, యేమవునో, యనసందియమున నానాముఖములఁ జెల్లాచెదరుగ నున్నవాని నన్నిటిని గ్రమక్రమముగా నయకూర్చి వసురాయచాటుప్రబంధ మనునామమునఁ బ్రకటించితిని. మనువసుచరిత్రాదిప్రబంధములయందుఁ బోలె నిందు నాదినుండి యంతమువఱకు నేదేని పురాణగాథ గాని, కల్పితకథ గాని ప్రత్యేకము గానరాక పోయినను, విందునందు విస్తరిలోని వివిధరుచ్యపదార్థములవలె నిందలిచిన్నచిన్న ఖండకావ్యములు, ప్రకృతివర్ణనములు, ప్రాస్తావికములు మొదలగునవి చదువువారి జిహ్వాల సంతుష్టిపఱుపఁ జాలియుండు నని తలంచెదను.

విషయసామ్యమునుబట్టి నాయీపద్యము లన్నిటి నైదుతరగతులుగా విభాగించి యాభాగములకు వరుసగాఁ బ్రశంసాప్రకరణము, ప్రకృతిప్రకరణము, ప్రాస్తావికప్రకరణము, ప్రకీర్ణప్రకరణము, స్వవిషయప్రకరణము, నని పేళ్ళువెట్టితిని. ప్రకీర్ణప్రకరణములోనిపద్యములు మాత్ర మన్నియు స్వకపోలకల్పితములు కావు. అందుఁ గొన్ని సంస్కృతమునుండి తెలిఁగిచినవి. ఆవివరణ మాపద్యములశీర్షికలవలనఁ దెలియఁగలదు. సంస్కృతకవులలో సుప్రసిద్ధపండితరాయబిరుదాంకితుఁ డగుజగన్నాథకవి విరచించిన భామినీవిలాస మనుగ్రంథ మించుమించుగా దీనివంటిదే. దానిని నేను దెలిఁగించి 1902వ సంవత్సరమున ముద్రింపించితిని. వివిధవిషయములను గూర్చి వేఱువేఱుతరుణముల రచియింపఁబడిన యాశ్లోకముల నెల్ల నొకసంపుటమునఁ గూర్చుటను గూర్చిన తనమనోభావము తద్గ్రంథాంతిమశ్లోకమున నింతగా జగన్నాథకవి వ్యక్తీకరించినాఁడు. పాఠకవినోదార్థము తచ్ఛ్లోకార్థము దెలుపుతెలుఁగుపద్య మిట నుదాహరించెదను.

క॥ లంజలకొడుకులు హరియిం
పఁ జూతురు మామకీనపద్యమణు లటం
చుం జనియించినశంకన్
మంజూషను దీనిఁ జేసినాఁడం జుండీ॥

మఱియుఁ దద్గ్రంథాంతమున నతఁడు రచించినయింకొకశ్లోకమునకుఁ దెలుఁగుపద్యము—

చ॥ నాకవితాకుమారి! వదనమ్మును వాంచకుమమ్మ! నిన్నుఁ బల్గాకి నిరాకరించునని, కాఁగును వాఁ డటు లోర్వ లేమి; నీ
కాకథ యేల? కావ్యకమలాంతరసీధుధునీనుధువ్రతా
సీకముమోములం జెలఁగి నృత్యము నిత్యము నీ వొనర్పవే!

ఈ చాటుప్రబంధమునం దితరవిషయవినోదములకంటెఁ బురాతనమును, బుణ్యాశ్రమక్షేత్రమును, లక్ష్మీసరస్వతీలాస్యరంగమును నయినయీగౌతమీతీర రాజమహేంద్రవరనగరరాజమునకు సంబంధించినవిశేషము లెక్కుడుగా నెక్కొని యున్నవి. ఏనాఁడో యొక టిరెండుపద్యములు శ్రీనాథాదు లీపట్టణమును గుఱించివ్రాసినవి యిప్పుడు చదువుకొనుచు సంతసించెడు నాంధ్రుల కీకాలమునను, భావికాలమునను గూడఁ దత్పురీవిశేషము లనేకములు దెలుపునీచాటుప్రబంధపద్యములు డెందముల కమందానందసంధాయకములు కాకపోవని నాయాశయము.

ఏతద్గ్రంథస్వభావ మనగత మగుటకు నావశ్యము లయినకొన్నివాక్యము లిట నేను బొందుపఱిచితిని. వీనిగుణాగుణములను గుఱించి పండితులే ప్రమాణము.

ఈక్రిందిపద్యములు మూఁడు నాయీ వోట్లఁ జేర్పఁబడినవి.

ఉ॥ నింగిని వర్తనం బగుట నీరదసఖ్యము సంఘటిల్లి వే
సంగిని నీరసస్థితి పొసంగినసంగతిఁ గాంద్రయిచ్చకఁ
భంగము గల్గకుండఁ దెలువర్లకు దప్పి నడంచుభార ము
త్తుంగనిజోత్తమాంగముల దొడ్డమపేట వహించుఁ గొబ్బరల్.

ప్రశంసాప్రకరణము

చ॥ కులమతధర్మభావములకుఁ గూడినకొండలవంటికట్టుపా
టు లిసుకతిట్టలం బలెఁ గడున్ సులభంబుగఁ గ్రొచ్చివేసి స్వే
చ్ఛల విహరింప స్త్రీపురుషసంఘము, వీ లౌనగూడె మిక్కిలిన్
గలిపురుషప్రభావమునఁ గల్గినమే లివి యాంధ్రభూమికిన్.

ప్రాస్తావికప్రకరణము

ఉ॥ బాలిక యొార్తు నూత్నరతిఁ బాదవిభూషణ ముజ్జగింపఁబోఁ
గేళిగృహంబునందుఁ బలికెం బతి "యిం పిదియుండ నిమ్మ్మ"నాఁ
"జీల వదుల్, మతిం బరువుచే టెర," వం చది యూడ్చెఁ జె
[చ్చెరన్;

స్త్రీలకు బుద్ధిపాటవ మశిక్షిత మఁకవివాక్కు నిక్కమే,
ప్రకీర్ణప్రకరణము (శృంగారము)

పూర్వము వేణీసంహారనాటకాంధ్రీకరణవిషయమునఁ దదీయజనకపితృ యగు కీ॥ శే॥ కస్తూరినరసింహ రావుగారివలెనే ప్రస్తుత చాటుప్రబంధముద్రణవిషయమున నన్ను మిగులఁ బ్రోత్సాహపఱిచి ముద్రాభృతి సర్వ మొసంగి గారవించినకవితారసజ్ఞుఁడు మామక ప్రియసఖుఁడు శ్రీరాజావాడ్రేవువిశ్వసుందర రావు బహదరుజమీన్దారు మహోదారునకు దీర్ఘాయురారోగ్యాదు లగుసకలశ్రేయస్సులఁ బ్రసాదించి కాపాడుఁగాక యని, యారబ్ధకార్యనిరంతరాయపరిసమాప్తికిఁ గారణభూతుఁడైనపరమేశ్వరుని భక్తిమయిఁ బ్రార్థించుచు నీయంశమును ముగించుచున్నాను.

రాజమహేంద్రవరము
11—8—1925

వడ్డాది సుబ్బారాయుఁడు.

# విషయసూచిక

## ప్రశంసాప్రకరణము


| | | | |
|---|---|---|---|
| ఈశ్వరుఁడు. | ... | ... | 1 |
| కవి. | ... | ... | 2 |
| బమ్మెరపోతరాజు. | ... | ... | 3 |
| కవితిక్కన. | ... | ... | 6 |
| సూరన. | ... | ... | 8 |
| హంపి; ఆంధ్రసాహిత్యపరిషత్తు. (కృష్ణదేవరాయలు) | (1915) | ... | 9 |
| రాజరాజ నరేంద్ర వర్ధంతి. | (1922) | ... | 12 |
| శ్రీవిక్టోరియా జూబిలీనవరత్నములు. | (1887) | ... | 15 |
| రాజమంద్రి ఆర్ట్సుకాలేజిప్రిన్సిపల్ ఇ. పి. మెట్కాఫు స్వదేశయాత్ర. | (1887) | | 20 |
| డిటో | (1896) | | 23 |
| ఆర్ట్సుకాలేజి మెట్కాఫుయెంగుమెన్ లిటరరీ అసోసియేషన్ | (1898) | | 26 |
| ఆర్ట్సుకాలేజి, ప్రిన్సిపల్ ఈ. డబ్ల్యూ నిడిల్ మాస్టు | (1898) | ... | 27 |
| ,, ,, ఓ. జె కూల్డ్రె | (1916) | ... | 30 |
| ,, ,, | (27 7 16) | | 31 |
| ,, ,, | (1919) | | 32 |
| ట్రైనింగుకాలేజి, వైస్ప్రిన్సిపల్. టి. వి. సుబ్బారావు | (1905) | | 33 |
| జడ్జి బర్డుదొర | (1896) | | 36 |
| రాజమంద్రి సబుకలెక్టరు. బర్కిటు సమ్మానము | (1908) | | 38 |
| మదరాస్ గవర్నర్ సర్ ఆర్థరులాలీ. గుంటూరు | (1908) | | 39 |
| ,, ,, రాజమంద్రి. | (1908) | | 40 |
| కలెక్టరు బ్రాడీ గుంటూరు | (1908) | | 42 |
| అనిబిసెంటు | (1893) | | 43 |
| రాయబహద్దరు చిత్రపువేంకటాచలముపంతులుగారు | | | 45 |

శ్రీరాజా. వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దరు జమీందారునివివాహము (1908) 47

,, మంత్రిప్రెగ్గడ భుజంగరావు గారి ప్రథమపుత్రికపరిణయము (1913) 49

,, ద్వితీయ పుత్రికపరిణయము (1910) 51

,, తృతీయ పుత్రికపరిణయము (1919) 51

,, తురీయ పుత్రికపరిణయము (1920) 52

పాలతోడు పెండ్లి ... (1917) 54

శ్రీరాజా వాడ్రేవు విశ్వసుందరరావు బహదరు జమీందారు. 57

ధర్మశాలామూల బంధశిలాస్థాపనము (1904) 59

రాజమండ్రి జనానామిషను వైద్యశాలా గృహప్రవేశము. (1911) 63

బారునృసింహారావుగారి సత్రము. (1914) 65

కీలక గౌతమీ పుష్కరము (1908) ... ... 66

స్త్రీవిద్య (1905) ... ... 72

రాజమండ్రి యూనియను హైస్కూలు (1888) ... 76

శ్రీజార్జిచక్రవర్తి ఢిల్లీ పట్టాభిషేకము. (1911) ... 80

కృతివిమర్శనాదికము. ... ... 85

శ్రీపిఠాపురము రాజుగారు ... ... 87

భిషక్త్రయసమ్మేళనము. ... ... 88

మిత్రసంభావనము. ... ... 88

దాక్షారామ భీమేశ్వరుని యుత్సవము. (1884) ... 89

దొడ్డమపేట. ... ... 90


## ప్రకృతిప్రకరణము.


ప్రభాతము. ... ... 93

ప్రదోషము. ... ... 97

చంద్రతారకలు. ... ... 100

సనకారు. ... ... 108

వానకారు. ... ... 111

సీతుకారు. ... ... 118

ధూమకేతు వర్ణనము. ... ... 122

శిశువు; వృద్ధుడు. ... ... 124

పొలములు పిట్టలు. ... ... 128

చటకపరామర్శము ... ... 132

షట్పదాదులు. ... ... 134

చెట్లు. ... ... 142

చెఱువు. ... ... 149

గోదావరి. ... ... 152

గౌతమీ మహాజల మహిమాను వర్ణనము (304 పాదములచంపకము) ... 153

పాస్తావికపకరణము. 167

అన్యాపదేశాదులు (100 పద్యములు)

పకీర్ణ పకరణము.

ఆంధ్రీకరణములు.
- హరిభజనమంజరులు.(భజగోవింద శ్లోకములకుఁదెల్గు 185
- చతుర్దశమంజరీ బోధము. 189
- ఉత్తరరామ చరిత నాటకము ప్రథమాంకము. 190
- వివిధేతరాంధ్రీకరణములు. 200

మిత్రసమ్మానము. ... ... 206

కవిత్వము. ... ... 208

చిత్రకళ. ... ... 209

పరిషత్పత్రిక. ... ... 210

శృంగారము. ... ... 211

చెన్నపుర ప్రదర్శనము. ... ... 216

వివిధములు.(ధూమనౌకావిహారము. 223 పే. 112 పాదముల చంపకము) 220

శిశుమరణ చింతనము. ... ... 236

నిర్యాణములు.
- బసవరాజు గవరాజు. ... 238
- దామరాజు బసవరాజు. ... 238
- కందుకూరి వీరేశలింగము. ... 240
- కొక్కొండ వేంకటరత్నముపంతులు. ... 241
- దివాకర్ల తిరుపతిశాస్త్రి. ... 242
- భాగవతి వాసుదేవ దీక్షితులు. ... 242
- కన్నూరి నరసింహరావు. ... 242
- శ్రీ వాడ్రేవు రంగనాయకాంబ జమీందారిణి 243

శ్రీవసురాయ మాతామహి. ... 244
శ్రీవిక్టోరియా చక్రవర్తిని. ... 245
శ్రీ శ్రీ సప్తమెడ్వర్డుచక్రవర్తి ... 250


## స్వవిషయ ప్రకరణము.


విశ్వరూప స్తవము. ... ... 251
జననాదికము. ... ... 257
స్వగృహము. ... ... 259
నూయి. ... ... 261
పుత్రజననాదికము. ... ... 262
కోరుకొల్లు పయనము. ... ... 264
వీడుకోలు సంభ్రమము. ... ... 267
దంతపతనము. ... ... 269
వివిధవిషయములు. ... ... 270
చింతచెట్టు. ... ... 274
విప్రలంభము. ... ... 277
కాళీయమథనము. (కీర్తన) ... ... 287
నృసింహపంచాశిక. ... ... 293


---

శా. ప్రాతస్స్నాయవిహాయసాంబుదములారా! యుష్మదీయాకృతుల్
చేతోహ్లాదకరంబు లభ్రమణి ప్రాచీపశ్చిమాంతర్గతుం
డైతో యమ్మల రాకఁ బోక మిముఁ జేయన్ దాఁ గరస్పర్శమున్;
బ్రీతివ్యంజకహాస్తమర్శనము కల్పించున్ విచిత్రస్థితుల్.

ప్రకృతిప్రకరణము.



వాణీపాణివిభూషణ, వేణీ సుత సూక్తి ఫక్త వివిధగ్రంథ
శ్రేణీప్రీణితకవిక, ర్వాణీహృదయప్రియుండ వసురాయఁడౌన్.

శ్రీరస్తు

శ్రీపరమాత్మనే నమః

# వసురాయచాటుప్రబంధము

## ప్రశంసాప్రకరణము

### ఈశ్వరుఁడు

శా॥ శ్రీఖండా! వకుళా! రసాల! పనసా! పూగా! వటా! శ్రీఫలా!
శాఖాబాహువులన్ సుగంధిసుఫలచ్ఛాయాదిదానంబులన్
భూఖండం బలరించు నత్తరుల, మీబోంట్లన్ జగత్స్రష్ట యా
లేఖం దల్పఁగఁ జేయుపుణ్యమున కాంక్షించెదన్ నాయెడన్.

మ॥ అఱతె నొక్క యమరించి, కెంపులకు నీ నాభీజముల్ వానిలో
నిఱుకంగా సవరించి, సన్నపొరలన్ హృద్యంబుగా నీరు నై
స్ఫురియింపం బచరించి, నైజీబరణుల్ పోల్పంగ నాతీయపం,
గ్రోలు పౌ దాడిమ నించునా, హిమమునుచున్ సూక్తుల్ మదీయం [కృతిన్ 2

ఆ॥ వె॥ నల్లబల్లపీఁటఁ బిల్లలు నేర్చుకో
నయ్యవార్లిఖింతు రక్కరంబు;
లాత్మమహిమ దెలియ నాకాశమండలం
బందు నింతు చుక్క లవ్యయుండు! 3

తే॥ గీ॥ రాసు లంకెలు; సూర్యచంద్రములు ముంత్లు;
ఒక్కలే చట్టు; మాఁగని, టిక్కుమనని,
తప్పు తిరుగని, కీ లైన, గొప్ప దైన
లోకఘటికాగ మేకువేలుఁడు సృజించె? 4

తే॥ గీ॥ ఇన్ని భూమండలంబుల కెంతయెత్తు
నం దునుప, నసహాయ మహానంతవెలుగు,
కెంత తేజంబు గలదివ్వె యిచునో, గుణుంగు
గణితతత్త్వజ్ఞ్యు, నర్కేందుకర్గ్గ వెలుగు. 5

క॥ భూగోళము, లాకసమ్మం
దారలు, నక్షత్రపుంజములనేకము, లొంగొ
జేరి జగ మైనయవ్వులు,
సహాపా! యెన్నొ, సంఖ్య నెరుగ శ్రీభవా! 6

చం॥ అనుదిన మష్టకష్టముల నందు నటుం డిలు నిర్వహింపవ; నో
జనక! జగత్కుటుంబి! యెటు సాగుదొ యీబహుజీవరాసులన్;
గనుఁగొనినాఁడ నీయొకవు; గన్పన నేమరయో యమర్చ్చి; తం
డునఁ బ్రతిజీవి దీటు దకొనున్ నిను గొంజక తానె యక్కటా.

ఉ॥ పంచజనుండు నేయ మెడఁబాయని నీయెడఁ జేయుచుండినన్,
గాంచఁడు ఘోరరౌరవముఖంబుల నాతత మైనయాతనల్,
మంచియ కాని చెడ్డ యణుమాత్రముఁ జేయఁగఁ బోఁడు గాన జీ
వించుదినాలఁ ద్వత్ప్రియత; విశ్వవిభూ! మరగింపు నన్ నిన్నున్.

క॥ కుప్పలుగఁ బెరుఁగుచెత్తకు
ని ప్పంటించెదువితాన, నే ననుదినమున్
దప్పులు రూపఱ మదిలో
నప్పరమేశ్వరునియంఘ్రు లనుసంధింతున్. 9

—:కవి:—

చ॥ నవరసస్పృష్టిఁ జేసి నదనంబులవాడును దీర్చ్చి, గూఢ మౌ
వివిధము లైనభావములు వెల్లడిసేయుఁ, బ్రబోధ మిచ్చి కన్
గవఁ దెఱపున్, బదంబు లిడఁగా నగునందియముం దొలంచు, న
త్కవి రవిభాతి; నాతఁ డెటఁ గల్గఁడు, చీఁకటి కాదె యాకడన్?

మాఱనయోఁట మాయయ్య నస్వాచకి
తాత్త్వికిఁ జదివించినట్టిసుకృతి,
కవిత్వశక్తి మున్ను నాకన్నిట వెన్నని
యడుగులు గడిగించినట్టికృతి,
సంధ్రిమున భాగవత, మంతరంగమూన
వ్యాసఫణితము గరఁగి, తదస్థ మమరఁ
బోఁత పోసినబమ్మెరపోతరాజు
మృదులపదముల కెదను మొ్రక్కెదను దవిలి. 15

సీ॥ స్థాపించె నృపభీతి ధరణిగర్భమునందు,
విత్తభాండముఁ బోలెఁ బొత్త మెవఁడు,
నడిపించె మడి నేఁడు సడలించి నఙ్ఞల,
నేటిజాలట్టు నాఁగేటిచాలు,
మఱఁగించె నెవఁడు టిప్పణిఁ బోలెఁ బావిఁ జ
ప్పుడు సేసి, సిరిపద్యమున కు శంక,
బ్రదికించెఁ గమరినబాలఁ గాలినతీఁగ
వాన పోలె సమోఘవాణి నెవఁడు,
శౌరి కార్చిచ్చుకరఁప సంసరణసరణి
నోర్చె నిప్పచ్చరము మాన ముఱుగ కెవ్వఁ,
డట్టిబుధరాజు, హరిభక్త హస్తిరాజు,
పుట్టుకవిరాజు బమ్మెరపోతరాజు; 16

తే॥ గీ॥ పొడుపుగుట్టను గ్రహరాజు పొడుచునట్టు
పోతరా జొంటిమెట్టను? [జోరుగంటను] బుట్టినాఁడు;
రోదసిని సాంద్రమై యుష్ణరుచియుఁ బోలె,
సంధ్రిమున విష్ణురుచి హెచ్చి యడఁచె జడత. 17

మ॥ ఉదధిప్రాయనియోగిగోత్రఖనిగర్భోద్భూతసద్రత్నముల్
గద, యాంధ్రావనిఁ దిక్కనాదిసుకృతుల్; తన్మధ్యగణ్యుండు కో
విదుఁ డాపోతన ; చాల వెన్న నతనిన్ వేనోళులున్ ; భారతీ
వదనాశ్రుప్లుతినోదనక్షమఘృణావాసుం డతం డల్పుఁడే ? 18

సీ॥ రాజరాజేంద్రసామ్రాజ్యభోగములందు
నన్నయభట్టు పాల్గొన్నవాఁడు ;
మనుమసిద్ధిక్షమాచక్రి మరుదారఁ
దిక్కన్న తనచేతఁ ద్రిప్పినాఁడు ;
వీరభద్రారెడ్డివిరివియౌవిభవంబు
శ్రీనాథుఁ డెంతో భుజించినాఁడు ;
రాయలయొద్ద గారవ మొంది పెద్దన్న
మెక్కి యందలము నూరేగినాఁడు ;

వెఱఁగు పడ నేల వారికవిత్వమునకు ?
బ్రదుకుపై యాస గూడను బొడము సేయు
ఘోరదారిద్ర్యదుఃఖంబుఁ గుడుచు చకట !
యేగతిని బల్కెఁ బోతన్న భాగవతము ? 19

మ॥ పలికించుం దను రామభద్రుఁ డనుచున్ భాషించుఁ బోతన్న ; య
ప్పలుకుం దప్పక నమ్మెఁగా నలయు; యావజ్జీవముం దీవ్ర మా
నసదుఃఖం బెట్టునకించనత్వదురవస్థన్ మ్రాఁగుమర్త్యుండు, ని
శ్చలుఁడై పల్కఁగలండె భావరసభూషాభాసురోద్గ్రంథమున్.

మ॥ కవులం దొక్కని కొక్కపోకడ నిసర్గం బెన్నఁ ; బోతన్నకుం
జపి యా సంత్యపుసీమ ; మంతటిమహాచాతుర్యశిల్పంబు వే
ఱొకపుం జూపఁగ ఛేదకంబుల ? నతండే మేటి యం ; దస్మత
త్కవితాకన్యకుఁ బుట్టుమచ్చ, శుభలక్ష్మం బంగమచ్చంబునున్

మ॥ కృతులెా గెం, దవి రామభూపతికథల్; కృత్యంబులో వేగొనెఁ
గ్రితుసంతర్పితసత్రిభుక్కులము; మంత్రిం బన్న, సగాత్రిమని
స్థిర రాజన్నిజరాజవైభవపునర్నిర్మాణకర్మఠుమన్;
బతిలోకంబు లహో! మహామహుఁడు తిక్కామాత్యచారిత్రముల్.

ఉ॥ చక్కని శైలి; భావములు చక్కని; వేకథ పట్టు నీసినన్
మిక్కిలి పారవశ్యము, నమేయసుఖంబును భారతంబునం;
దక్కటి సత్కవీంద్రులకు దారి; తపఃఫల మాంధ్రభూమికిం;
దక్కిన జీవనౌషధము తెల్గున; కిం కిట వేయు నేటికిన్? 34

తే॥ గీ॥ అన్నమాకొమ్మనామాత్యు లాది నేమి
పున్నె మొనరించిరో తిక్కపుత్రుఁ బడయఁ;
బావనము సల్పుకొనెఁ గవిబ్రహ్మఁ బొగడి
రసన, వసురాయకవి రాజరాజనగరి. 35

## సూరన్న

కం॥ పింగళిసూరనఁ దలఁచి, తె
లుంగుగవిఁ లాఁతివాని లో నెంచుట, యిం
చుం గొఱికిననోరను బెం
డుం గొఱుకుట కాదె? వేయి నుడు లేమిటికిన్? 36

తే॥ గీ॥ ఇభవృషభవాహు లిర్వుర, నేకచిత్ర
ముగ లిఖించిన, మెచ్చరే ముచ్చినేర్పు?
రాఘవార్థంబుఁ బాండవార్థంబు, నొక్క
కబ్బమునఁ గూర్చుకవిప్రజ్ఞ కాదె శ్లాఘ్య? 37

—• హంపీ; ఆంధ్రసాహిత్యపరిషత్తు •—

ఉ॥ శ్రీయుతకాళిదాసుఁడు వచించెను శంభు "యథార్థవర్ణనా
నేయనయుం దనన్యవిషయేశ్వరశబ్ద" మటంచు నాంది; "నిం
ద్రాయుతకృష్ణదేవవసుధావరుసం దగు, నట్టిశబ్దమే
"రాయ" లటంచుఁ బల్కునను రాయఁడు, హంపిని సాహితీసభన్

ఉ॥ దేవుఁడు "దేశభాషలను దెల్గును తె" స్సనె నంచు, రాష్ట్రభా
షావళి రాజభాషగను నాంధ్రముఁ జేసినశస్త్రశాసనుం,
జీవులు దేవపావనమహీసురభక్తిని దెల్ప "వర్ణధ
ర్మావనముం బొనర్చినమహాప్రభు" వందురు కృష్ణరాయనిన్.

సీ॥ ప్రబలించె నాంధ్రసామ్రాజ్య, మప్రతిమప్ర
తాపంబు రిపుపుర్యోద్దాహకముగ;
నెగడించె నవకావ్యనిర్మాణ, మాస్థాన
మష్టదిగ్గజముల కాశ్రయముగఁ;
గేల నందెఁ బ్రశస్తకృతులు, గత్తెలు హైమ
డోలికాందోళికాలాలితులుగ;
ఘటియించెఁ బటుమహాకావ్య, మద్భుతకల్ప
నము లోకశాస్త్రవిజ్ఞానదముగ;
నేలెఁ బుడమికన్న నెక్కుడుగా భాష,
"నాంధ్రభోజుఁ డీతఁ" డనఁ, నెవండు,
గంగతోడ ముజ్జగములఁ గ్రొ ఖ్యాటుకుఁ, ద
త్కృష్ణదేవరాయకీర్తిలహరి;

ఉ॥ "అన్న భజించుటం దశరథాత్మజులో, మఱి పాండవేయులో,
మిన్న" లటన్న "రఘుప్రలె మే" లనుపండితులోడ, రాముపం
పన్ని "సమర్థు గొల్చు టరుదే" యని, లాతుల మెచ్చు రా
[యనిన్,
"మున్న కిరీటిగార్మి వీడ" నని, ప్రోడలు కందుర లాడి రిందె గా.

మ. అలనాడు "దక్షులజాత" పద్యగత మానస్థాంతరన్యాసమం
దలి "నాథుల్" మొదలైనవాక్యమున, దుష్టాంతప్రసంగంబు ని
మ్ముల దోసించిన "ముద్దుబల్కు" గవిచే బొత్తంబు గట్టిం
[చి, తా
బొలయల్కన్ విడె రాయ, లన్నకథ కీర్తిప్రోల్ పుట్టిని ల్లాగదా.

శా॥ బృందారణ్యమునందు జెక్కుమహిమల్ కృష్ణుండు శావించు కా
ళిందీతీరము గాంచినట్లు, హృదయక్లేశంబులం బాసి యా
నందం బొందరె, కృష్ణరాయవిభవౌన్నత్యంబు సూచించుమా
కిం దర్శించి, మహాపురాసుకృతలబ్ధిం దుంగభద్రాతటిన్?

చ॥ బడిచదువప్డు కాగితమున్పై లిఖియించి పఠించినాడ ము
న్పడ, మృదుపారిజాతహరణంబు, ముదశ్రులు జాలువాఱగా;
బొడగనినాడ పట్టికృతి పుట్టినపట్నపుబోడు నేడు, ముప్రి
క్కడివిధిచెయ్వులం దలచి కన్నుల బాష్పకణంబు లూరగా.

మ॥ కవితాధారలు, ఖడ్గధార లఱుతం గ్రొవ్వారగా, నూరు తె
క్కు నశూరుల్, సమితిప్రసంగవిజయోత్సవంబులన్ సార్థకం
బవు రాయల్ నిజనామధేయములు జేయం గ్రాలు నీప్రోలు, తొం
టివిశేషాఖ్యలు మాసి, యప్రియనసంజ్ఞల్ దైవతంత్రంబహో!

మ॥ పవనప్రేరితమాలతీపరిమళోపమ్యార్థవత్ప్రఖ్యముల్
చెవి సోఁకం, బురవస్తువాహనముఖాతీక్ష్ణప్రదానంబులం,
గవ్వులం ధన్యులఁ జేయురాయులపదాంకంబుల్, హలాబ్జాంకుశా
దివిభూత్యోచితచిహ్నముల్, గనుఁడు ధాత్రీ! కూర్చెఁ గా నీ
కిటన్. 46

సీ॥ గ్రామ్యసంపర్కదౌర్భాగ్య మాంధ్రమునకు
బడులఁ జేసెడి నిష్టపడనిసుమతి,
రాజమహేంద్రమున విభ్రాజితసౌధంబుఁ
గట్టించి, బడి కిచ్చినట్టిదాత,
కాకినాడను బీఠికాపురంబునఁ దన
కాలేజి హైస్కూలు గలవలంతి,
యనదబిడ్డలకు విద్యాబుద్ధు లబ్బఁగా
శరణాలయం బిడ్డసదయహృదయుఁ
డాంధ్రసాహిత్యపరిషదభ్యర్థుఁడు; డాంధ్ర
కోశరచనాదికప్రేరకుండు, రావు
వేంకటకుమారమహిపతుర్యాంకుఁ జెట్టు
కృష్ణరాయపశంస స్ఫురింప వలదు?

సీ॥ "బ్రాహ్మణు లింట సంభాషించు తెలుఁగు గ్రా
మ్యంబు నాఁ జన"దని యనెడ రొకరు;
"శాఁపలయింటిలోపలఁ దూఱినంతఁ గు
క్కను గోవను జన"దనెడు రొకరు;
"స్వచ్ఛ నమాభాష నభ్యాసం బొనర్చుట,
మనపిల్లలకుఁ గష్ట"మనెడు రొకరు;
"శ్రమ మటంచును' బ్రాలు సలిపి వండక, వట్టి
తినరు మానవు"లంచు ననెడ రొకరు;

బడుల నెట్లొ వచ్చి పడెఁ బల్కి గ్రామ్య; సా
హిత్యసమితి వాని కెడపె దాని;
గిడుగు రామమూర్తినుడుగు నిల్వక పోయె;
నొగి జయంతి రామయోక్తి గెల్చె. 48

సీ॥ ఆమ్నాయమునకు భాష్యముఁ, గలిస్మృతికి స
ద్వ్యాఖ్యఁ, జేసినయతిపండితేంద్రుఁ,
డడుగుల వెండిస్సెఁ డందియ లాంధ్రసం
స్కృతవాగ్రచనకుఁ దాల్చినకవీంద్రుఁ,
డలయుగంధరుసాటి యై, జేనిచే "నప్ప"
యనిపించుకొన్న మహామతీంద్రుఁ,
డహులట్టిసురతాను లరపదాండ్రకుఁ బక్క
బల్లెమై మన్న భూవల్లభేంద్రుఁ,
డాది వెలసినచోట, నాలవది యాంధ్ర
సాహితీసభానార్షికోత్సవ మెసంగు,
రాతుసాబ్దాది; నీసభ ప్రబలి, భాష
సకలశాస్త్రవయవపూర్ణ సలుపుఁగాత. 49

— రాజరాజనరేంద్రవర్ధంతి —

శా॥ శ్రీవేఁగీతిలకాయమాన మయి, కాశిం బోలుక్షేత్రం బసం
గా వాసిం గని, గంగ కగ్రసహజం గా భారతుల్ పల్కగో
దావర్యాపగవామభాగమున నాంధ్రజ్యోతి యౌరప్రోఁగ్, తదా
ఖ్యావిఖ్యాతము: రాణ్మహేంద్రుఁడు మహేంద్రాభుండు
నాకస్థితిన్. 50

ఉ॥ కాయము వోయినం, జెడనికాయము కీర్తి యూత్మ వోలె, నిం
ద్రాయితవై భవోజ్జ్వలుఁడు రాజనరేంద్రనగర్ నశించినన్,
బాయక కోట యన్మహితనామము మున్నటిచోట వాడుకన్,
స్థాయిగ రాజ్మహేంద్రమున స్మారక మౌ గతతద్విభూతికిన్. 52

ఉ॥ "ఒడ్డెలు రేవు గావను, ద్విజోద్ధు లొనర్పను స్నానపూజ, లే
యడ్డము లేనియట్టులు శివాలయముల్ మఱి వారివారియిం
డ్లొడ్డున, నేటికిం దవుల నొండ్లవి యొప్పఁగఁ గట్టె మెట్టఁ బ్రోల్
దొడ్డగ" నంచు వాస్తుకుశలుల్ స్తుతి సల్పగ రాజ్మహేంద్రునిన్

సీ॥ "చిత్రవధంబు చేసినచోటు, సారంగ
ధరుని మె" ట్టంచుఁ, "జిత్రాంగిమేడ"
యంచుఁ, "గాతేరు కాలువద్ద పాఁతే" అంచు,
జనము లానూయియంశములఁ గూర్చి,
వింతవింతలుగఁ గల్పించి విస్తరు గథల్
రాజమహేంద్రవరమ్మునందు;
భారతమ్మును నన్నభట్టారకుఁడు గాని,
నాఁడు వ్రాసినశాసనములు గాని,
వాకొననివాని; వాసని బాటి సేసి,
శారదాంబుదచంద్రనక్షత్రకాంత
రాజహంసప్రకాశ యూరాజ్మహేంద్రు
కీర్తిసతిఁ బ్రోయ నౌనె దుష్కీర్తిఁ గవులు? 53

ఆ॥ పురుషుఁ డిరుపనులను బొనరించె నే, నందు
మంచిఁ గొంచుఁ జెడ్డ మాన నలయు;
రాజ్మహేంద్రుసుగుణరత్నముల్ గొనుఁడు; చి
త్రాంగికల్లమాట యంటకుండు; 54

ఉ॥ వాడుక నాంధ్ర మాటపిక భాషగ నుండక, సంస్కృతంబుతోఁ
గూడిక చెంది, భారతపు గోశముచే ససమాసధన్యమై,
వేడుక నేఁత, కందుకులవీరుఁడు మూలము రాజమహేంద్రమం, డం
చోడక నాంధ్రయాంధ్రజనుఁ డొప్పఁడె ఘోరకృతఘ్నతాఘమున్?

ఉ॥ ఆది విరాటపర్వమున, "సంస్కృతకవిత్వవిశారదుండు, వి
ద్యాజయిత్తు" డటంచుఁ గొనియాడెను మెచ్చి కవిస్వయంభు, వే
దేదపురాణశాస్త్రముఖ వేదని, వాగనుశాసనుం డతం
డైదనవేద మిచ్చెఁ గృతి; నందఁడె బ్రహ్మత రాజరేంద్రుఁడున్?

ఉ॥ తొమ్మిదినూఱు లీజరుగుదుందుభికిన్ మనరాజరేంద్రుకా
ల; మ్మఖిలమ్ము తదగ్రిమ ఖల మ్మాతఁ డిడ్డవి నట్లె; కాని, స్వ
ర్గమ్మున భోజరాజుసరిగద్దియ భర్తను నిల్పి, సౌమన
స్యమ్మునఁ గాలు సందుకృతి; సత్కవియావికిఁ జావు లేదు గా.

ఉ॥ నాకమునుండి యొక్కపరి నన్నయభట్టును, రాజరేంద్రుఁడున్
రాక యొనర్చిరే నిటకు, రాజమహేంద్రము విందు సేయదే,
నైకకళాలయంబులఁ, దదంధ్రకృతుల్ గలకోశశాలలన్,
జేకుఱుధామనాశకటసేతుపథంబుల, సౌధవీథులన్? 58

మ॥ కురువంశాంకుర మేముహూర్తమున శంకుస్థాపనం జేసెనో
పురముం గట్టను రాజమహేంద్రుఁడు, మ దేముహూర్తంబునం
గావ్యమున్
విరచింపం, గవి నన్నభట్టు వసువుంబిళ్ళారిఁ బూజించెనో,
సిరియున్ వాణి, వసింతురి నేఁడుఁ జెలిమిన్ శ్రీరాజమహేంద్రిం
[బునన్. 59

ఉ॥ శ్రీయుతకృష్ణరాయలచరిత్రలవంటివి, రాణ్మహేంద్రి వే
చాటు వినంగ గామిని, యశస్స్థిరచిహ్నపురప్రబంధపా
రాయణ మాచరించి వసురాయఁడు వానిజయంతి, నెక్కువన్
వ్రాయఁ గలారివ్యాసరచనల్ వినఁ గోరి, ముగించు నింతటన్.

---

## శ్రీవిక్టోరియాజూబిలీపద్యరత్నములు.
1887

శ్రీవిక్టోరియారాణిగారిపరిపాలనము 50 సంవత్సరములు జరిగినసందర్భమున, జరిపినమహోత్సవపుసమయమున రచించిచదివినవి.

సీ॥ శ్రీమన్మహానేతుశీతాద్రిమధ్యస్థ
రత్నాకరైకసామ్రాజ్యరాల !
సాంభోనిధిద్వీపసర్వావనీవ్యాప
కాంగ్లేయరాజ్యోత్తమాంగురాల !
సర్వారసర్వారిగర్వాంధకారప్ర
దీపాయమానప్రతాపురాల !
పుత్రికాపౌత్రికాపుత్రపౌత్రాదికా
త్మీయసంతానసంప్రీతురాల !
దుష్టసంశిక్షణాశ్రాంతశిష్టరక్ష
ణైకచరితార్థజన్మధన్యాత్మురాల !
ప్రాజ్ఞవిక్టోరియామహారాజ్ఞి ! నీవె
ధరణిఁ బాలింపు మాచంద్రతారకముగ. 61

సీ॥ తపనుఁడు గాఁడు భవత్ప్రతాపంబునకు, సాటి,
యొకదేశమందె కాంతి యొకట లేమిఁ;
చందురుండు గాఁడు నీసల్లాపవదనంబున,
కల హిమానీవేళ నింపు గామి:
జలధరుండు గాఁడు యుష్మద్దానమునకుఁ, బా
త్రాపాత్రయోజనాప్రేక్ష లేమి;
అంభోధి యోఁడు నీగంభీరతకు, నట్టు
మ ట్లెల్లఁ గని పరాగ్ మంజులు గొనుట;
నిట్టు లింతేసివారి నోడించినట్టి
నీగుణావళి, కింక నీనృపతు లెంత?
ప్రాజ్ఞవిక్టోరియామహారాజ్ఞి! నీవె
ధరణిఁ బాలింపు మాచంద్రతారకంబు. ౬౨

సీ॥ నో రెండినను మంచినీ రింత కిన రాని
మరుభూమి, గౌతమీభరిత మయ్యెఁ,
బరికింపఁగా, గడ్డిపరకైన మొలకెత్తు
టరుదైనపట్టు, లుర్వరలె యయ్యెఁ;
జోడంబళులు గాంచి జుట్టువారికి, రాజ
నాలయన్నము భోజనాలు కయ్యెఁ;
"గాశి కేగినవారు కాటి కేగినవారి
సగి"దంట పరిహాసపాత్రి మయ్యెఁ;
బులియు మేఁకయు నేక మై జలము గ్రోలు;
నహహా! నీపాలనమున; ధర్మాత్మురాల!
ప్రాజ్ఞవిక్టోరియామహారాజ్ఞి! నీవె
ధరణిఁ బాలింపు మాచంద్రతారకంబు. ౬౩

సీ॥ అంధుఁడైనను, దారి నడుగ నక్కఱలేక,
యేగ నోఁ గాశి, రామేశ్వరంబు;
పంగుఁడైనను, గొంచెపాటి వెచ్చంబుతో
రా వచ్చు, ద్వీపాంతరములు చూచి;
బలహీనుఁడును, న్యాయపక్షంబువాఁడైనఁ,
బోరి గెల్వఁగ వచ్చు భూమిపతులఁ;
గడజాతివాఁడైన, గళియించుకొన్నచో,
నంజ కెక్కఁగ వచ్చు నాసనంబు;
అహహా! యీరథ్య, శీఘ్రయానములును,
న్యాయసభ, లిట్టి స్వేచ్ఛ, లేనాఁడు గలవు?
ప్రాజ్ఞవిక్టోరియామహారాజ్ఞి! నీవె
ధరణిఁ బాలింపు మాచంద్రతారకంబు. ౬౪

సీ॥ సంచి వెచ్చంబైన, శక్యంబు కానట్టి
జా, బొక్కసంబుతోఁ జక్క వచ్చు;
శతయోజనాంతరస్థలవార్తయైన, దూ
సాయతోఁ ఘటికలోపలనె వచ్చుఁ!
ప్రతి వ్రాయ నొకయేఁడు పట్టుగ్రంథము, వేయి
ప్రతు లొక్కనాఁడనె బడయ వచ్చుఁ!
బసలకు లైన, నిర్భయముగా జేబులో
నిమిడించుకొని, యాత్ర లేగ వచ్చు,
నీతపాలాలు, నీతీఁగె, లిట్టి యచ్చు,
లిట్టినా గొప్పఁ జేటులుఁ బుట్టఁబట్టి;
ప్రాజ్ఞవిక్టోరియామహారాజ్ఞి! నీవె
ధరణిఁ బాలింపు మాచంద్రతారకంబు. ౬౫

సీ॥ చిన్నికన్నియలను, జీడిపప్పు మిఠాయి,
పండ్లు, కానుక లిచ్చుపట్లు కొన్ని,
సాము చేసినవారిశ్రమ మారఁ, బహుభక్ష్య
ఫలపానకము లిచ్చుపట్లు కొన్ని,
శరవేగమునఁ బెద్దపడు వేసుకొని వచ్చు
పరుచువారల మెచ్చుపట్లు కొన్ని,
ముచ్చిబంగారంపుటచ్చక్షరంబుల
స్వాగతాల్ చదివెడుపట్లు కొన్ని,
పంక్తుల నొప్పనిచ్చినపట్లు కొన్ని,
గలిసి, నీయుత్సవముహాళ్పుఁ గాంచెఁ బురము;
ప్రాజ్ఞవిక్టోరియామహారాజ్ఞి! నీవె
ధరణిఁ బాలింపు మాచంద్రతారకంబు 68

సీ॥ పరిపాలనముక్రిందిప్రజలదుస్తమ, మిట్లు
పాపినా వనుచు, దీపాలు తెలుపు;
జగ మెల్ల నిండె నీసత్కీర్తి యీరీతిఁ,
బ్రీతి లేక యుఁ, మతాబాలు తెలుపు;
మిన్నందె నీప్రతాపౌన్నత్య మీదారి
ననుచుఁ, దారాచువ్వ లన్ని తెలుపుఁ;
బగవారికోటలఁ బట్టినావి న్నంచు,
వీథివీథులఁ గేతువితతి తెలుపుఁ;
బోరు మగుమామిడాకులతోరణములు,
నిత్యకల్యాణ మని తెల్పు నీకు జగతిఁ;
బ్రాజ్ఞవిక్టోరియామహారాజ్ఞి! నీవె
ధరణిఁ బాలింపు మాచంద్రతారకంబు. 69

సీ॥ మును ప్రవేశపరీక్ష కనక మానిచ్చోటఁ,
బట్టపరీక్షలే పెట్ట మయ్యె,
సభకు విద్యావంతు లరుదైన రాజుకే
యస్థానముల, నల్పు లపుడు పనిరి,
బొడ్డుకొంగులు విప్పి పుచ్చుకొచ్చేరిల,
లంచగొండులసంఖ్య కొంచెపడియెఁ,
గొల్ల లామాట, తప్పుగా నెఱుఁగనివారు,
సూనృతభాషణోత్సుకతఁ గనిరి,

కొందఱకు జీతములు మాని, కొంతమంది
కన్నవస్త్రంబులకు నిచ్చి యాదరించి,
తెలివి గలవారిఁ జదివించి తీర్చుచేసి,
కరుణ మెట్కాఫు కాలేజిఁ గావఁ బట్టె. 74

కం॥ ఉత్తరసర్కారుల స
త్యుత్తమమై రాజమహేంద్రి మునుపు, టుపాధ్యా
యోత్తముఁ డగు మెట్కా ఫీ
పత్తనము నలంకరింపఁ బట్టియె సుండీ. 75

సీ॥ జన్మమధ్యమునందుఁ జదువు రా దనుకొన్న
జనులు, శాస్త్రబ్రహ్మచారు లైరి,
హీను లై బిచ్చంబు నెత్తంగ వలయువా,
రుచు వేతనంపుటుద్యోగు లైరి,
నూనెగుమీసాలు రానికుఱ్ఱలు, మహా
జనసభాపూజభాజనము లైరి,
మాటనేర్పెఱుఁగనిమోటమొద్దులు, యుక్తి
యుక్తప్రసంగసంశక్తు లైరి,

కళాప్రియు లై సాధుజనులను గోము పలుచు
మంచివారలు, బహుబుద్ధిమంతు లైరి,
యౌర ! మెట్కాఫ్ప్రు, కరుణాళుఁ డగుచు దెంచి,
నేర్పె విద్యను, గాలేజి నిలుపఁ బట్టి. 76

కం॥ దానములు, విద్య యుత్తమ
దానము సూ, భుక్తిముక్తిదాయక మగుటన్;
దానిని, దనియ నొసంగెడి
దానిని, మెట్కాఫ్ప్రుఁ బోలుదాతలు కలరే? 77

తే॥ అర్థవంతుల నర్థార్థు లాశ్రయించి,
యర్థియే కాని, యొకఁ డేని యగునె దాత ?
బళిర ! మెట్కాఫ్ప్రువిద్యార్థవంతుఁ జేసె,
సకలవిద్యార్థులను గల్పశాఖు లైరి. 78

కం॥ జనకునికడ ముదుకందగు
తనయుఁడు పదు లైనమాడ్కిఁ, దా, మెట్కాఫ్ప్రు
గన వచ్చు మహోన్నతపద
మునతచ్ఛిష్యుండు, చదువుబుడుత నె పోలున్. 79

మ॥ పదునై దేండ్లయి వచ్చె; నీనడుమఁ గేంబ్రిట్టింగనే మేగనో
యదియే గాని, స్వదేశముం దలఁపఁ; డన్యం బాపురిన్ మెచ్చఁ; డీ
పదమే స్వార్థల, మన్నదమ్ములు సహోపాధ్యాయు, లీకాలెజీ
సుదతీరత్నము, ఛాత్రులే కొమరులంచుం జూచె మెట్కాఫ్దొర౯.

తే॥ ఆమడలు దూర మైనను, నాత్మలకును
దూర మొంకునె ? మెట్కాఫ్దొరను మనము,
మనల నాయన, కను చుందు మనుదినంబు;
దైవ మిడుఁ గాత్రఁ దత్పునర్దర్శనంబు. 81

తే॥ బహుల పక్షపాతాలు, బోధనాభ్యాసనపాట
వాలవాలము, పడమటి చదువు కడలి,
కదలి, యెడ్వర్డుపామమెట్కాఫ్గారు
నీవు కేగిన, మఱియొకడు చిన్న వాఁడె?
ఆ॥ రెండుపుష్కరంబు లుండినా విచ్చట,
మఱచి పోవు మయ్య, మమ్ము, మూఁడు
పట్టణమున నీవు పెట్టినకాలేజి,
శాంతదీప్తిఁ గన్నసంతసమున. 83

---

పై యుత్సవ సమయమున నిరువురు కన్నియలపరిసంగము.

సా ఉ

ముదిత! చూచుట కెంతో ముచ్చటగా నున్న; దిది యేమి యుత్స
[వమే?
చదువు గఱపినయొజ్జల యెడఁ గలిగినసద్భక్తి గదె; చెలియా! 84
ఈలాగు గురుభక్తి, యెడల నాటినయాతఁ డెవ్వఁ? డెంతటివాఁ
[డో కో?
కాలేజి యిట నిల్పఁ గలిగిన యీ. వీ. మెట్కాఫే యాతఁడు; సకియా!
ఓహో! జోడుగుఱ్ఱాలయుత్తమశకట మారోహించు నతఁడే గదా?
యాహార్ సేగొప్ప? యతఁడు రెండింట శాస్త్రాధికారి; చెలియా! 86
అందు కటమ్ము యిందలికాలేజులు రెంటి కాతఁడే విభుఁ డయ్యెను?
అందున కివి యెంత? యన్ని కాలేజీల కధిపుఁడు గా నస్సుఁడే. 87
ఎప్పుడో యొకసారి యీతఁడు విద్యాపరీక్షాధిపతి యయ్యెఁ గా?
యప్పుడే యిట బి.యే లారంభమైరి, యీయన చేతియుపకృతిని.
ఎన్ని కుటుంబము లీయనపుణ్యాన నన్నవస్త్రము లొందెనో?

10-4-1898 మెట్కాఫ్యంగుమెన్ లిటరరీఅస్సోసియేషను వారు జరిగించిన తద్ద్వితీయహాయనోత్సవమునఁ జదివినపద్యములు-

సీ॥ గోదావరీమండలోదారవిఖ్యాతి
కాధార మైనవిద్యాలయంబు,
కాలేజి, యేకయాశాలిమేలివయస్సు
పని కెల్ల నక్షయఫలము గాఁగ,
మనరాణ్మహేంద్రపత్తనమందు నుదయించి,
బీ. యే. లు మొదలుగాఁ బేర్మిఁ గన్న
తనవిత్తనంబు, లుత్తరపుసర్కారుల
నానాఁటి క్రొత్తగా నాటికొనుచు,
తోట లెత్తి ఫలించి, యేఁటేఁట వచ్చి
కడలు నెచ్చఁగ నలముకోఁ గ్రాలు; నట్టి
బహుళపాశ్చాత్యవిద్యలపంటకాఁపు,
కాంచు మెట్కాఫు పరమేశుకరుణప్రాపు. 100

సీ॥ వర్ధిష్ణువిద్యార్థివర్గహృద్గురుభక్త్య
భివ్యక్తతకు నెద్ది పెద్దయద్ద,
మాంధ్రదేశోపకార్యభిధానసంస్కృతి,
కాచంద్రతార మే దానవాలు,
పురాణభాషార్థిబుద్ధ్యుత్తేజనమునకు,
నత్తుగా నెద్ది వజ్రింపుసాన,
విషయవిచారాదివివిధమనఃపరి
శ్రమముల కేయది సాముగరిడి,
భీరుతాకంపముల కేది పిటికిమందు,
సభ్యతావాప్తి కెయ్యది సాధనంబు,
గనుత మభివృద్ధి, నట్టిమెట్కాఫుయువస
మాజ, మీశ్వరకారుణ్యమహిమఁ గలిమి. 101

కం॥ "కుల మింటికోఁతి" యనియెడు
పలుకు యథార్థంబు; నేఁడు బలిపిల్లలయీ
కోలఁదిసభకు, నాయకుఁడై
యలరు ఫిలిప్సుఁ డుపమండలాధిపుఁ డహహా. 102

కం॥ మంగళ మగ్రాసనపతి
కిం; గళ్యాణంబు సభ్యకృతులకు నెల్లన్!
వింగడము గాక యెప్పుడు
సంగడమున జరుగు నిట్టిసభ యేఁటేఁటన్. 103

---

మెట్కాఫుదొరవా రుపకారవేతనము పొంది స్వదేశమునకు వెళ్ళినందున, నాయనస్థానంబున వచ్చిన ఈ. డబ్ల్యూ. మిడిల్‌మాస్టరు దొరగారు రెండేండ్లయాఱుమాసము లుండి వివాహము చేసికొనుటకుఁ గాఁబోలుఁ గొంతకాలము సెలవు తీసికొని స్వదేశమునకుఁ బోవుచుండఁగాఁ, గాలేజీవిద్యార్థులు కృతజ్ఞతాసూచకముగా నాయనను గౌరవించుటకుఁ గావించినసభలోఁ జదివినపద్యములు.

20_8_98.

చ॥ భ్రమరమె, యెందుఁ బద్మమకరందముఁ గ్రోలఁగ నేరుచుం; జకో
రమె, హిమధామువెన్నెలను ద్రావఁగ నోపును; శిష్యుఁడే, గురూ
త్తముమహిమం గ్రహింపఁ దగుఁ; దత్త్వపరీక్ష యొనర్పఁగోరినం,
గ్రమముగ వారివారి వగుకర్జములే గుఱి, వారివారికిన్. 104

సీ॥ చెప్ప నేపాటకుఁ జెవి యొగ్గ కేవఁ? డన్న,
  జూపు నప్రే లేని వైపుఁ జూపు?
బహుకం బెవ్వాని మొగ్గకుఁ బో? దన్న,
  గ్రేఁగంటి నీ వేని కెలనఁ బొలయు;
నూనపర శ్రేయస్సహాస మేనిగొన? మన్న,
  వదనాబ్జ మెవ్వాని వంకఁ దిరుగుఁ;
బహువాత్రము చోటు పడయ దెక్కడ? నన్న,
  నాలుక యెవ్వాని నామ మొత్తు;
నెప్పుడు వంకరగా వ్రాయ దెవని చేతి
కలు? మటన్నను, వేనిపైఁ దలఁపు నిలుచు,
నట్టిమాశాస్త్రిపాఠశాలాధిపునకు,
మంగళం బయ్యెడును మిడిల్ మాస్టరు దొరకు. 105

సీ॥ దినునాథుఁ డుదయ ధాత్రీధరం బెక్కకుఁ,
  గలపాఠము లెల్లను, దెలివి గలిగి,
చెప్ప నక్కఱ లేక, స్వీయకృత్యంబులు
  గొఱంత వెట్టక చేసికొనుటఁ గన్న,
మాప్రిన్సిపల్ మహామహుఁడు మిడిల్ మాస్టు,
  కాలేజిఁ బాలించుకర్మము తోఁచు;
విన మెప్పు డెవరి నొచ్చిననోరఁ బల్కుట;
  ముప్పదినెల లేగ మొన్నలాగ;
యడుగు వెట్టిన దాది, విద్యార్థిసభలు
ప్రబలె మెట్కాఫు పేర, నీపాఠశాల;
వాని కగ్రాసనాధిపుఁ డీనయజ్ఞుఁ;
డితని పది వేలగుణముల కిదియె చాలు. 106

గలుగు లేఁడీయమావిమోక యను బోలె,
నొండొకటి మీఱుచాయగుణోత్కరమున,
మనెషుఘనుఁ డైన సమామిడిల్ మాస్టువిభుని
బాహువుల, వేగ లతకూన ప్రాఁకుఁ గాక. 109

ఆ॥ జాఁపూవుతావి, సహకారమాధురి,
చంపమూను వెలుఁగుఁ, జంపసంపుఁ
జర్చ, సరసకవిత, చక్కనిమామిడిల్
మాస్టుమంచితనము, మఱపు రావు. 110

ఉ॥ స్త్రీమరుపై బయ ల్వెడలి చెల్లెలితో, శుభకార్యసిద్ధికై,
సీమకుఁ బోవుచున్న తని, సింధువునం బృథుమీనమూర్తి యౌ
మామకుమాము, మామిడిలుమాస్టును జల్లగ నిల్లు సేర్చి, వే
కామినితోడ సేమముగఁ గ్రమ్మఱ మాపురిఁ జేర్చుఁ గావుతన్.

కం॥ పదునెనిమిదివందలతోం
బదియెనిమిది క్రీస్తుశకము, మాస మగ, స్త్రీ
ర్వాదిమూఁడు తేది, సాయము,
చదివె వ.సుం డష్టకంబు; సభ కాలేజిన్. 112

---

ఆర్ట్సుకాలేజీప్రిన్సిపలు ఓ. జె. కూల్డ్రిదొరగారిని జెన్నపురికి మార్చినందునఁ, దద్గౌరవార్థము కాలేజీలో జరిగినసభయందుఁ జదివిన పద్యములు 14_7_1916

ఉ॥ వేదములు లాడి. సోమకుఁడు వేధ మొఱంగి హరింప, దండితుం
గా దనుజుం బొనర్చి, శ్రుతికాండము నోమినమీనమూర్తి, కూ
ల్డ్రిదొర, రాజ్మహేంద్రినగరస్థకళానిలయాధినాథునిన్,
సాదరశీతలేక్షణసుధాంబుధి నిచ్చలు నోల లార్చుతన్. 113

ఉ॥ కోమలమానసాంబుజుఁడు కూల్డ్రియి, సర్వజనప్రియుండు నా,
నే, మొగమిచ్చకంబు వచియించితి నం చనుకోకుఁ; డేగెడుం
దా, మదరా సిశుం డన, జనం బటు మొన్నటివాన వేళ, నీ
వ్యోమము దానఁ జేసి నగవుం దెలుపుం బెనువృష్టి నం చనెన్.
మ॥ సమశీతోష్ణగుణప్రదేశమున నాసంబట్లు, కూల్డ్రిప్రభు
త్వమునన్ సేవ, ఘటించు మానవున కుత్సాహంబు సౌఖ్యంబు; దో
షములే చూడఁడు; మెచ్చుఁ గుణము; వాత్సల్యంబు విద్యార్థిసా
ర్థమునన్ మెం; డెడఁబాయ నిట్టిదొర, శోకంబుల్ కడుం గంకనే.
చ॥ ఇరువదియేండ్లకున్ బయిగ నే నొనరించినరాజసేవ, కీ
దొరశుభవర్తపంక్తు లిడె దొడ్డఫలంబులు; వేగపాటునం
జరపఁడు కార్య మేది; సువిచారుఁ, డుదారమనస్కుఁ, డీమనో
హరదరహాసభాసురముఖాబ్జుఁడు నామదిఁ బాయఁడేయెడన్. 116
తే॥ అచిరకాలమునన మీసహవాసమును, మ
హాకలాశాల, ననుఁగువిద్యార్థులకును,
దోడియొజ్జల, కిచటఁ జేకూడుఁ గాక;
యో. జె. కూల్డ్రిఘనుండ! కాలేజివిభుఁడ. 117

కూల్డ్రియిదొరగారు పయిమార్పును దొలఁగించుకొని చెన్న
పురినుండి వచ్చిననాఁడు రచించినది. 27_7_16

క॥ పున్నమచంద్రునిదర్శన
ము న్నెమ్మది సంస్మరింతు మును; నేఁ డన్నిం
బున్నెమున మరల నచ్చుటఁ,
గ్రొన్నెలపొడుపుం దలంతుఁ గూల్డ్రియిఁ జూడన్. 118

ఉ॥ కాసలె సం బొరకంబు స్ఫటికచ్ఛవికాంత్రియుక్తసద్గ
త్యాపిలః జేసి, నాకు నధికాపన్నిధిని సల్పించిచి పోసఁగ,
నానలఁ దేటపడ్డ నిజ, మూదొరయే ఘటియించె వెంకి మేల్;
దేవుఁడు దిప్పు చుండెను నదృష్టపుఁగీలు; నహుల్ స్వతంత్రులే?

ఉ॥ వచ్చిన నాఁటి తాను బదివత్సరముల్ పనుపై దురంధరత్వం
బెచ్చుగఁ, గొల్వున న్నిలుచఁ బెట్టుచు, న న్నుపకారవేతనా
బొచ్చెము లేక పొందుటకు యోగ్యుఁగ మొన్న నొనర్చె, నట్టి నీ
సచ్చరితుండు కూల్డ్రియు దెనన్, వసురాయఁడ నేఁ గృతజ్ఞుఁడన్.

---

రాజమహేంద్రవరముట్రెయినింగుకాలేజీవైసుప్రిన్సిపలు మహారాష్ట్రబ్రాహ్మణులు మ॥ రా॥ శ్రీ టి. వి. సుబ్బారావుపంతులుగారుపకారవేతనము పడయుటకై తమయుద్యోగము చాలించుకొను తరుణమున రచించినపద్యములు.—1905

సీ॥ శ్రీరామచంద్రునిఁ జేరంగఁ దనరాజ
తేజంబు, సహజశాంతిని వహించి,
విశ్రాంతి నొందినభృగురామమూర్తి, నా
తలఁపున నిలుచు నీతరుణమందు,
బహుకాల మధికారపదమున వర్తించి,
పరిణతం బౌనిజప్రాయమందు
నుపకారవేతనం బొంది, సుఖంపఁ బో
యెడుధన్యు, రాజమహేంద్రబోధ
నాభ్యసనకళాశాల కుపాధినాథు,
బాలకక్రమశిక్షానిబంధనప్రి
చండు, నిరతాస్మదాద్యనుచరదయాళు,
గర్వదూరు, సుబ్బారావుఘనునిఁ జూడ. 126

సీ॥ చెంగటముఁ జూచినఁ జెక్కుఁబులిగఁ దోఁతువు; గాని,
హిరలవ్యాకయంబు వెన్నపూస ;
కప్పులు భుజగభోగచ్ఛాయ వసియించు
కై వశిఁ గాక, రాకాసుధాంశు
హంసవెన్నెలబైల నంటినట్టులు, నిన్న
మొన్నలాగునఁ జెల్లె నెన్నొ యోంష్ట్ర
పీఠిపాలనమున ; నోరఁ జక్కెర వెట్టఁ,
జేఁ దని యేవారిఁ జెప్పఁ గలము ?
తే॥ విత్తనం బిట్టి దని యేల వేఱ నుడువ ?
ఫలములను బట్టియే దానిఁ దెలియ వచ్చు;
సుబ్బరావుపంతులవారిసుగుణములను
జాటు వేనోళ్ళ, నీమహోత్సవమె నేఁడు. 127
సీ॥ పూలు చల్లుచు, నశ్వముఁ బూనిచిననాల్గు
కంచులబండిఁ గూర్చుండఁ బెట్టి,
వీనుల కమృతంపుసోన లౌమృదుతూర్య
నాదముల్ చెలఁగ, ఘంటాపథమున
నిఱుకాటమునను జూపఱు ప్రోపు లాడ, నూ
రేగించుకొనుచు, లేఁద్రుణపుఁబచ్చ
జముకాణమునకు సాయముగఁ, డెక్కెములు ప
ల్లవతోరణములు, నలంకృతు లగు
విరివి కాలేజిసుందరావరణమునకుఁ
దెచ్చి, యుత్సాహనాదముల్ హెచ్చ, నొజ్జఁ
దనము పొగ డొంద, శిష్యబృందంబు, సుబ్బ
రావు నెడఁ జూపుభక్తిఁ దరంబె పొగడ ? 128

ఉ॥ భానునిపాలనంబునఁ బవల్ గలువల్ ముకుళించె చెలున్; సుధా
భానునియేల్బడిన్ నిసిని బంకజముల్ ముకుళించు; నంతటన్
దా నలరించుచుం గౌరతరం బొనరించుట యేమి కారణం?
బైటనను సుబ్బరావు, మన కద్భుతశక్తిని జూపెఁ బ్రకృతియున్.

సీ॥ పూతపాతివ్రత్యమున నఘంఘతికిని
బ్రీతి వచ్చునిల్లాలుఁ, బాశ్చాత్యస
కోపదూరులుఁ, గోడండ్రుఁ, గోటిరం బొనరించు
కూఁతులు, బొట్టెలుఁ, గూన లుండి,
పూచిసతంగేటిపొడవిషమ్మునఁ గనుఁ
బండు వయ్యోపుకొంబలంబుతోఁడ
సగిడు చుట్ట యటుండ, నిరు డీడన బులుఁ
నాతేజి నీయనగదిని బడిన
పిసుగునకుఁ దప్పు టరు; దున్న బడియె నాఁడు,
గనునె యిట్టివినోద మీఘనుఁడు నేఁడు?
సుస్థు లేటికిఁ? దంజూరుసుబ్బరావు
పంతులయదృష్ట, మరిదితపగఫలంబు. 130

ఉ॥ నేత్రభరంబు పాణికిని, వేష్టనభారము మహాశిరంబు, ఛత్ర
చ్ఛత్రిభరంబు మూఁపునకు, శ్యామతనుత్రభరంబు మేనఁ, కే
మాత్రము నడపఁ బోవిఁక; రిపూఘవుపాదములం భజించుచుం,
బుత్రుల కిచ్చి యింటిభరముల్, సుఖయించుచుఁ సుబ్బరావు పిటన్.

మిత్రుఁడగు బారిష్టరు ఈ. యస్. విల్కిన్సుదొరగారికోరిక ప్రకారము జడ్జి యైన, సి. యే, బర్డుదొరగారిని గుఱించి రచించినవి.

---

శా॥ శ్రీ, యాయుర్విభవాదులుం గలిగి, ధాత్రిన్ వర్ధిలం జేయుతన్,
శ్రీరామాంబాయకుఁ డీశుఁ డీయసను బత్నీబంధులంగూర్చి, స
న్మాన్యయానీశుఁ, గృపాళు, సర్వసము, శాంతాత్ముం, బ్రసన్నా
[ననున్.
సీ. యే. బర్డుదొరన్, జితేంద్రియనిభున్, సీమప్రయాణోన్ముఖున్.

సీ॥ పదొమ్మిదవశతాబ్దమున నెన్నదియెన్మి
దవయేఁట నాగస్టునందు వచ్చె;
నోరపారలు లేక పారమార్థికబుద్ధి,
ధర్మంబు రెండువత్సరము లరసెఁ;
జెప్పనివారిదే చేటుగా, నియుగెలం
కునవారిమనవి వల్దనక వినియెఁ;
దనయేలుబడి నైనతత్కాలికపుమార్పు,
లిపుడు ఖాయ మొనర్చి యెలమిఁ బెంచె;
తే॥ రాజయోగంబు గా, దిది రాజయోగ
మనుచు విద్వాంసు లనఁగ, నేకాంతవృత్తిఁ
బంజరాంతరగత మగుపతగమట్లు,
బర్డుదొర ధర్మబద్ధుఁడై పరిఢవిల్లె. 133

చ॥ తనతనన్యాయవాదమునఁ దక్కువ యొక్కటఁ గాదు కాన, బ
ర్డనుదొరపక్షపాతమున కండటుఁ దుల్యులె న్యాయవాదు; లీ
యస, తొలిపాత్రియు మించు ఘనమహాప్రభుసేవకు నిచ్చి, వార్ధకం
బున సుఖవిశ్రమార్థము స్వభూమికి నేగెడు; నెంతపుణ్యమో.

11-11-1908 కీలకపుష్కరాంతమున బర్కెటునసమ్మానము.

---

ఉ॥ భానుఁడు శీతభానుఁడును, భాసిలునిర్మలపుష్కరస్థవన్,
మానవకర్మముల్ గనుచు, మంచికి మంచిని, జెడ్డఁ జెడ్డకుం,
బూని ఫలింపఁ జేయుదురు, ప్రోచుత బర్కెటు సబ్కలెక్టరుం
బ్రేమఁ బుష్కరప్రజలదీవన లందినమాననీయునిన్. 141

ఉ॥ అర్కుఁడు గానరాక, పగ లంతయు బోరున మొత్తువానలం,
దిక్కులలో నిజప్రభు వదేవనిగా జనసౌఖ్యకాంక్షియై,
కూర్క భుజింపఁ దీఱనియకుంఠితదీక్షఁ బురిం జరించుటం,
బర్కెటుఘోటి, నాఁటియలవాటున గొంపలు దూఱు నిప్పుడున్

చ॥ ప్రవితతరాణ్మహేంద్రనగరంబునఁ గంటిని బుష్కరత్రయం;
బెవరికి లేదు బర్కెటున కీపదవిం గలవే; రితండు రే
పవలును, దీక్షఁ బుష్కరపుఁబర్వమునం బ్రజకంటిఱెప్పయై,
కవికిని శిల్పి కీప్లు పని కల్పన చేసెను; మేలు మేల్గనున్. 143

చ॥ అసహాయుని గారవింపమి, యనర్హునిఁ గైకొని గారవించునై
ఖరి సుమి; పుష్కరప్రజలకష్టసుఖంబుల కైనబర్కెటుం,
బరమదయాళుఁ, జిత్రపటబద్ధునిఁ జేసి, వినోదవస్తుమం
టపమున నిల్పఁ బెట్టిరి వినీతిఁ; బురప్రజ లెంతప్రాజ్ఞులో. 144



మదరాసు రాజధానిగవర్నరు సర్ ఆర్థరులాలీ 1908 సం॥రం డిసెంబరు 21 వ తేదీని గుంటూరుకు వచ్చినప్పుడు తన్నగరవాస్తవ్యుల ప్రార్థనాహూతుఁడనై వ్రాసి సభలోఁ జదివినవి.

---

సీ॥ శ్రీరామభరతాదిసూర్యచంద్రాన్వయా
న్వర్థరాజభుజాపురావితంబు,
వసిష్ఠకపిలభార్గవబాదరాయణముఖ్య
పరమర్షివాక్యసంభావితంబు,
గంభీరజాహ్నవీగౌతమీముఖనదీ
జీవనపావనక్షేత్రవనము,
కలధౌతరత్నాదిఖనిజసమృద్ధహి
మాలయాద్యుత్తమమహాగ్ర్యధనము,
తే॥ నగుభరతభూమి, సప్తమహర్షిమండ
లాకృతిప్రాజ్యమైన్న రాజ్యంబునకును
బాలకుండను, నర్థరులాలిప్రభుని
ఘనత, రాష్ట్రజనీనత వినుతిఁ గాంచు. 145

ఉ॥ భారత, మొండు రెండు తొలిపర్వము లంటక, సైపదేక్, సుధా
ధారను గేయవాఙ్మధురతం దెలిఁగించినధీరుతాతచేఁ
జేరు నహించి, లాలివిభువీక్షకు భాజన మయ్యె నేఁడు గుం
టూరు, బళా! స్వనామకవినూతనమండలరాజధాని యై. 146

చ॥ ఫలము లొసంగి, దేశమును బాగొనరించెడు శాఖ లెన్నియో
గలిగినవృత్తివృక్షమునఁ, గాలవశంబునఁ గొన్నికొన్ని కొ
మ్మలు చిరింప కుంటఁ గని, మాన్యసరార్థరులాలిపాలకుం,
డెలమిని దాని కిష్టు ఘటియించెడుఁ జక్కనిదోహదక్రియన్ 147

మ॥ కవిస్తుభుగ్భర్త్రయుఁ, జెన్నపాలక సరార్థర్ లాలి దేవారశజుం,
పతిమైత్రిం గరుణాసమేతు లయి, సస్వర్శ్రేణిశస్త్రానుకం
కితఁ జాప న్నిజభృత్యు లౌజలదులన్ శాసించి, నిశ్వాసమా
రుత సంఘూర్ణితకర్ణశాఖ్రశుత్రటికినీరోధంబుఁ గావింపరే? 148

చ॥ చెలువలుఁ బూరుషుల్ గలసి, చిల్లర తక్కున నాల్గుకోట్లు, ని
చ్చలుఁ బ్రదుదారశాసనవశంబున సర్వసుఖంబు లొంది న
ద్ధిలెదరు; లాలిపాలకవరేణ్య! ధరం బరమేశ్వరుండు, ని
న్నలఘుదయారసంబునఁ జిరాయు, నిరామయుఁ జేయుఁ గావు
[తన్. 149

ఉ॥ రాజమహేంద్రిపట్టణవరంబున బోధనపాఠశాలలో
నో జగుసుబ్బరాయఁడు బహుప్రభుభక్తిని గ్రైతఁ గా న్కిడున్,
రాజు ప్రతీచిఁ గ్రొత్తగను రాఁ గని పోఁగును బోలె; దీని న
వ్యాజకృపన్ గ్రహింపుము; సరార్థరులాలినృపాలచంద్రమా 150

ఉ॥ ధర్మజు రాజసూయమునఁ దత్ప్రభు కాన్కల కెన్ని యెన్ని యో
నిర్మలరత్నముల్ కొలువు నిండను గుప్పలు వోసి రందు; రా
పేర్మి యథార్థ మంచుఁ దలఁపింప, వెలాలినృపాలురాక గుం
టూర్మహనీయలౌకికజనుల్ సమకూర్చినపుష్పపూగముల్?

మదరాసు రాజధానిగవర్నరు సర్ ఆర్థరులాలీ గుంటూరు నుండి రాజమహేంద్రిము విచ్చేసినప్పుడు తద్గౌరవార్థంబు కావించిన సభలో చదివినపద్యములు.

సీ॥ శ్రీచెన్నరాజ్యలక్ష్మీలాలనైకక
ళ్యాణడోలాయితాయతభుజుండ!
ప్రకృతిరంజనసుఖోపాయసంతతయోజ
నానందరసపూర్ణమానసుండ!

శాసకసత్కీర్తికాపాత్రియమండలశ్రీ
హర్షసంధాయకస్వాగతుండవు !
పౌరవర్గోచితప్రార్థనానస్యన
త్ఫలహేతుఘనసౌమ్యసత్కృపుండ

తే॥ ప్రకృతగోదావరీసరిన్నికటరాజ్మ
హేంద్రిపట్టణవాస్తవ్యసృక్ఛకోర
పాళివిధుఁడ ! సర్వార్థరులాలిప్రభుఁడ !
నిబిడవిభవవిభ్రాజుఁడ ! నీకు జయము. 152

ఉ॥ ఓజయశాలి ! లాలిమహిపోత్తమ ! త్వత్పదముద్రఁ గన్న యా
రాజమహేంద్రిపట్టణము, రాయలు మెచ్చినయాంధ్రభాష, సం
పూజితకావ్యకర్తగను మున్నఁగ నన్నయభట్టునానవాం
భోజమునం జనించి, విభుఁ బొందినపుట్టినమెట్టినిల్ సుమీ. 153

ఉ॥ సేతుహిమాద్రిప్రాగపరసింధుయుగాంతరకర్మభూమ్యసం
ఖ్యాతసమాగతాతిథు, లఖండదయం బడివేలయూహ్యమౌ
గౌతమిపుష్కరంబునకుఁ గా సెల విచ్చిననీకు, దీనవత్
జాత లొసంగి, సౌఖ్యమునఁ జొక్కినప్రోలిది ; లాలిపాలకా !

తే॥ సత్యమెడ్వర్డుభారతచక్రవర్తి
శాసనవతంస ! లాలి ! నీశయకమలము,
మాతృగుణధన్యసార్వభౌమప్రసాద
రసము, రాష్ట్రిశ్రీ కామోద మొసఁగ నోసఁగు. 155

మ॥ పటురాజ్ఞీజననీసుఘోషణమహాపంచాశదబ్దోత్సవా
ర్భటసంప్రీణితసార్వభౌమవినుతైడ్వర్డుప్రసాదంబుగా,
నిట నస్మాదృశసన్నివేతనులు, మొన్నే వారపుంటేత, మా
గట నీహాస్తము పంచి యీ, నలర లేదా ? లాలినాథాగ్రణీ! 156

తే॥ అప్రదోషచక్రావనుం డగుసినుఁ డన,
నప్రదోషచక్రావనుం డగునినునకు,
నప్రదోషచక్రావనుం డగునినుండ !
తనుదు లాలీశ ! ప్రతినిధిత్వమున కీవు. 157

ఆ॥ శ్రీరమాళి ! లాలి ! వెన్లాక్ ప్రభుండును, నీ,
వన్నదమ్ము లన్న, విన్నవారు,
బొమ్మఁ గన్నతల్లి, మేటిసమ్రాట్ప్రీతి
నిఖిలకల్పవల్లి, నిక్క మవరె ? 158

శా॥ శ్రీరంగేశుఁడు, శేషశైలపతి, కాంచీభక్త, భద్రాచలా
గారుం, డాదిగ విష్ణుమూర్తులు, స్వరత్నాకార్యభారంబు నిన్
ధీరుం బూన్చి, సుఖింతురి నీమహిని ; దద్దీవ్యద్దయన్, మానుషో
దారానందము నంది నద్ధిలు, సరార్థర్ లాలిభూపాలకా ! 159

ఉ॥ గారవ మొప్పఁ, బద్యములు కానుకగాఁ బ్రభుభక్తి నిచ్చి, గుం
టూరఁ ద్వదాద్యదర్శనమహోత్సవ మందినసుబ్బరాయుఁడం ;
దూరమునందు నేఁ గని, నుతుల్ మును సల్పినవేల్పు, తోన నా
చేఁపునఁ దోఁచె ; నే మని నదింతు నదృష్టము ? లాలిపాలకా !

---

మదరాను గవర్నరు సర్ ఆర్థరులాలీగారిగౌరవార్థము వేఱు వేఱువినోదములు జరిపినవారికిఁ గలెక్టరు బ్రాడీదొరగారు బహుమానము లిచ్చునసందర్భమున గుంటూరిలోఁ జదివినవి.

క॥ ఫాలము, హృదయవిశాలత,
ఫాలము హృదయమును గలసి, త్వన్నామము ము
న్నాలింప కుండ, దర్శన
వేళనె పరిజ కెఱుకపఱుచు వే ; బ్రాడిదొరా ! 161

సద్భుతయోగజాతార్యసర్వజ్ఞతా
పరిహాసికుమతివాగ్బంధసంఘుఁ,
బ్రత్నసిర్మలసత్యరత్నయుక్ప్రాచీన
తతశాస్త్రపేటికాతాళయంత్రి,
ఆ॥ మస్యమతవచశ్శతాసారహిందుభూ
జనితబహుళవర్ణసంకరోరు
పంకభాస్కరంబు, భవ్యదివ్యజ్ఞాన
వరసమాజ, మవని వఱలుఁ గాత. 166

సీ॥ ఉచ్చరింపఁ, దదాఖ్యఁ బచ్చిబూతుగ నెంచు
వారు, రామాద్యుత్సవములు సేయఁ,
బాలిమి, జందెము దండెమున నాఱ వేయువా,
రాష్ట సహస్రగాయత్రి సలుపఁ
గాలుసేతుల నైనఁ గడుగక కుడుచువా
రలు, స్నానసంధ్యాభిరతి వహింప,
వేదవాక్కులు వీనుసూదు లౌవారలు,
తద్వ్యాఖ్యలొలుకు నుత్కంఠఁ బూన,
బుద్ధిహీను లనుచుఁ బూర్వులఁ దిట్టువా,
రంతవారు లేర యనుచుఁ బొగడ,
నయ్యె, నేది వెలయ ; నట్టిదివ్యజ్ఞాన
వరసమాజ మవని వఱలుఁ గాత. 167

సీ॥ " భరతఖండమె, జ్ఞానభానూదయమునకుఁ
దొలునేలతా " ల్పని పలుకు నెద్ద,
" పడమరఁ బ్రొద్దు గ్రుంకెడుఁ గాదె ? యూదెస
వెలుఁ గబ్బు నెటు ? " లంచుఁ బలుకు నెద్ది,

" బోధదుగ్ధములు, హిందూధాత్రికడఁ గాక,
కలుగు మీ కెట ? " నంచుఁ బలుకు నెవ్వ,
" పౌరుఁగులోఁ బాల్లేని మొదవును బిదుకఁ, దాఁ
పులె కావె ఫల " మంచుఁ బలుకు నెవ్వ,
" పెరటిచెట్టు మందుఁ బొరుగింటిపులిసార "
యన్నసామెతకును నర్థ మేర,
లనెడు మనల నెగ్గి, యట్టిదివ్యజ్ఞాన
వరసమాజ, మవని వఱలుఁ గాత. 168

సీ॥ ప ప్పున్నగింజ, కప్పుకే యుంకునే తప్పు
వో లెను, మనము నీ వోయ కున్న ?
సిద్ధ రేచ్చను వచ్చి యేమూలనుండియో,
కాదంబినియె వృష్టిఁ గలుగఁ జేయ,
దలచూసి ఫల మిచ్చుఁ; దథ్యమే ; హిందువుల్
తమశాస్త్రముల ననాదర మొసర్చ,
నవి వోయెనే ? యిప్పు డానిబెస టను
ద్వీపాంతరాగతశ్రీమ్మదూ క్తి
ధార, నెల్ల రద్భుతము నొంపఁగాఁ దేట
పడఁగ లేదె ? సర్వభారతులకు
నాత్మహితముఁ గూర్చునట్టిదివ్యజ్ఞాన
వరసమాజ, మవని వఱలుఁ గాత. 169

---

చిత్రిపువేంకటాచలముగారికి రాయబహద్దరుబిరుదము

---

శా॥ శ్రీమద్రాయబహద్దరాదిబిరుదస్వీకారదానంబు, లె [సద్గుణ
న్నో మాఱుల్ గనఁగొందు; మైన నదు దోహో! యన్న; పీ
గ్రాముం, జిత్రిపువేంకటాచలము, సద్రామాస్త్రత్రరాయాంకితున్,
క్షేమారోగ్యచిరాయురాదు లిడి, లక్ష్మీభర్త రక్షించుతన్. 170

సీ॥ పెద్దయుద్యోగులు పెక్కండ్రు గల; రండు,
గర్వహీనుల వెదకంగ వలయు,
బీ. యెస్. కృతార్థులు వేనవేల్ గల; రందుఁ,
బితృభక్తియుక్తుల వెదక వలయు,
స్వమతానురక్తులు పలువు రుండుదు; రందు,
నిష్ఠాగరిష్ఠుల నెమక వలయు,
సామర్థ్యవంతులు చాల నుండుదు; రందుఁ,
బరహితాచరణుల నరయ వలయుఁ,

ప్రబలహిందూర్వరాసార్వభౌమదత్త
రాయబహదూరుబిరుదవిరాజమాను,
వరదరాజమహాతపఃఫలము, వేంక
టాచలామాత్యుఁ బోల్ప; యథార్థముగను. 171

మ॥ చదు వెచ్చించె; ఘటించె నాగరకతన్; సర్వప్రజాళీసుఖా
స్పదనానాద్భుతయంత్రితంత్రముల నుత్పాదించె, రంజించె మా
హృదయంబుల్; నిదురించు కన్ దెఱపె; నెన్నే మేలు మాకర్థ్మ, మ
య్యది చేకూర్చెడు నాంగ్లరాజ్య, మిలపై నాచంద్రతారార్కమై

క॥ విలసితగోదావరిమం
డలపతి, నెలివెన్ద్దొరం, జనశ్లాఘ్యు, సభా
తిలకము, రాజప్రతినిధి,
నెలమిం గోపాలదేవుఁ డేలుం గాతన్ 173



## శ్రీరాజా వా॥ శ్రీవిశ్వసుందరరావు బహద్దరు జమీందారుగారి వివాహమహోత్సవాశీర్వచనపద్యరత్నాని-

---

సీ॥ శ్రీమందరాక్రమంథామథ్యమానాబ్ధి
గనలి, మంగళతూర్యరవము గాఁగ,
సద్యస్సముత్పన్నసకలకళాస్పదా
ప్సరసలు, నాగవాసంబు గాఁగ,
సజరామరత్వభేషజసుధాదరబుధా
వళి, సభాసదవిప్రకులము గాఁగ,
బాలభానుప్రభాభవ్యకౌస్తుభమణి,
దానసాద్గుణ్యార్థదక్షిణయుఁ గ,
శీఘ్రసంక్షుబ్ధవిగళితక్షీరబిందు
పటలి, తెలిముత్తెములతలంబ్రాలు గాఁగ,
వెలయునాదిలక్ష్మీమహావిష్ణుదివ్య
పరిణయము, ప్రోచు నీవధూవరుల సిరుల. 174

ఆ॥ విశ్వసుందరునకు వెలఁది గావించి యీ
త్రిపురసుందరిని, విరించనుండు,
వాడదేవునకును వడ్లమన్నాటికి,
బాంధనంబు సహజభంగిఁ గూర్చె. 175

సీ॥ ప్రభవించె, బహుతులాభారముల్ తూఁగిన
కొండ్రెడ్లకోటనత్కులమునందు,
లక్ష్మీసరస్వతీలాస్యరంగం బగు
వాడదేవుమహాన్వవాయమునకు

రత్నదీపము, సుందరప్రభ, నటియించెఁ,
గనె, మంజుమణిపుత్రికాత్రియంబుఁ,
దత్తదపత్యతత్సంతానమూలంబు
న, సనేకదేశబాంధవముఁ గాంచె,
నాత్మదత్తపుత్రుఁ డైనవాహితుని
పరిణయంబు జరుప, బందరునకు
గజభటాశ్వబంధుకలిత యై వచ్చిన
ప్రథితగుణకదంబ, రంగమాంబ. 176

—— పాటకచ్చేరీలు. ——

ఆ॥ వెదురుఁగ్రోవి లేదె? మృదులాంగుళులు లేవె?
మాకు లేదె వదనమారుతంబు?
జనులకర్ణములను, సంజీవరాయని
వట్టు లిడవు గాని యమృతరసముఁ. 177

ఆ॥ మూర్ఛ పుచ్చుఁ బ్రాణములఁ దేర్చు; నహహా! యీ
నాగరత్న; మింతినామమునకు,
సూరిజనులు! విశ్వసుందరపరిణయా
హ్వాతు! లరసి యర్థయుగముఁ జెప్పుఁడ. 178

క॥ మాయించును గనుఱెప్పల,
హాయి యనం జేయు నోళ్ళ, నట్టిటు లూఁచుఁ
మాయాడలలను, మేనుల,
గాయకకోటయఫిడేలుకౌశలి; వహవా! 179

క॥ పదభూషణసహితము, శా
రద నీసభ విశ్వసుందరా! నటియించుం
గదరా, సంగనతుంబురు
మృదువీణాకలనినాదమిషఁ జెవి సాగియన్. 180

శా॥ మంత్రిప్రెగ్గడ నరసమ్మగ్గజలధిన్ మాణిక్య, మాత్వోలస
త్సంత్రాణాపసమస్థగోత్రశతపత్రశ్రేణిమిత్రుండు, గో
సంత్రాణుండు, భుజంగరాయకృతి, వేశ్యన్ మాని, తా వాణి నా
మంత్రించెన్ సుతపెండ్లికిఁ; దన్నృతి, సుదాంపత్యాప్తికై జోటి
[కిన్. 185

ఆ॥ నాడ కేవుకతన, నష్టమన్నాటి కు
దారు లౌజమీనుదార్ల తోడ
నిచ్చిపుచ్చుకొనెడునిట్టివియ్యములు; రం
గాంబదుహితమనసు రాలు వధువు. 186

తే॥ విశ్వసుందరుపరిణయవేది మొలచి,
యతనిపెదమేనగోడలియనుఁగుపెండ్లి
పందిరిని ప్రాఁకుసుమనస్సుపత్రగాంధ్ర
కవిసభావల్లి, సుఫలముల్ కవకు నొసఁగు. 187

—♦ వివాహవైభవము. ♦—

ఉ॥ నాలవనాఁటిపెండ్లి యిదె; నావలి నీపని నేఁడె; భద్రశుం
డాలమ! వచ్చినందులకు నల్వురు సంతసమున్, వధూవరుల్
చాలఁగ మన్ననింగనఁగ, సల్పుద మిప్వర మర్హ్యకృత్యముల్
లీలఁ; భుజంగరాయశుభలేఖలనిర్ణయ, మిట్టిదే కదా. 188

క॥ "రాజా" భుజంగరాట్కవి
భోజుఁ డహో, దేవదుందుభుల మ్రోఁగించెన్,
భోజనములఁ, బూజనముల,
భూజనములఁ దనిపి, ప్రథమపుత్రికపెండ్లిన్. 189

— ద్వితీయపుత్రికావివాహము. —

తే॥ శ్రీమహాలక్ష్మిఁ, గృష్ణమూర్తిని, బహుమాన
ములఁ నొసర్చినధాత, యిప్పు డనుగ్ర
హించుఁ గావుత, సంతానవృద్ధి, సకల
సౌఖ్యములు, నాయురారోగ్యసంపదలును. 190

తే॥ ఒక్కకన్యాప్రదానంబు నొసఁగుచుండు,
బాలకడలికి జాబిల్లి పట్టి కలిగె;
సలిపె రెండవప్పటికి నట్టిసత్కృత్యులు భగ
వంగిరా, వొందు నింకఁ దత్సత్ఫలము. 191

— తృతీయపుత్రికావివాహము —

చ॥ సిపల జగాలు తేజరిల సింధువునం బ్రభవించి, విశ్వసం
భరణధురీణుఁ డైనతనపాణి నలర్చినలోకమాత, ని
బ్బర మగుప్రేమఁ బేరురముపై వహియించిన దేవుఁ, డీవహా
వరులను బ్రోచు, శ్రేయములవారిగ, రంగమజోగరావుఁ గాన్. 192

క॥ హరితుఁడు, మౌద్గల్యుఁడు, సలు
పరె హర్షోత్సవము బ్రహ్మపట్టణమున, మం
తిరిపెగ్గడవారిప్రవుల
పరస్పరశ్రీకరంపుబాంధవ్యమునన్. 193

తే॥ దివ్యభవనంబు లిఱుకిండ్లు, దేవిడీలు
దిడ్డిగంతలు గా, నరుదేర బంధు
సమితి, మంతిరి పెగ్గడ భుజంగరాయ
కోవిదుఁ డొనర్చె, మూఁడవకూఁతు పెండ్లి. 194

తే॥ ముడుక వేసి, రూపాయకు మూఁడు సేర్ల
ప్రాలు, దొరకని సిద్ధార్థిపచ్చికరవు
నందు, రాజాన్నసంతృప్తు లైరి వేల
కొలఁదిగ, భుజంగరాట్కవిసూఁతు పెండ్లి. 195

ఉ॥ మ్రుమ్మెఱు, దేవదుందుభులు మ్రోయ నొనర్చెను గన్యకాప్రదా
నమ్ములు "జే" యనం గవిజనమ్ములు, పాత్రవరాన్నవాయపో
షమ్ముఁగ, మంత్రిశ్రేష్ఠ భుజంగధరావరుఁ; డయ్యగణ్యపు
ణ్య, మ్మభివృద్ధిఁ జేయుతఁ దదన్వయ, మాశశితారకంబుగన్. 196

——• తురీయపుత్రికావివాహము •——

క॥ శ్రీమంత్రిప్రెగడకులా
బ్ధామేందు భుజంగరాయతనయఁ దురీయం
గా మేశ్వరి, దామోదరు,
నోము వధూవరుల, నీశుఁ డొసఁగుచు సిరులన్. 197

తే॥ పార్వతీపరమేశ్వరుల్, భారతీహి
రణ్యగర్భులు, లక్ష్మీ నారాయణుండుఁ,
బ్రస్తరించుత మఖిలదాంపత్యసౌఖ్య
ములను, గామేశ్వరికిని దామోదరునకు. 198

తే॥ వల్లమన్నాటిశిష్టాన్వవాయదుగ్ధ
సింధుశీతాంశుఁ, డీనారసింహసచివుఁ
డవుట వియ్యంకుఁ, డీభుజంగాఖ్యునకు, సు
వర్ణసంగతి మణి కబ్బుభంగి కాదె? 199

చ॥ తనగృహలక్ష్మి, బంధుజనతాసురభిప్రథ, సుబ్బమాంబ, వం
పను గలధౌతపాత్రమున వారిఁ, జొకాటపు వెండిపళ్లెరం
బున వరుపాదముల్ కడిగి, భూరిసుదక్షిణఁ బుత్రి ధారవో
యునెడ, భుజంగరాయకర, ముద్ధర యద్దర! కల్పశాఖకున్. 200

మ॥ సముఖీతోష్టపురాద్రిమాఖపరపక్షంబందు, దైత్యేజ్యవా
రముతోఁ గూడు తృతీయ, హస్త, దివహోరాభద్రలగ్నంబునన్,
దమకామేశ్వరి యన్ చతుర్థసుతకున్ గావించెఁ బెండ్లిన్, భుజం
గమహీశుండు, వధూవరుల్ మెఱవడిం గాంచం గజాహ్వాఘులై.

ఉ॥ పందులయిందులం, బరిణయోత్సవముల్ విభవోజ్జ్వలంబు లౌ
చుండును; గాని, తోఁ, మఱచు చుండ ద్రివి; పండితుఁ డీభుజంగరా
యాం డొనరించు పెండ్లి ప్రిలి, దక్షిరమాపతి, నెప్పుఁడత్తులం
దుండు, నటించు జిహ్వకల హాతకవీంద్రిలమేలిదీవనన్. 206

క॥ కృతిసంతానము నేఁ డీడెఁ,
జతురాస్యాస్వయజుఁ డొకభుజంగపతి; కిఁకన్,
సుతసంతానముఁ బోటికిఁ
జతురాస్యా, డిష్వరకును జంపతుల కిడున్.

ఆ॥ "ప్రిభుతతోడ నేమి పని, సుకవిత యున్న ?"
ననుచు భర్తృహరి మహాత్ముఁ డనియె;
వలచె నిన్నుఁ గవిత, ప్రభుత; మహాభాగు
డవు, భుజంగరాయ; కవిసహాయ. 208

---

6-6-1917. పింగళసం॥ జ్యేష్ఠ బ ౧ బుధవారము. బంధుభావమునఁ బాలతోడు గ్రామము పెండ్లి కరిగి యాయాయిసందర్భముల రచించినవి.

ఆ॥ ఉన్నచిన్నవీథు, లొడ్డోటికంబులు;
నేల, వానఁ గురియు, గాలు నిలదు;
నిలుప, వెలుప రాదు; బలుపంటయూరైన,
బాడచే లతాడు, పాలతోడు. 209

---

పెన్సిల్వేనియారాష్ట్రమునందలి యుద్యానవనములలో ప్రకృతిదృశ్యము.

---

తే॥ దాతలకు వినయంబు పరిధానభూష;
దానిఁ దాల్చిచి యనసగు దాని యున్న,
శ్రీ కొనర్చినయవి ఫలసత్కృతులు, దాని
కాంకములు నీతి రసప్రవృత్తి నంగఁ బెంచి. 210

---

వివాహానంతరము గృహప్రవేశోత్సవమునకై పల్లంకున్బున్న గ్రా
మమునకు నో దానదిలో నావమీఁద నడుచు మార్గమున దించినది.

---

ఆ॥ ముసుఁగు వేసి, మృత్యుముఖమునఁ జరియింతు,
రాయువున్నవాళ్ళ నఖిలజనము;
లట్లు కాదె, యబ్ధి యాడిగాఁ గలజలా
శయములందు, నోడపయన మరయ! 211

ఉ॥ హెచ్చుచుఁ దగ్గుచు, న్నురుఁగు లీనుతరంగలవృక్షగాత్రమిన్,
మెచ్చుగ నావ పర్వున గమింపఁగఁ బల్లముకు ద్రిక్కేపచోఁ
బచ్చనిలంకతోఁపులును, బార్శ్వములన్ సితసైకతంబులుం,
బచ్చికపట్టులుం, జలుతపల్లెలు, విందు లొనర్చెఁ జూడ్కికిన్. 212

ఉ॥ కూలముఁ గోయునేటిదరి, గొప్పమహీజ మొకండు, భూమిలో
వేళులు పైకిఁ గానఁబడ, వెల్లువవాకకు వ్రాలి భాసిలెన్,
నేలకు నెక్కుడీవు;జననీ! ననుఁ బెంచితి; నేఁడు కూల్చెదే?
చాలఁ దొలంగి కావు'' మని దండనమస్కృతి సల్పెనశిన్.

—• గృహప్రవేశప్రతిష్ఠాదేశించు •—

తే॥ పురుషులకుఁ బొడ్డపట్టిచెప్పఁగలను, స్త్రీల
కలఁదసట్టిపాదాలియు, నయ్యె నసలు,
ననవధూవరు లూరేగునాఁ డొకింత
రాలఁ దినుకు, పల్లంకిఱ్ఱుగాఁగ్రమ్మందు. 214

—• శాపథస్యవిషయము •—

శా॥ పల్లెకు బ్రాకసారి చూచితిని ముక్ బాల్యంబునం; దప్పు డీ
యుల్లాసంబు ఘటింపదయ్యె మనకీయూ; రిందుఁ బ్రఖ్యాతు లా
నెల్లాపెగ్గడవారు లాంఁతు లలనాఁ; డీవాఁడు మాబంధు లై ;
రల్లుంఘుం, జిటిమన్నరా, లనుజుబి, డ్డానంద హేతుల్ గదా. 215

తే॥ ప్రథమమున నెల్లపెగ్గడవల్ల నెలయఁ
గాంచెఁ గోచ్చెర్లకోట, యీగ్రామమందుఁ ;
గోట తనఋణమును దీర్చుకొనియె నిప్పుడు,
పెగ్గడకులము నవిచ్ఛిన్నముగను నిలిపి. 216

—• వసునిశాశీర్వాదము •—

తే॥ మొలకమామిడికన్న మున్నున్న తోఁట,
జుంటిపుచి మించుపం డ్లిచ్చు నటుమాఁవి;
గనుక, వేంకటనారాయణునికతమున,
నెల్లపెగ్గడాన్వయం బిందు వృద్ధిఁ బొందు. 217



శ్రీరాజా

వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దరు జమీందారు.

---

మ॥ తలిదండ్రుల్ మును వారణాసికిని యాత్రం జేసి, యాపుణ్యమే
కులనిస్తారకపుత్రు నిచ్చె నని, నీకున్ గాశికాధీశని
ర్మలనామాద్యపదప్రయుక్తి నిడఁ ద్వన్మాతామహాఖ్యన్, జనం
బులు నిన్నుం గని,విశ్వసుందరుఁడ! రూపుంబట్టియుం బ్రజ్ఞకన్.

ఆ॥ విశ్వసుందరాఖ్య, వెలయించె నొకరీతి
మొదల, నితఁడు లక్ష్మమ్మపుత్రుఁ డగుట;
వేఱురీతి దాని వెలయించె నిప్పు, డ
మ్మమ్మవలన నగుమహార్థలబ్ధి. 219

ఆ॥ విశ్వ వీర వ. సులు వీరు వాదులు మూరు,
విజయకాంతు లగుచు వెలయువారు;
వీరిలోన తానుఁ జేరి యుండును గాని,
విధి యెటుల్ తదన్యవృత్తి యగును? 220

తే॥ ముదుకసోమాసికౌఁగిట మునుకురంభ,
ధనదసునుతుసంగమునఁ బోలెఁ, ద్వత్సమాగ
మాప్తిఁ దనవన్నెచిన్నెయ లన్ని దోఁప,
విశ్వసుందర! యిందిర వేడ్క నలువు. 221

శా॥ వద్దున్ హద్దు నిబద్ధిఁ దోఁప, గృహనిర్వాహక్రియోద్యోగమం,
దద్దంక్యన్వయు సత్యశర్మ, పసురాయస్యాలకున్ జేరిచెన్;
బిద్దం గస్తురినారసింహపితృ, గావించెన్ నిజాస్థాని మేల్
దిద్దు ల్పెన్నిరయి విశ్వసుందరుఁడు, మాతృఖ్యాతికిన్ వన్నె దేన్.

ఉ॥ "ఎన్నఁడు నేరిచెం జెళుకు లీచెలికన్న" లటన్నపద్దియం
పున్నడికార మొందుఁ దలఁపున్, గుణబంధురు విశ్వసుందరున్
మున్నె వరించి ముద్దిడినముగ్ధను రాజ్యరమన్ గనుంగొనన్;
వన్నెలుఁ జిన్నె లయ్యుచితభావ ముదారత వింత గొల్పెడున్. 223

క॥ నిష్కంటకముగఁ దగవు ప
రిష్కృత మయ్యెఁ గద తుదిఁ బరీవృఢుచే; నా
విష్కృతవిజయుఁడ వైతివి;
దుష్కృతు లడల, నిక నేఁగు దొడ్డమపేటన్. 224

క॥ శ్రీరంగమరాజ్ఞీ! క
స్తూరియుగంధరుఁడ! విశ్వసుందరవిజయో
దారశుభవార్త యిదె, హృ
ద్ద్వారంబున దివికి మీకు వ. నుఁ డందించున్. 225

క॥ నవకోనసీమ యిది యనఁ
దవుదొడ్డమపేట, రాజధానిగఁ, బదియూ
ళ్ళవిభక్త మేలు వాడే
వువిశ్వసుందరధరావిభుఁడు భృతవసుఁడై. 226

తే॥ మేటిదొడ్డమ్మపే, టుట్రుమిల్లి, మతుకు
మిల్లి, కుడుపూరు, కుఱకాళ్ళపల్లి, నేల
టూరు, గుడిగళ్ళ, మఱి గుమ్మలేరు, మిర్తి
పాడు, నిడసనమెట్ట, నాఁబడుఁ బదూళ్ళు. 227

తే॥ రాణ్మహేంద్రపురీవరప్రాంతమందు,
రాతికంకరగనిమెట్ట గ్రామ మొకటి
గలదు బొమ్మూరు; దాన సగము, జమీను
దారు వాడేవువిశ్వసుందరుమునాది. 228

ఉ॥ అన్నలు నీకు ముప్పు; రసలన్న చనెం దివి; కమ్మయక్కయు
ష్ఠన్న విరోధి; సొత్తు దన దంచుచు వ్యాజ్యము లాడి యోడె సీ
మ; న్నినుఁ గన్నతండ్రి గురుమాన్యత నెయ్యపుటన్న యాన.సున్,
సన్నిధి నుంచుకోఁ దలఁచు సౌమ్యత శ్లాఘ్యము విశ్వసుందరా.

శా॥ మావృద్ధప్రపితామహుల్ నిలిపికో మాన్యంబు మున్ క్షేత్రప
ప్రాపిణ్యానకుఁ బండితప్రభు విడెన్ వాక్ప్రపూర్ణుప్పగా,
క్ష్మవృద్ధప్రపితామహుం; డిప్పుడు నీమె పొందునాకై తకై,
యీ వేయీవిని విశ్వసుందర; పితాకీ! గారవింతో ఏమున్. 230

---

—• ధర్మశాలామూలబంధశిలాస్థాపనము •—

శా॥ శ్రీమంతుల్ తమపుట్టు కొందఱు కృతార్థీభావ మొందిన్, మహా
భూమీజంబులటుల్, స్వసంపదల కెప్పున్ దీనరక్షోద్యమ
ప్రాముఖ్యంబు ఘటింతు, రెవ్వనివయాభవ్యాంతరప్రేరణా
సామర్థ్యంబున, ధర్మకార్యములఁ దత్సర్వాత్మకుం డోముతన్.

చ॥ మనుజుల కిచ్చె నేని యతిమాత్రధనంబుఁ బరాత్పరుండు, దా
నిని బహులోహపేటికల నించి, గణించును బామరుండు; స
జ్జనుఁడు, తలంచుచుం జగము సర్వము స్వీయకుటుంబ మంచు, దా
నను బహుదీనపోషణ మొనర్చు, జగత్పతియిచ్చఁ గాంచుమన్.

ఉ॥ గం పొకచంకఁ బెట్టుకొని, కఱ్ఱను రెండవచేతఁ బూని, వి
ల్వంపున మేను దోఁప, నడువంగను సత్తువ లేక తూలుచుం,
జంపిరినెత్తితో, మొలను జింపిరి గట్టి, వగర్చుకొంచు, ము
ష్టింపచు రాలు బిచ్చ మనఁ "జీ! పొద" మన్కలవార లుండరే!

ఆ॥ సస్యములకుఁ గాని జలదంబ దేటికి?
జ్ఞానమునకుఁ గాని చదువ దేల?
మానమునకుఁ గాని మగతనం బేటికి?
భిక్షుకులకుఁ గాని లక్ష లేల? 234

ఉ॥ కొమ్మకు వ్రేలఁ గట్టి యొకగుడ్డను, బుట్టినబిడ్డ నందులో
నిమ్మగఁ బెట్టి, వేసవుల నీచవిగాడుపు రాఁగ నాచెవిన్,
సొమ్మలు వోయి, రథ్యలను జూడఁగ నయ్యెడు బిచ్చగాండ్రదై
న్యమ్ముఁ గనుంగొనం, గడుపులక్కట! చుమ్మలు చుట్ట వేరికిన్?.

ఉ॥ వ్రేలుచు మీఁదఁ దోఁచు తలక్రిందుఁబులుంగులు వోలెఁ, గ్రింద, లేఁ
జూలులుఁ దాము, నాండ్రు, వడ సోఁకి నిదాఘపునాళ్ల భూమిరు
హమ్ములములన్ వటించువెడ మోములభిక్షుకులం గనుంగొనం,
జాలిఁ గరంగదే హృది, విషాదము పుట్టి కసాయి కేనియున్?.

సీ॥ సరి మూఁడుపదులవత్సరములనుండి నే
నెఱుఁగుదు రాజమహేంద్రవరము;
నెన్నియో మాఱుపు లీలోన, మంచికిఁ
జెడ్డకుఁ బెక్కండ్ర చేత నయ్యె;
గ్రాసవాసంబులు గలిగించుజతనంబు,
బిచ్చగాండ్రకుఁ దలపెట్ట రెవరు;
నేనాఁటి కెందుండి యేమి పుట్టించునో
యీశ్వరుం, డెవ్వరి కేమి యెఱుక?

తే॥ యబ్బురం, బిప్పటికి భిక్షుకార్తిహరణ
చింత, యచ్యుతరామయ్యస్వాంతమందు
నంకురింపించె భగవంతుఁ; డది నిరంత
రాయశాఖోపశాఖలఁ బ్రబలుఁ గాత. 237

వాన కెండకుఁ గామ పాంతుపెన్నోడుగు లౌ
దురు వేరె కిఁక మీరు? తపసులార!
రాణ్మహేంద్రవరమ్మునఁ బ్రథితుఁ డైన
ప్రథమపురందరగతిన్యాయవాది, ముల్లు
కుట్లయచ్యుతరామయాఖ్యుండు, కృపను
గట్టెఁ బెదధర్మశాల, బికారు లుండ. 242

ఉ॥ గ్రాసము, వాసముం, గొఱఁత గాపున బీదల, కందు వెన్క దా
వాసము, ముల్లుకుట్లకులపావనుచే నొసఁగించె ముందుగా;
వాసికి నెక్క నుంచు, భగవంతుఁడు తొల్తటిదాని కెవ్వనిం
జేసినవాఁడొ, చిత్ర, మిఁకఁ జేయఁగలాఁడొ, యెవం డెఱింగెడున్

సీ॥ కలము చేతను బట్టి, గద్దియఁ గూర్చుండి,
మహితగోదావరీమండలమునఁ,
దగవులవారియుఁ, దప్పిదంబులవారి,
తలల నిఘాతంపునలుపవార్చెఁ,
బహుశీలనము చేసి, ప్రకటించున్యాయాధి
పతి, యెఫెచ్ హ్యామ్మెట్టుప్రభువరుండు,
కాసీసువలె గారఁ గైకొని యొక వెండి
తాపితో, మూలబాధశిల నదుకు,

తే॥ కేమి, ముల్లుకుట్లాచ్యుతరామశర్మ
నిర్మితంబగుచున్న యీధర్మశాల?
కట్టనఁగ నేల? ధర్మకార్యంగ మేప,
నేపనికి నైన సుజను లాయిత్తపడరె? 244

ఆ॥ ధర్మశాల, నేఁడు తలపెట్టఁబడినది;
దానిఁ గట్టుదాత ధర్మవాది;
ధర్మరాజు వేయు దానిపునాదిరా;
యెవఁడుఘటనపఱిచె నీత్రియంబు? 245

చ॥ సను మునిషీ యటం చనఘృణానిధి, హ్యామ్నెటుధర్మభర్త, తా
పిని గొని మూలబంధశిలఁ బెట్టఁగ, నా తెలుఁగొజ్జనంబుఁ గాం
చినములుకుట్లవంశమణి చేసెనునిర్మలధర్మకార్యముం
గనుఁగొనఁ గల్గె; నీవ. సునికన్గన నల్పనభాగ్యమే మొకో! 246

క॥ పదునెనిమిదివందలయిరు
వదియూఱు శకంబు, క్రోధి, భాద్రపదము నె
న్మిది యగుతిథి, శనివారము,
చదు రచ్యుతరామధర్మశాలకు జరిగెన్. 247

---

అమెరికా లూథరన్ జనానామిషన్ వైద్యశాలాగృహప్రవేశ సమయమున జరిగినసభలోఁ జదివినవి. (20-6-19:1)

---

చ॥ సిరికిని జన్మదేశ మగుసింధువునం, బృథుకర్పరంబుపైఁ
దరిమల దిద్దిరం దిరుగఁ, దాల్చి మహోకమతాకృతిన్, రుజా
హరణుఁడు వేల్పువె, జ్జమృతహస్తుఁడు గల్గఁగ మూఁ మైనశ్రీ
హరి, కృప రాణ్మహేంద్రమహిళార్భకభైషజశాలఁ బ్రోచుతన్

ఉ॥ ఎక్కడిపశ్చిమార్ధభువి? యెక్కడిరాజమహేంద్రపట్టణం?
బక్కటికంబుతో నిచటియాఁడుజనమ్ములసచ్చికిత్సకై,
చుక్కలఁ దాఁకుమేడ నిడెఁ జుల్కన లూథ్రనుకీర్తిసంఘు; మ
మ్మక్క! మతాభిమానము, మహాద్భుతకృత్యము లాచరించుఁగా.

చ॥ తడవులఁబట్టి డెందమునఁ దాల్చినయీపృథుసౌధభారముం
బుడమిని డించె నక్కటికపుంగని, వార్నరువైద్యురా; లిటం
బడలిక నిండు వేఁకటిని మందగతి న్నడయాడుమానినుల్, [తో
గోడుకులఁ గూతుఁలం గని, యకుంఠితమోదముఁ గాంతు రామె

చ॥ పురిటికి నెల్లవారలకుఁ బుట్టినయిల్లగు, దొడ్డతల్లి వా
ర్నరుదొరసాని కట్టినవిరాజితహర్మ్యము; దీనికోసమై,
గరితలు, చిన్నవాం, డ్రమెరికాఁ జెను రూడిచి పంపినారఁ ట
ద్దిర! రజతప్రవాహమును; దేవుఁడు వారి కొసంగు దీవనల్. 251

చ॥ నులిసిననుల్కమంచమును, నూనియు, కుంపటి, పాఁతచెప్పు,భూ
తులసియు, నుల్లిపొట్టుపొగదూపము, నెన్నెమనుద్ది, చీఁకటిల్,
వెలిమిడిదివ్వె, లేకె, ప్రసవించి యిటం జెలు లొప్ప, నమ్మల
క్కలు కని తల్లిపిల్లలను, గ్రుక్కన ముక్కన నుంతు రంగుళుల్.

ఉ॥ అంబకు శారదాంబ జగదంబ బలెన్, నగుమోములన్ సహా
యంబుగ*రొహ్రిరున్,నెలసనమ్మయు,వార్నరు కుంద్రు వెజ్జురాం
డ్రిం బడరం బ్రజాతతికి నిక్కడ, నుగ్రగదాసురాసునా
శంబు, మహౌషధాస్త్రముల శస్త్రములన్ సలుపంగ నాచితిన్.

చ॥ సతులకు మానరక్ష, శిశుసంతతిపాలికిఁ బ్రాణభిక్ష, రు
గ్ణత కురిఘోరశిక్ష, మలినంబులకుం జొరరానికక్ష, యీ
యతివలక్షీరకంఠులయునౌషధశాలనిరీక్ష, వారు వా
రతులితదీక్ష నల్పుసుకృతాళి ఫలించినద్రాక్ష, యీక్షితిన్.

ఉ॥ పూరుషు లంద జీయెడన పోయి యథేచ్ఛముగాఁ గనం దగుం,
ధారిణి నుద్భవించినసుధారసపూరితకుంభ మైనయీ
సారతరౌషధప్రకరశస్త్రభరోన్నతసౌధరాజముం,
గోరిన నిందు దుర్లభ మగుం గద ముంను ప్రవేశ, మందునన్.

*పైయమెరికావెజ్జురాండ్రు ముప్వురును నాయొద్దఁ దెలుఁగు నేర్చుకొన్నవారు.

ఆ॥ చదువుకొంచు వచ్చి, చావడిఁ గూర్చుండ,
"ఎవరు మీర?" లనియె నింటియాపె;
"సాధ్వి! యెఱుఁగవమ్మ? శ్రావణభాద్రప
దముల" మనిరి మాయదారు; లంత.

ఉ॥ వారల కర్ఘ్యపాద్యములు బ్రాహ్మణి భక్తి నొసంగి "వర్షఘుం
డూరను లేని దొక్కటియె యొచ్చెము; వారును వత్తు; రంతకున్
మీ రిట నుండఁ గోరి" కని మేకొనఁ బ్రార్థన సేసి, కూపనుఁ,
గూరలుఁ, బెండివంట, లొడఁగూర్చి, ద్రేఁపఁగ మేప సాగినన్.

సీ॥ శివుని బూజింపఁగాఁ దవునట్లు పంచి, గం
పల నించుపాలిసంగుఁబాలిలు చెల్లెఁ;
జింతకజ్జలఁ జీల్చి, చిఱుతకట్టియలుగా
నఱికి, పేర్చినవంటచెఱకు తఱిఁగె;
నోలిచినట్టులు బద్ద లొప్పఁ, జెరిగి కోసి,
బానఁబోసినచాయపప్పు నయ్యెఁ;
జేమునక్కయూటలోఁ జేన దేగుచు నుండఁ,
గడనఁ బెట్టినదూవకాయ నోఁచె;
ఆ॥ వేఱువేఱ యేల వివరింప? సర్వభో
జనపదార్థచయము సమసెఁ; దిండి
కడ్డు వచ్చెఁ; నింటియాతఁడు చనుదెంచు
గడువు వచ్చెఁ; వానకారు వచ్చె. 288

తే॥ అది యెఱిఁగి ధూర్తు, లింక నోయమ్మ! మేము
పోయి వత్తుమె? పెక్కునాళ్లాయె వచ్చి;
మఱవ మెన్నఁడు నీమేలు; మరల వత్తు;
మనుచు నల్లల్ల నరిఁగి; రయ్యమ్మ యంత. 289

ఉ॥ ఇంటను భర్త గూరిచినయెల్లపదార్థము వెచ్చ మాటచేఁ
డింటకు లేక తా బయలుదేఱెను, జోరున వాన మొత్తఁ బ
య్యెంట ముసుంగు వేసికొని, యందఱయిండ్లకుఁ జేటయప్పనై ;
వంటను మానుకో వలసెఁ, బాలుత కెం దది నాఁడు పుట్టమిన్.

తే॥ బురదకాళ్ళను, జడిపుట్టములు, వడంకు
మేను నై, యాజడిన గృహమేధి వచ్చి,
పస్తుపడి యున్నసతిఁ జూచి, కస్తిఁ జెంది,
యామెచే నింటివృత్తాంత మంత దెలిసి. 291

క॥ "మాఁడుకడుపునకు మండెడు
బూఁడిద" యన్నట్లు వెడలఁ బుచ్చి యెటో యా
నాఁడు తమభోజనము, లతఁ
"డాఁడుది మొద్దగుట యింటి కాపద" యనియెన్. 292

చ॥ వెలుతురు తోడుపాటునను, వెల్వలికన్నెదురం దనర్చువ
స్తుల నెటుఁ జూడఁ గల్గు, నటు చూడఁగ నేరుచు ముజ్జగంబులన్
వెలయున శేషచిత్రముల, విద్యసహాయత లోనికన్నుఁ; లో
పలివెలుఁ గైనవిద్దియ, యవశ్యము గాదె యదృశ్యమధ్యకున్ ?.

క॥ వ.సు.రాయఁడు శ్రీవిద్యా
ప్రసక్తి, సభ వ్రాసి చదివెఁ బదిపద్యంబుల్,
రసికులు, విదుషులు, దొరలు, దొ
రసానులును, జడ్జి, జడ్జిరాణి, చెలంగన్. 294

ఈపై పద్యములువ్రాసినకాగితము కొంతకాల మెంత వెదకిన నగపడక పోయెను. ఆకాలములో నొకహరిదాసు, భద్రాద్రినుండి యాపదపద్యములలో నేడుపద్యములు, తనకుఁ గంఠపాఠముగా నున్నవి, వ్రాసి పంపి, మిగిలినమూఁడుపద్యములను గూడఁ దనకు బంపవలయు నని, లేఖాముఖమున నన్నుఁ గోరఁగా విషయమును

ష్టప్రతికిఁ దెచ్చికొని, యీక్రిందిపద్యములను స్వహస్తముగా వ్రాసితిని. ఇట్లు మరల రచించుటలోఁ బూర్వపద్య మొకటి లోపించుటయుఁ, గొన్నిపద్యములు మాఱుటయు, నొకపద్య మధిక మగుటయుఁ, దటస్థించెను. మరల రచించిన వీక్రింద వ్రాయఁబడినవి.

సీ॥ పాఱుఁ డొక్కఁడు తొల్లి పరదేశ మరుగుచు,
వచ్చు శ్రావణభాద్రపదము లిదె;
నిబ్బంది పడు'' దని, యింట నన్నియుఁ గూర్చి,
యిల్లాలితోఁ జెప్పి, యేగె; నప్పు
డీమాట విని ధూర్తు లిర్వురు, మఱునాఁడు
తావళాల్, నీర్కావిదోవతులును,
సాలులు, దర్భాసనాలు, జారీల్, భూతి
పెండెకట్లు ధరించి, వేద మొత్తి

ఆ॥ చదువుకొనుచు వచ్చి, చావడిఁ గూర్చుండ,
నెవరు మీర? లనియె నింటియాపె;
జంకుఁ గొంకు లేక, శ్రావణభాద్రప
దముల మనిరి, మాయదారు; లంత. 295

ఉ॥ వారల కర్ఘ్యపాద్యములు బ్రాహ్మణి భక్తి నొసంగి, మేలు చే
కూరిచె మీదు రాక'' యని, గొబ్బున సిద్ధము సేసి కూడునుం
గూరలుఁ, బప్పుఁ, జారువరుగుల్, వడియంబులు, నప్పడంబు, లిం
పారఁగ నారగింపు లిడె నయ్యల, కాజ్యదధిప్లుతంబుగన్. 296

ఉ॥ ఓరగ నిల్చి వారి కనె నుగ్మలి “మా యజమాను లూర లే;
రీరలు వారు వచ్చువఱ కిచ్చట నుండుఁడు'' నాఁగ మేకొనం,
గారవ మంతకంత కధికంబుగ, నట్లను, బిట్లు, బూరెలం,
గారెల, బాఁపలం దినము గట్టునఁ ద్రేపఁగ, నాపె మేపఁగన్.

సీ॥ శివునిఁ బూజింపఁగాఁ దవునట్లు దంచి, గం
పల నించుపాత్రిసంగుఁబ్రాలు సెల్లెఁ;
బెసలు విసిరి, యెండఁ బెట్టి, పొట్టడలించి,
బానఁ బోసినచాయపప్పు సెల్లెఁ;
జేమునక్కయూటలోఁ జేవ దేరుచు నున్న
కడవలలో నావకాయ సెల్లెఁ;
గమ్మగా వెన్నను గాఁచి, పెందుత్తల
నిండఁ గూర్చినయావునేయి సెల్లెఁ;
తే॥ సన్నముగఁ జీల్చి, యట్టుక వెన్నవఱకు
నిఱుకుగాఁ బేరిచినవంటచెఱకు సెల్లెఁ;
దోన, పై వెచ్చమున కిడ్డదుడ్లు సెల్లె;
నేమి సెప్పుదు; సంబార మెల్లఁ జెల్లె.
ఉ॥ గడ్డపెరుంగుఁ, గమ్మనెయి, గజ్జము లాదిగ దొడ్డబండముల్
నడ్డన కబ్బమిం, గొలఁదిపాటిగ నాఁకటి కున్న దేదియో
యడ్డము వేయునెడ్డెకడ, నత్తులువల్ సెల వొంది, వెండియుం
జడ్డన వత్తు మంచుఁ, జలచల్లగ దాఁటిరి సల్పి దీవనల్. 299

---

1888 ఫిబ్రవరి 1 తేదీని రాజమహేంద్రివరములోని హైస్కూళ్ళు మూఁడును గలిపివేసినసందర్భమున రచించినవి.

---

శా॥ శ్రీ చెల్వొందఁ, బ్రపంచ మంతయును సృష్టిం జేసి, దానన్ గుణ
ప్రాచుర్యంబు సమంచితైక్యమునఁ దోఁపం జేయుసర్వేశ్వరుం,
డాచంద్రార్కము రాణ్మహేంద్రిపురవిద్యావృద్ధసంయోజితా
ర్యాచీనోన్నతపాఠశాలను, గృపన్ వర్ధిల్లఁగాఁ జేయుతన్. 300

ఉ॥ ఆపటఁ గీర్తిశేషుఁ డగునాప్తజ్ఞను పాదిరి, శాల్తె కిఁ దో,
డాదిని నిల్చెఁ బా మిషనుహైస్కులు: లిస్టువల నంత నిల్వ, కేఁ
డాదిక నొక్కఁ డొక్కఁ డనగ న వృద్ధియించుచుఁ, బాఠశాలలం
బేదజికంబుతో నసుగఁ బెట్టెను, జేసెను నారసిద్ధిముల్.

క॥ మాన్యతరమర్కటకితో
రన్యాయము, గురుకుమారరత్నంబులసా
జన్యము, మాష్టాలకితో
రన్యాయం బయ్యె, బహుతరిము శ్రాట బహుల్. 3(2

మ॥ మును పేకాశ్రయమై, కుమారచయమున్ ముక్తాఫలప్రాయముం,
గనుపోన్నతపాఠశాల, ఘనుఁ మోకాల్ప్రు బెడంబాసి, వ
ర్ధన వేత్రై చెడ, దానియాఘునికవార్ధ్యాగ్యస్థితిం బాపి, పా
ర్థన సౌభాగ్యముఁ గ్రమ్మజించుట, మహాకార్యంబుగా నెంచుచున్.

సీ॥ పరిబలు లిన్నిస్పేటపాఠశాలై కయో
గశ్ముక ద్ర లొఘనులసభయు,
నాలూథరన్ మిషన్ హైస్కూలు నాఁపిన
యుక్కుఁగంబంబు, డీటిరికులవారయు,
బలిమి థియస్టిక్కుబడిని సంస్థాపించి,
మించునేలూరిలక్ష్మన్నృసింహ,
మింక నీరాజమహేంద్రిబునందలి
భాషాభిమాను లొపండితులును,

తే॥ బాఠశాలలదుస్థితిఁ బాపుటకయి,
తా రొకసమాజ మేర్పడి, దాని కిచటి
కాలెజీనాథుఁ డైనమెట్కాఫుదొరను
శ్రేష్ఠు నగ్రాసనాధిపుఁ జేసిరొనిరి.

శా॥ ద్రోణాచార్యుఁడు, తొల్లి హస్తిపురియందున్ విఱటికిం బోలె, నీ
హూణాచార్యుఁడు రాజమహేంద్రపురిలో నుండంగ, నేదారిని
ద్రాణంబయ్యెడు వాణి నాఁ బ్రజ, దరిద్రాణంబు తాఁబల్కు, క
ల్యాణశ్రీఁ గనఁ జేసె మూఁడిటిని నైక్యం బొందఁ, మెట్కాఁపు
[తాన్.

శా॥ అంతశ్శీతము మాని, నెమ్మి నఖిలోపాధ్యాయు లేకంబుగా,
సంతేవాసులవాసరాంతకరఘోషావస్థితుల్ దూలఁగాఁ,
జింతాశల్యము వాసి, తద్విభు లెదం జేఁ జేర్చి నిద్రింపఁగా,
నెంతే వేడుకఁ బాఠశాల లవి మూఁ డేకీభవించెన్ బుటిన్. 306

తే॥ జరుగువిధివసునిధివేదసంఖ్యకలిని,
సర్వధారిని, గరిదిగ్దిశాశశాంక
సంఖ్యహూణాబ్దమున, నేకసంఘమై చె
లంగె, నున్నతపాఠశాలాత్రియంబు. 307

సీ॥ అచట నాంగ్లేయభాషాధ్యాపకుఁడు మేలు,
గణితంపుటొజ్జ యిక్కడ వలంతి,
భూగోళచారిత్రబోధకుం డట లెస్స,
ప్రకృతిశాస్త్రగురుఁ డీపజ్జ బాగు,
దేశీయభాషోపదేశకుం డిట మిన్న,
యమరభాషాచార్యుఁ డచట మేటి,
యంగపరిశ్రమోపాధ్యాయుఁ డట దిట్ట,
సాధనసామగ్రి చక్క నిచట,
తే॥ ననుచు, మును పెంపుఁ జదువుద మని, విచార
డోలికారూఢచిత్తు లౌ బాలకులకుఁ,
గొండ యెక్కుల కాదె, యాకొఱంత లడఁగ,
మూఁడు నొకపాఠశాలగాఁ గూడు టిప్పుడు? 30

సీ॥ కొలఁదిగొప్పలఁ దూఁచికొనక, ముప్పాతికా
లల నొక్కతూఁకానఁ దలఁచినారు;
వలయు, నక్కఱ లేదు, వలఁ, దలంతి, యటంచుఁ
బలుక, కొంటఱపనుల్ నిలిపినారు;
తగ్గు హెచ్చని చెప్పి, తార్మాణు సేయ, క
ష్టిటిజేతములై, యేఱుపఱ్చినారు;
తనవారు, పెఱవారు, నని చూడ, కమ్మ్యూటఁ
దేట, పాడిగఁ బైకిఁ దేర్చినారు;
తే॥ ఉచితముగ నేర్పువేపల, నుసురు పెట్టి,
కసలు వారికిఁ దగుసాయ మొసఁగినారు;
కరుణ గలవారు, ధర్మంబు గలుగువారు,
పాఠశాలాసమాజ మేర్పడినవారు. 309

శా॥ విద్యాబుద్ధుల నొజ్జ లర్భకులకున్ వేనోళ్ళ బోధించుతన్;
సద్వృత్తంబున మంచివా రయి, పరీక్షం బాలకుల్ నెగ్గుతన్;
గూడోద్యోగంబులు సేయుదున్నతులు, నూన్యోత్సాహులై కుందు
[తన్;
విద్యాశాలను దత్సమాజము నవోర్విన్ వేగ నిర్మించుతన్.

క॥ మంగళము పాఠశాలకు;
మంగళము తదీయఘనసమాజంబునకున్;
మంగళము గురులసమితికి;
మంగళ మభివృద్ధిహేతుమాణవతతికిన్.



12-డిశెంబరు. 1911. శ్రీజార్జిచక్రవర్తి ఢిల్లీపట్టాభిషేక

నవరత్నమాల.

—=•=—

సీ॥ శ్రీరామవిక్రమస్థిరచిహ్న మైనట్టి
సేతువు, తనకు మంజీరముగను,
మేరుమాత్సర్యాన మినుమానికము నాఁగి
ప్రాలినమల, మొలనూలు గాను,
వసుమతీ ధేనువువత్స మైనఘనాద్రి,
చేర్చుకర్కరత్నాలచేరు గాను,
సింధుగంగానదీజీవనభర్త లౌ
కూపారములు, కేళకూళులు గను,
తే॥ గ్రాలుభారతఖండసామ్రాజ్యలక్ష్మి
నెనయ, ఢిల్లికిఁ దర్లి వచ్చినవిభుండ;
జయము! విక్టోరియారాజగజ్జననిపౌత్ర!
సప్తమెడ్వర్డుసుత! జార్జిసార్వభౌమ!. 312

సీ॥ భానూదయంబునఁ బద్మాకరంబట్లు,
చంద్రోదయంబున సంద్రమట్లు,
చైత్రోదయమున రసాలాదివనమట్లు,
జలదోదయంబున సస్యమట్లు,
శారదోదయమున శశిబింబము, ట్లగ
స్త్యోదయంబున నాపగౌఘమట్లు,
యౌవనోదయమున నవయవచయమట్లు,
హాసోదయంబున నాస్యమట్లు,

తే॥ తావకాభ్యుదయమున నూతనవిభూతి
హిందుదేశము బహుధా రహించు; దేవ!
జయము! విక్టోరియాజగజ్జననిపౌత్రి!
సప్తమైడ్వర్డుసుత! జార్జిసార్వభౌమ! 313

సీ॥ సీమనే గద కీర్తిశేష లియిండ్యాకుఁ
బట్టాభిషేకంబుఁ బడసినారు,
గతకాలమున భవత్పితృపితామహు; లిప్డు
డేలిక కారుణ్య మేమి చెప్ప?
సపరివారము వచ్చి, సకలసామంతరా
ణ్మండలి చుక్కలసింధు గోల,
వెన్నెలతోడిజాబిల్లిచందము నొంది,
మహితమేరీపట్టమహిషితోడఁ,

తే॥ ఖాండవాగ్రిజుఁ డేలినపట్టణమునఁ
దాల్చెదవు రత్నమకుటంబు; ధర్మరాజ!
జయము! విక్టోరియాజగజ్జననిపౌత్రి!
సప్తమైడ్వర్డుసుత! జార్జిసార్వభౌమ. 314

సీ॥ ఉదయశృంగారూఢు నుష్ణాంశుఁ దలఁపరే,
మణికిరీటమ్ము నీమౌళిఁ జూచి?
బాలేందురుచిఫాల, భారతిఁ దలఁపరే
కోహినూరూనుసీకొమ్మఁ జూచి?
యమసూతిరాజసూయసవంబుఁ దలఁపరే,
నీమోలి రాచకానికలు సూచి?
దిక్పాలవేష్టితు దేవేంద్రుఁ దలఁపరే,
మన్నీలు సేవించునిన్నుఁ జూచి?

తే॥ నీకతంబునఁ గా ప్రభూ! నేఁడు మళ్ళి,
ఢిల్లిఁ గొల్లిటిసంపత్తు వెల్లి విరిసె?
జయము! విక్టోరియారాజగజ్జననిపౌత్రి!
సప్తమైడ్వర్డుసుత! జ్యార్జిసార్వభౌమ! 315

సీ॥ గిరిహాసమూహము, భూమిఁ గలసికొన్నటు తోఁచు
మూర్ధాభిషిక్తులమూఁకఁ జూడఁ,
తారాగణము, వసుంధర డిగ్గినటు తోఁచు
రత్నోపహారహారములఁ జూడఁ,
గొండ లెన్నో, గుంపు గూడినట్టులు తోఁచు
గంధసింధురమహాంగములఁ, జూడ,
శరనిధుల్, ధర వెల్లి విరిసినట్టులు తోఁచు
సకలదిగ్దేశప్రజలను, జూడ,
తే॥ నవి యివన నేల? నేలశ్రీ లన్ని, చూడఁ,
గనరె, నీదుపట్టాభిషేకంబుఁ జూడ?
జయము! విక్టోరియారాజగజ్జననిపౌత్రి!
సప్తమైడ్వర్డుసుత! జ్యార్జిసార్వభౌమ. 316

సీ॥ ఆసేతుశీతాచలావనీఖండంబు,
దా నుండునన్నాళ్ళుఁ, దావకీన
శుభసమాగమమును సూచింప, నుత్సాహ
పారవశ్యము నొందు భక్తితోడఁ;
దలపెట్టె నీపేర ధర్మకార్యంబులు,
కోటానఁగోటులు గురియు ధనము;
సత్రముల్, సావళ్లు, సంతకూటంబులుఁ,
బాఠశాలలు, సభాభవనములును,

తే॥ పేటలును, దోఁటలును, మంచినీటివసతు,
లెన్నియో యింక, నయ్యె నుత్పన్న; మహహా!
జయము; విక్టోరియారాజగర్జననిషాత్రి!
సప్తమైడ్వర్డుసుత; జార్జిసార్వభౌమ! 317

సీ॥ దూరదేశంబులు చేరువయ్యెఁ ద్రోవ్యో,
మరుభూము లన్ని వార్ద్రమయము లయ్యెఁ,
బొటిపట్లులు శాలిసస్యగర్భము లయ్యెఁ,
బాక్షోనిధానముల్ పక్షియ లయ్యె,
గంభీరనదు లనేకప్రతార్యము లయ్యె,
విపినాద్రు లుపరాజవీథు లయ్యె,
నమితయోజనవార్త లంగలోనివి యయ్యె,
నంధులు చదువ వ్రేఁ ల్కాశు లయ్యె,
నీదుపూర్వులయేల్బడి; నీదుప్రభుత,
నిన్నిటిని మీఱుమేళ్ళు మా కెనఁగ కున్నె?
జయము; విక్టోరియారాజగర్జననిపాత్ర!
సప్తమైడ్వర్డుసుత! జార్జిసార్వభౌమ! 318

సీ॥ "ఢిల్లికి ఢిల్లియుఁ బల్లికిఁ బల్లి" యన్
లోకోక్తి చను మా తెలుఁగులోనఁ!
గొండంత దేవరకు నొసంగ నేర్తురే
కొండంతప త్రిరి? కువలయేశ!
రాజమహేంద్రవరము, శక్తి లొచ్చెన,
భక్తి ఢిల్లికి సరి వచ్చుఁ; బ్రభువ!
నీపేర నిర్మించు నాపణశ్రేణి, గో
దావరిదరి నిష్టు, తావరముగ;

తే॥ నన్న దానముల్, మెఱవను, లాటపాట,
లదురువేత్రిటులు, నీపాదు లనుగ నేల ?
జయము ! విక్టోరియారాజగజ్జననిపౌత్ర !
సప్తమైడ్వర్డుసుత ! జార్జిసార్వభౌమ. 319

సీ॥ ఐదుఖండముల రాజ్యాధిపత్యముఁ గాంచు
నాంగ్లోప్రభుండ ! దీర్ఘాయు వగుము,
భారతఖండసర్వస్వామ్యము వహించు
చక్రవర్తి ! నీకు స్వాగతంబు,
సౌందర్యరాశ్యలగ్జాండ్రాసతీగర్భ
శుక్తిముక్తాఫలా ! శుభము నీకు,
సత్పుత్త్రికాపుత్రసంతానబహుతాన
కరుణాంతరంగ ! మంగళము నీకు.

తే॥ ననుచు, భూప్రజ దీవింప, నఖిలగోత్ర,
యేలు మేకాతపత్ర మీవే; పవిత్ర !
జయము ! విక్టోరియారాజగజ్జననిపౌత్ర
సప్తమైడ్వర్డుసుత ! జార్జిసార్వభౌమ ! 320

తే॥ రాణిహాంజూబిలికి నవరత్నములను
సూడిదగ నిడ్డవడ్డాదిసుబ్బరాయ
సచివకవి, యిప్డు, పంచమజార్జిచక్ర
వర్తిమాళికి నిడె నవవసుసరంబు.

చ॥ క్షమ, యుగమూర్తిదిగ్ధరణిశాలి విరోధికృదబ్దమార్గశీ
ర్షమునను, గృష్ణపక్షమున సప్తమి, భూసుతువాసరంబునన్,
యమునదరిన్ ధరాప్రథిత మాపురి డిల్లిని, సార్వభౌమతా
ప్రమనుఁడు, మాళిఁ దాలిచెను బంచమజార్జి, మహార్జితంబుగన్.

చ॥ ప్రజలను సీమనే విడిచి, పట్టపుదేవియుఁ దాను, హిందుభూ
పరిజలపయిన్ జయన్, బహులభంగసమాకులభీకరాంబుధిన్
గడచి కోర్చి, పట్టి మిటుఁ గట్టుకొనం బ్రభుపార్శ్వ శిల్లికన్
విజయము సేసెఁ, గ్రీస్తుశకపూర్వషష్ఠశతాబ్దిచంద్రమస్సమున్. 323

---

## కృతివిమర్శనాదికము

తే॥ వెలసెఁ గోనరాసిద్ధెఁ యొక్క విభునిచేతఁ,
పక్కి, నిశ్శంక.భర్త్రాజ్ఞచేత బుధుల
కరములను గూడ సలరింపఁ గలుగు చొప్పఁ,
గుంతికుచమును బోలె, శాకుంతలంబు. 324

---

తే॥ ఏను గంటి సరస్వతి; పానుగంటి
నారసింహా! తలఁచుకొంటి సూరసుకవిఁ;
వెలుఁగున మ తెద్ది దానికిఁ గలుగ దుద్ది;
యుద్ది యగునో కళాపూర్ణసృష్టి యొకటి. 325

---

చ॥ పదముల వింతవన్నెల, భవన్నవశిల్ప మెసంగ సాహితీ
సదనున వ్రాసినట్టిమనశారదచిత్రపటంబు, విభ్రమా
స్పదము, ముదావహంబు; వహవా! బళి! దానికిఁ బారితోషికం
బిదె కొను, పానుగంటిసుకవీ! నరసింహ! వ.సూక్తిపద్యమున్.

క॥ పరిశోధకనందనతరు
వరసుమ మంనుం ద్వదాంధ్రవాఙ్మయచరితన్;
సురభీకరించె నాంధ్రో
ర్వర నడ; వంగూరిసుబ్బరాయామాత్యా !

క॥ వే మన్నఁ దెగడునాల్కలు,
వేమన్నను బొగడు చుండు విపరీతముగా !
నే మన్నను, బ్రామిన్సుల
దామన్నన నెగడుపలుకు, లట దోలఁకుఁ గదా. 328

క॥ హిందూమహీయందున్, వే
మ్ముం బోలుత భుజించుదివసమునను, భజించెం
దుందుభి, వసురాయనికవి
తేందిర, వేమన్న; నాంధ్రి కిది యుచితము కా. 329

---

క॥ మీ దేశమాతృపూజప్ర
సాదము, సంవత్సరాదిసంచిక, యింకన్
రా; దండె జాబు; వేతుఁ ద
దాదిగ, నద్దానిఁ గనుల నద్దుకొనంగన్. 330

క॥ ఆరోగ్య మడిగితిరి; నా
యారోగ్యప్రార్థనంబు నాలించెఁ గృపా
పారుం డీశ్వరుఁ; డైన, శ
రీరము నోగులుచు మనగపరిశ్రమ; మార్యా ! 331

తే॥ ఆంధ్రమునఁ బుట్టె, గిట్టె, ననంతపత్రి;
లంబకష్టసుఖంబుల కైన దేది?
పాఁపబాధలఁ దల్లికిఁ బాపుతార్క్ష్యు
నట్లు, నెగడు మీ చక్రితో. నాంధ్రపత్రి. 332

ఉ॥ చక్కెర మెక్కి చేఁ దనురసజ్ఞులు కల్గుదురయ్య యెందు? జే
రక్కజముం ఘటించె భవదాశుకవిత్వపటుత్వ; మీనశుఁ బోఁప్రముల్
గొక్కెర కిచ్చు మెచ్చుఁ దగునొక్కకవిప్రియుఁడు; జూచి లోప
వక్రకు, మిమ్ము నెన్న వసురాయఁడు కుంజినవృంగవీశులన్.

---

—• 2_3_1921 ఏలూరు. •—

తే॥ కలముపద్యము, వింటి, నుతగరపుఁజప్య,
మాశుకవితయుఁ గంధిజాహాసాలపెంగ్లి;
వానిపదభావకల్పనల్ వసుమనోహ
రములు; కొప్పరవృంగవిప్రథితులార!. 334

---

శ్రీపిఠాపురము రాజాగారు రాజకీయసభాశాలను సందర్శింపవచ్చి,
నేను, బాకము చెప్పుచున్న తరగతికి విచ్చేసినసందర్భమున
నాయనకు వ్రాసి యిచ్చినపద్యము.

ఉ॥ “శ్రీనరసింహకృష్ణనృపశేఖరుఁ జేలెడునాళ్ళనుండి, కా
నీనసమాను, భోజనిభునిన్, సభ నవ్విభుఁ జూడఁ గన్నవ
ర్ణానను లెంత ధన్యులో” యటన్ వగ, మా కట మానె నిన్ గనన్;
మానితరావు వేంకటకుమారమహీపతిసూర్యరాట్ప్రభూ!. 335

## భిషక్త్రియసమ్మేళనము.

ఆ॥ బాపనయ్య, శ్రీనివాసుండు, పేరయ్య
లింగ, మొకటి గాఁ, ద్రిలింగమునకు
బాపనయ్య, శ్రీనివాసుఁడు, పేరయ్య
లింగ మేక మని యెఱుంగఁ బడెను. 336

క॥ హరిహరులు మిత్రు లనుచున్
వెరవరు లీశ్రీనివాసపేరయలింగా
లిరువురు నగదంకారులు,
స్ఫురియింపం జేయు చంద్రు చూపటు కెప్పుడున్. 337

ఆ॥ అగుదు వీవు భావి నమృతహస్తుఁడ నంచు
నె న్నెటిఁగి రొక్కొ, యిడిరి నీకు
నుచిత మైనపేరు యుష్మజ్జనకులు, సం
జీవరాయదాస! శ్రీనివాస!. 338

## మిత్రసంభావనము.

ఉ॥ పాలను బంచదార యిడి, పాయసముం బొనరించి క్రోలుచో
నాలుక వొందునంతసము, నాసికకుం ఘటియిల్లె రేయి న
ల్లాలును, మాలతీకుసుమసౌరభమిశ్రపుహాసన్నహాసన (నై టుక్వీ
ను) [పూఁ
బాళులకమ్మతావులను బాలెపుసత్కవితోఁటలోఁగిటన్. 339

ఆ॥ వంశపురుషు పేర వాడుదు రెల్లవా,
ర్లక్కరాజుసుబ్బరా వటంచు,
నతనిన్యాయవృత్తియార్జన మెఱుఁగునా,
ర్లక్షురాజు సుబ్బరావు నారె? 340

---

ది 28_9_1884. ఆశ్వయుజ శు॥సప్తమీశనివారము రాత్రి దాక్షారామక్షేత్రమందలిభీమేశ్వరునియుత్సవమును గూర్చి వ్రాసినవి.

---

శా॥ నెమ్మిం దొడ్డమపేటరాణి, వరమాణిక్యాంబి కాసన్నిధా
నమ్మందుం, దసరామహోత్సవము విన్నాణంబుగా సల్పుచం
దమ్ముం, దారణవత్సరంబునను మోద మ్మార వీక్షించి, నే
త్రమ్ముల్ గల్గినలాభ మందఱముఁ బొందం గంటి మక్కోవెలన్.

సీ॥ గెలలు వేసినయనంటుల, గుచ్ఛములతోడఁ
గొని తెచ్చి కంబంబులను ఘటించి,
చీలిచి, క్రొన్నారికేళంపుమట్టలఁ,
గాయమానమునకుఁ గప్పు వేసి,
కెలఁకుల వెదురుబద్దలమెరాబాల, నం
దవుఁగల్వపూఁదోరణములు గట్టి,
కాగితపుంబుట్టగాజుకొప్పెరలది
వ్వెలఁ, బందిరికిఁ జాల వ్రేలఁ గట్టి,

తే॥ ప్రక్కలను, మల్లికలను దీపములబార్లు
వెలుఁగ, నభినయమున నాటవెలఁదు లాడ,
మేటికోవెల, భీమేశుబోటిమెదుట,
జరుపునుత్సవ మానందజనక మయ్యె. 342

శా॥ దాక్షారామమునందు, దేవినవరాత్రశ్రీమహాం బింపుమై
వీక్షింపం జని, వచ్చు చూరిబయిటన్ వేగాయమూం బాపురిన్,
నక్షత్రంబులు వేగుజామునను మింటం బోలె, ఖద్యోతముల్
వృక్షంబాదు మినుక్కుమి న్కనుచు వెల్గన్ ముచ్చటయ్యెం గ
[నన్. 343

కం॥ వృక్షంబునఁ బచ్చనిపూల్,
ఋక్షంబులు నభమునందు, నిరులున దివియల్.
వృక్షంబున మిణుఁగురులను
వీక్షించినతఱి స్ఫురించె వేగుంబోకన్. 344

---

—• దొడ్డమపేట •—

---

క॥ దాక్షారామముతూర్పున,
సుక్షేత్రము, విజయవిశ్వసుందరవిభునం
రక్షిత, మగుదొడ్డమపే,
టిక్షురసాలాదివనసమృద్ధిఁ దనర్చున్. 345

ఉ॥ గడ్డియుఁ గట్టెపుల్ల, లుదకంబు, నమృద్ధము; లెల్లవారికిం,
దొడ్డిని శుద్ధగంగ; యది తోఁడను బారెఁడు త్రాడు; పంటఁ జే
ర్పడ్డరసాలముల్ దములపాకులు, రాజనముల్, ఫలించు, మా
దొడ్డమపేటలోఁ; గడమతోఁటలఁ బైరులఁ జెప్ప నేటికిన్ ?. 346

ఉ॥ దక్కనమందుఁ, బాలకులు త్రవ్వినకాలువ; యూర, రాణి రం
గక్కప్రతిష్ఠ యౌగుడితటాకము; గేస్తులయింటికింటి, కొ
క్కొక్కటి, రెండు, మూఁడు మధురోదకకూపము; లేఱు లెండి
[నన్,
నిక్కము, నీటియెద్దడి జనింపదు దొడ్డమపేట కెన్నఁడున్. 347

చ॥ వలకడకాల్వ కుత్తరపుఁబ్రక్క దివాణపుటంటుమామిడిమొ
క్కలచిఱుతోఁటపశ్చిమపుఁగట్టవఁ బూచిన కేతకీసుమం
బులు వెద చల్లుకమ్మవలపుల్, దనుపుం, గుడిఁ జేరువారినా
సల, వకుళాదిసౌరభముసంగతి, దొడ్డమపేట, సంజలన్. 348

సీ॥ కంకరఘట్టనల్ గలుగుబాటలకన్న
గరుపవీథులె కౌతుకం బొనర్చు;
సుందరసకలవస్తుప్రదర్శనశాల
కన్న, హజారంబె హర్ష మొసఁగె;
గౌతమీరాధూమనౌకావిహారముకన్నఁ,
గాల్వ సంగడి దాఁటఁ, గలిగె ముదము;
ఆకాశ మంటుమహోహర్మ్యములకన్నఁ,
దాటాకుటిండ్లె మోదము ఘటించెఁ;
తే॥ బ్రస్తుతము కాఁపురం బున్న రాణ్మహేంద్రి
పురముకన్నఁ, బూర్వులజన్మభూమి యైన
పల్లె, దొడ్డమ్మపేటయే, యుల్లమునకుఁ
గూర్చె వేడ్కను; బ్రేమకుఁ గొఱఁత లున్నె? 349

క॥ పాదంబులు పాతాళన
భోదేశము లేరి, కాద్విమూర్తులఁ గొలుతున్
భేదంబు లేనిమతి నా
కాదరు వై యిందు నందు నానంద మిడన్. 350

చ॥ మొలఁకువ, నిద్ర నేవికృతి మే నెటు లెట్టులు మార్పుఁ జెందునో
తెలియును గాని, వింతలకుఁ దొకి, తదాంతరయంత్రగోళ; మం
దుల నగుమార్పగోచర; మనూహ్యా మి, దేకొఱముట్లతోడ లో
పలివెలి యంగముల్ నుసుమప్రాణికి నీ వొనరించి? తీశ్వరా.

తే॥ వివిధవిషయప్రసక్తిని వేఱువేఱు
తఱుల రచితంబులైనపద్యములు కూర్పఁ
బడినవసురాయచాటుప్రబంధమందుఁ
బ్రథమ మిది ప్రశంసాంకితప్రకరణంబు. 351



-



శ్రీరస్తు

శ్రీపరమాత్మనేనమః

# వసురాయచాటుప్రబంధము



## ప్రకృతిప్రకరణము.

మ॥ అరుదౌనైకనవీనకల్పనము లేకాంశబునం గూర్చి, తా
విరచింపన్ శతకాదికంబుఁ, గవిప్రావీణ్యంబు వేనోళులన్
సరసుల్ మెత్తురు; వృక్షపక్షిముఖనానాజాతిభేదంబులన్
బరఁగున్ గోటులు తాదృశంబు; లభవా! త్వత్సృష్టి నెన్నెంతుకో.



### ప్రభాతము.

శ్లో॥ అరుణకరసహస్రై రంబరం రంజయంతమ్,
ఘటితదళకవాటాన్ ఘట్టయంతమ్ నళిన్యాః,
నిబిడతిమిరరాశీన్ నిక్షిపంతం గుహాసు,
భ్రమహర ముదయంతం భానుమంతం నమామి. 2

క॥ తొగరుంజిగిమయిజాఱు,
న్నిగనిగ గలసరిగపూలనీలాంబరమున్,
సొగసుగఁ దాల్చి, యుషఃప్రభ
భగవతి, భాసిల్లు మున్న్యుపాసిత యగుచున్. 3

క॥ కమలములకుఁ బ్రాణులహృద
యములకుఁ జన్నయనములకు, నమరించి వికా
సము, ముకుళన మినకరములు
సమకొలిపెను గుముదములకు, జనకరములకున్. 4

ఉ॥ సృష్టిని బుట్టి నష్టి నొనరించుఁ ద్రిమూర్తులయిక్క యామహో
త్కృష్టపువేలు పీతఁడు; గతించెఁ ద్రియామ; యటన్న భావముల్
స్పష్టముగాఁ, ద్రిభంగిఁ గృకవాకులు గాములతేనిచొప్పుదా,
ర్లష్టదిశాముఖమ్ముల నహర్ముఖమం దెలుఁగెత్తి కూసెడున్. 5

ఉ॥ ప్రాణము లేనికొయ్యగడియారము రేయిట మూఁడు గొట్టఁగా
మానవనిర్మితం, బది ప్రమాణమె యంచుఁ ద్రిశుద్ధి మెచ్చున,
ట్లానిమిషంబునందె చతురాననకల్పితకాలయంత్రముల్,
పూనెను గొక్కొరో యనఁగ భుగ్నగళమ్ములఁ దామ్రచూడముల్.

ఉ॥ కేకులుఁ, గాకకోకపికకీరములుం, జటికాకపోతశా
రీకృతకస్వానస్వనముల్; భర్తృతభృంగము, లేకముఖంబుగా రొదన్
వేకువ సల్పెడున్, గమలినీఖరభానుకరగ్రహోత్సవో
త్సేకముహూర్తసూచకవిశిష్టతతాదినినాదవైఖరిన్. 7

క॥ జక్కవదొరపయిఁ బద్మిని,
బుక్కా గుప్పిళ్ళఁ జల్ల మొదయుతుతూరా
లొక్కొక్కొ యనఁ, గుక్కుటములు
గొక్కొరొకో యనియెఁ గొంతుఁగ్రొవులు నిక్కన్. 8

శా॥ నీడపొద్రిద్భవసంకులారవము లెంతే మ్రోఁగుతూర్యధ్వనుల్;
తూఁడుంబుట్టులపుప్పొడుల్ తనువులందుం జల్లుబుక్కాము; రే
పౌ డాపాదిలురాగ మంబరమునన్ భాసిల్ వసంతంబు; దం
డాడింపుత్సవ, మబ్జినీరవివివాహంగంబు వర్తిల్లెడున్. 9

ఉ॥ వేవెలుఁ గేగు దెంచునొక వేళను మాత్రమె కాని, తెల్వనే
మావలె బంధుమిత్రులసమాగమకాలము నల్లగుక్కుటా ?
లేవిధిఁ గాలవేదు లనునెక్కుడుపే? రవి దాని కర్థ ముల్
కా వని, చాటుకై వడిని, గాకులు వేకువఁ గావుకా వనున్. 10

తే॥ లేఁతపచ్చిక నల్లి, సాలీఁడు నడుమఁ
గూరుచుండినగుండ్రనిగూఁడు వోలె,
నాకసంబున వేకువ నపరదిశను
బొలిచె, నేణాంకబింబంబు తెలివి దూలి. 11

చ॥ తడవులనుండి గుట్టునను దాల్మిని దాఁకొని యున్న ప్రేమ, మ
ప్పుడు వలకాఁకచేఁ గరఁగి పొంగి తనుం దలిమంబు వాపి, నె
వ్వడిఁ బ్రియునిక్కఁ జేర్పఁగనె, బల్లున వేగినఁ దెల్లవోవున
ప్పడఁతుకమోముచాయ, శశి భాసిలెఁ బున్నమనాఁటివేకువన్.

ఉ॥ విన్ననునందనంబునను, వేకువయచ్చరలేమ, చుక్కలన్
గ్రొన్ననలన్ వెలుంగుకొనగోరులఁ ద్రుంచుచు, నించువెండిస
జ్జన్నవిధంబునం బొలిచె నంబుజవైరి బలారిదిక్కునం,
బున్నమ పోయినట్టిపదుమూఁడవనాఁటిప్రభాతపుందఱిన్. 13

క॥ వల్లభుఁ డగుశశితో నిసి
యెల్లను జాగరము చేసి, యిది యలసతఁ గ
న్నల్లల్ల మూయు నిపు డన,
హల్లకములు మొగుడుచున్నయవి తొగతీఁగన్. 14

తే॥ "చందురునితోడ వేడుకఁ జనెను దార;
లంతరిక్షభూసఖ్య మన్వర్థ; మకట !
నాథుతో నేగుభాగ్యంబు నాకు లేద"
యనుచు నఖువాత మూర్ఛను మునిఁగెఁ గలువ. 15

ఉ॥ స్నాన మొనర్చి శ్రోత్రియజనమ్ములతోడఁ బవిత్రగాత్రమిం,
దానిపొలంబుము స్తల మొదట్లగయం దునుచాళ్ళ మెట్టుచుం,
జేనను బంతిచల్లులు భుజించెడుశారులయిష్టగోష్ఠు లెం
తే నిగిడించుచుం, బయలఁ ద్రిమ్మరుఁ దొల్కరి వేగుఁదెమ్మెరల్.

క॥ తెగి పోక, కొనలు సాఁగుచు,
మిగులను సుకుమార మగుచు, మేనులు సాగియన్,
సొగసుగ రవగాలులు చ
ల్లగ వేకువ విసరె విరులు లతికల నరలన్. 17

ఉ॥ మల్లెలు విచ్చకొన్ననల, మావులు ముగ్గినపండ్లఁ, బద్మినుల్
ఫుల్లసరోజగంధములఁ, బుల్గులు శ్రావ్యము లైనపాటలం,
గొల్లగఁ గాన్కలీయ, నివిగో నబువాతను బెండ్లిపెద్దల
ట్లల్లన రాఁ దొడంగె మలయాచలశీతలవాతపోతముల్. 18

వ॥ నెలఁతను గూడ నెంచియును, నిద్దురమంపునఁ గన్నుమూసి, తాఁ
బలపల వేగ మేలుకొని, బాళిని దత్తఱ మొందుశ్రోత్రియుం
దలఁపఁగఁ జేయుచున్నయవి, ధామమునన్ మలయానిలాంకురం
బులకుఁ జలించుచున్, రజనిపోకకు వెల్వెలవోవుదీపముల్. 19

ఉ॥ కుమ్మరి పచ్చికుండపయి గూటముతోడను గొట్టినట్టుగాఁ,
గొమ్మలలోన దాఁగుకొని కూయఁగ సాగెను, వేకు వాది వృ
క్షమ్ముల జంటలై చెమరుఁగాకులు, కోకిలకూజితంపుగీ .
తమ్ముల కంగుదార్లగుచుఁ దాళము వేయువిధంబు దోఁపఁగన్.

ఆ॥ కొసల మంచుబొట్లు, గుచ్చినముత్తెంబు
లట్టు మెఱయఁ, బైని జిట్టిపిట
లూఁగు చుయ్యెలల బహుశ్రావ్యముగఁ గూయ,
రేపకడను దేజరిల్లు తెల్లు. 21

ఆ॥ పొడుపుఁగొండమీఁదియడవి, నుంటెను నాఁగ,
నరుణకాంతి ప్రాచియందుఁ దోఁచె;
నందుపైని, నింగి నావరించినధూమ
పుంజమో యనంగఁ, బొలిచె మొగులు. 22

తే॥ నిగ్గు లీనెడుసరిగంచునీలిచీర,
యూఱఁ గట్టినతీరున నందగించె,
వెనుక నుదయించి ప్రాఁకుభానునివెలుంగు,
తొదలఁ దుఱుఁగలించుకాలాభ్రమాల. 23

తే॥ ప్రాతరుదితార్కరశ్మిసంపర్కమునను,
మణిరుచుల మించుమంచుతుంపరల నఱలు
చిప్పపులువెన్నుఁబువ్వులఁ, జెప్పఁగాఁ
ద్రొక్కఁగ బయళ్ళ, మనసు చివుక్కు మనదె ? 24

---

## ప్రదోషము

ఉ॥ మాయలమారివాని కుపమానము నూసరవెల్లి చెప్పుచుం;
డ్రాయది యప్రసిద్ధవిషయం; బుదయాస్తమయంబులందు నిన్
ఱాయపువజ్రివాహనములన్ నిముసంబున కెన్నొ వేసముల్
వేయుచు నుండఁ జూతు; రవి పేర్కొన నేటికి వానిసాటికిన్?.

చ॥ కనకపుఁగాంతు లీనఁ, బులికాపొనరించినయూరకూటపుం
బనఁటులు, గౌతమీమధురవారిపరిపూరితముల్, వహించి మూఁ
పునఁ, గటి, మూర్ధమందుఁ, బదముల్ గలుగల్లనఁ, దారుమత్తకా
శినులు, మనోజరాజునభిషేకకరేణులు సాంధ్యవేళలన్. 26

ఆ॥ కొండగబ్బిలములు, కుతుకెండి, పయి తెక్క-
లార్చుకొనుచు డాయ, నలలచేతు
లెత్తి, వానినోరి కిడు నందికగ నీరు,
పేరిమవెల్లి గాతమీామతల్లి.

సీ॥ అరచందురునకు నుంచరయూపసాహస్రి
ములు ఘటిల్లఁ జలించునలలసలువు,
నలలమీాఁదను దళతళలు తేరఁగ, వెండి
జలపోఁత నలుపువెన్నెలల చెలువు,
వెన్నెలలకు నంత వింతజా దానగూడఁ,
జదలఁ బర్వినయెఱసంజసంచు,
నెఱసంజ మెలమెల్ల నినువంక దిగఁ జాఱ,
నిజనాథు నలరించునిసిబెడంగు,

తే॥ నిసి ధరించినగువ్వకన్నెలిచీర
కరణి రాణించునంతరిక్షంబుడంబుఁ,
గాంచుచును, జల్లగాలి సేవించుజనులు,
రేయిమొగమున నదియోరఁ బాయఁ గలరె?

---

— చంద్రతారకలు —

ఆ॥ దివ్వె యుంచి, గాలిఁ దేల వీడినకాకి
తంపుబుట్ట, చెట్లగుంపుమాటు
నుండి వోలెఁ, జంద్రుఁ డుదయాద్రిచఱినుండి
బయలు ప్రాఁకు, వింత ప్రజకుఁ దోఁప.

క॥ పేదకు సిగి యెత్తుకొనుం
ఖైదలి యొక్కొకతె చెట్ట వట్టినదానం;

దూదివలెఁ దోఁచుశీతల
పాదుఁడు వెలుఁ గొంచఁడే తుషారయోగమునన్?

తే॥ కాల మనుకంచరి, చకోరపాళి చంద్రి
కాసుధను జుఱ్ఱి సలుపుచొక్కంపువెండి
కంచమును, గాఁచి చల్లార్చి మించు వ్రేళ్ళ
నన, బాడిచి తేజరిలెఁ బ్రాచి, నమ్మృతక్రోచి. 39

ఆ॥ కాఁడు చందురుండు, గట్టిగా రుబ్బిన
మినుపపిండిముద్ద; మిన్ను గాదు,
పఱుచునీలిచీర; స్వర్ణారు లిపువక్షి
యములు గాని తారకములు కావు. 40

క॥ లోనం బలుమీనంబులు
లీనం బగుగగనధునివలెం గ్రాలెం, గో
టానంగోటులు చుక్కలు,
కానంబడ కుండఁ గాయుకౌముది, రాకన్. 41

ఉ॥ తారకలార! తండ్రి మిము దక్షుఁడు చంద్రున కీయుగంబునన్
ధారను బోసెనో, విభునిదగ్గఱ నింకను సిగ్గె మీకు; మేల్!
తూరుపుఁగొండపై నతఁడు తోఁచుచు, దిగ్గన లేచి, లోనగర్
దూఱితి రట్టె; పుట్టునగ తొయ్యలికిం బతిపజ్జ లజ్జగా. 42

తే॥ కలువపుప్పొడిగారశర్కరను గూర్చి,
చుక్క లనుద్రాక్షపండులు పెక్కు చేర్చి,
ప్రకృతి సమకూర్చువెన్నెలపాలయనుకుఁ
బాసెముఁ, జకోరములు ముక్కుబంటి మెక్కు. 43

ఆ॥ విన్ను పెరుఁగుఁగడవ; వెన్నెల తరకింబు;
వెలుఁగుచలివెలుంగు వెన్నముద్ద;
చిన్నిచుక్క లన్ని చిందులు; రే, యూపి
గోవుపాఁడిదర్చ్చుగొల్లభామ. 44

తే॥ అవనిపాప్రినీలిమేలుకట్టంబరంబు,
చిన్నమాటలు గొట్టి నేర్పడ్డచిల్లులవ్వి;
యవలివెల్తురు దోఁచుతదంతరముల,
రిక్కలంచు డాప్రిరయక విపరీతమతులు. 45

ఆ॥ "జింకపిల్ల గాదు, చెవులపిల్లియుఁ గాదు,
పాలవెల్లి నంటుబాడె గాదు,
చందమామలోనికందు, నే ననుకొందుఁ,
బ్రీతిఫలించినట్టికీర్తి యటంచు." 46

ఆ॥ కడుపు నిండ మంచుకాలకూటం బుండు
కడలి గదర, నిన్నుఁ గన్నవాఁడు;
తండ్రిపోల్కి నీకుఁ దప్పునే? చంద్ర! నీ
యందుఁ గందు, నిజము హాలహలము. 47

మత్త॥ మారుడండుసిపాయి చందురుమామ, పుష్పాడిమందు, రే,
కైరవంపుజజాయి నెట్టన గట్టనం బొనరించి, మొం
డౌరవంబునఁ దేఁటిగుం డెగయంగఁ, జేయునగాదు, దు
ర్వారుఁడై వధియింపఁ బాంథుల రశ్మిజానకినిప్పుకన్. 48

వేసంగి నొకనాఁడు సాయంకాలము తెలుఁగునేర్పుటకై నే నొకపాదిరీదొరయింటికిఁ బోయి రాత్రి వేళమీఁటి యిల్లు చేరితిని. అపుడు నాయాలస్యమునకు వయస్యుఁడొకఁడు హేతు వడుగ నుత్తర మిచ్చినపద్యము.

ఉ॥ చందురుమామ మింటను ఘనందుగఁ గాసెడుపండువెన్నెలల్,
గ్రిందిలుగొతమీఁనదితరంగలసంగతి వీచుతెమ్మెరల్,
మిందెసఁ గంచు బండలను మేనులు వాల్చుబికార్లపాటలున్,
ముందుకు సాగ నీక పదముల్ మసలింపెను నన్ను మిత్రమా.

క॥ పిండాఱఁ బోసినట్టులు
పాండురచంద్రాతపంబు భాసిల నిలపై,
మెండుకొనె బొంతకాకుల
పిండు లనఁ, బవనచలితవృక్షచ్ఛాయల్. 50

ఆ॥ నిలువఁ జోటు లేక నిఁగి నేమూలను,
జుక్కలందు నేల గ్రొక్కకొన్ని
వలన వచ్చె ననఁగఁ బొలిచెను మిణుఁగుఱుల్,
మినుకు మినుకు మని తమిస్రిలోన.

ఉ॥ చీఁకటిలోనఁ బోయెదరు చేఁపలకుఁ; గగనంపుదారి నే
యాఁకలు లేవు గాని, యెటు లబ్బె నెఱుంగుల? గొంగలార! మీ
యాకృతి నాకుఁ గానఁబడ; దైన, భవన్మృదులప్రసంగముల్
సోఁకు జెవిన్; బవల్ రవికి జగ్గే కులాయము లంటి యుంటిరో?

---

—• ననకారు •—

తే॥ మాఘ మాదిగ నాల్గేసి మాసములను
బలుక వలయును, ననకారు, వానకారు,
సీతుకా రని; నన, వానఁ, జేరి యుండు
నెండకా; రిట్లు ముక్కారు నెఱుఁగ నగును. 53

క॥ “చలువలు కడు వెదఁజల్లెడు
నెలవులకును జనక, జనులు నిలఁ జాలరు రాఁ
గలనెలల” ననుచుఁ దెలుపనో,
వలినాప్పుఁడు తిరిగె శిశిరనగమువలనికిన్. 54

క॥ పయిపుట్టంబుల నెడలిచి,
మయిపులకల జన్నిగట్లు మాఘస్నానం
బయి నిలుచునట్లు, లా కం
తయు రాలిచి, నన మొటికలఁ దరువులు పొలుచున్. 55

సీ॥ అర్కపత్త్రములు కర్కంధువుల్ మూర్ధంబు
సం దూని నదిఁ దాన మాడువారు,
బృందముండఱ నేఱుపిడకదాళులు పెట్టి,
గిన్నెలఁ బాలు పొంగించువారు,
చేఁ జూపి రవికిఁ, బాసెముఁ జిక్కుడాకుల,
బిడ్డలకును బ్రేమఁ బెట్టువారు,
వ్రతకథల్ విని, మేలు వడయ షోడశఫల
ప్రభృతు లౌనోములఁ బట్టువారు,
తే॥ పొంగుపాల గుప్పెళ్ళఁ బ్రాల్ వోయువారు,
ప్రొద్దుఁ గని కేలు మోడిచి మ్రొక్కువారు,
నగుచు రథసప్తమిని, నియమాతివినయ
వేష లై, కనువిందుఁ గావింతు రి సతులు. 56

క॥ ననిచిన పెనుమఱ్ఱులు, పూ
చిన మోదుగు, లాకు రాలిచిన రావులు, కా
చినమావు, లాది యగునా
మని దొరసిరిఁ బాడుఁ, బంచమశ్రుతిఁ బికముల్. 57

ఉ॥ అంకురముల్, చిగుళ్ళు, పసరాకు, ముదాకులు, పండుటాకులున్,
జంకుచు గాలికిన్, వటమునం బొలిచెం, "భువి మృత్యుభీతి స
ర్వాంకష; మెప్పుడుం గలదు; ప్రాయము నమ్మిన మోసపోదు; రో
మంకుజనంబులార!" యని మాటికిఁ జాటుచు నున్నకైవడిన్.

ఆ॥ ఫాల్గునంపుబహుళపక్షంబుహరివాస
రమునఁ, గడన సగము రాత్రి, వింటి,
మధునిరాకఁ దెలుపు మంగళకాహళ
యులివుఁ, గౌళయుక్తిఁ, గోకిలకుహూరవు. 59

తే॥ బహుళపక్షంపుఫాల్గునప్రతిపదుదయ
మునను విన నయ్యెఁ జాటిపిన స్వనము రౌద్రిఁ:
"ప్రజలు! నేఁడు వసంతోత్సవం బొనర్పుఁ;
డామ్రకుసుమభక్షణము సల్పుఁడు"; అనెను మాట. 60

తే॥ వేకువను నెత్తుపాగలమూఁక, గగన
రంగము జొరంగఁ బూరించుగాచబూర
తోడ మరుదంచుకాహళతోల్లసహాళువు,
మాఘ మేగినతోడియ, దుర్మతిని వింటి. 61

తే॥ లలితమధుమాసమునఁ జూతలతలకొనల
వింతగాఁ బుష్పమంజరుల్ వెలికి నిగిడె,
విజయసూచకముగ, సనవింటిజోదు
దొనలఁ, దమయంత నెగసెడుతూపు లనఁగ. 62

క॥ సుమనగపల్లవతతులకు
సమకూరదు మైత్రి, యరుదు; సహకారములన్;
సుమనగపల్లవతతులకు
సమకూరవి మైత్రి యరుదె సహకారములన్? 63

క॥ రాలిచి, ముదురాకంతయుఁ
దాలిచె లేఁజివురు చింత, తటి యిదె గోయన్;
జాల మొనరిచిన రుచి చెడు;
నాలస్యము విషము సేయు నమృతము సనచే? 64

క॥ పూవునకుం బూవురున కెం
పౌ చైత్రము మావి; నండ వాకచో దొండున్;
గోవెల తేఁటుల కిడెదవు
నీవే సహాపంక్తిఁ, దింత్రిణీ! వేసంగిన్. 65

క॥ బంతుల సంతర్పణముల
గొంతెత్తి ద్విజుల్ భజింతురి గోవిందుఁ గనున్;
పంతలఁ గోవెల తేంట్లును
సంతు నుతించుం గుహూగురుఝంకారములన్. 66

మ॥ తనుఁ బట్టం బసివాండ్రు వెంటఁ బరువెత్తం, గ్రింగికిన్ మీఁది-
కిన్
జనుచుం జేశలధాతకేసరశిరీషంబో యనం, గాలి నూఁ
దిననేసాళపుఁబాలపెన్బ్బడగమాద్రిం దోఁచుజిల్లేడుదూ
దినసన్, భిన్నఫలోద్గతంబుఁ, గన నెంతే వేడుకౌ వేసఁగిన్. 67

ఉ॥ కో యనుకోయిలల్ చెవులకుం, జలదాతపఖండశీతల
చ్ఛాయలు మేనికిన్, విరులు చల్లుసువాసన నాసకున్, ఫల
శ్రీయుతనమ్రిశాఖికలు దృష్టికి, స్వాదురసంబు జిహ్వ, కా
ప్యాయ మొనర్చునామ్రితరు లామని తేనినిదాఘసత్రిముల్. 68

ఆ॥ మరునివిల్లు తీపి, మలయానిలము తీపి,
మల్లెపువ్వు తీపి, మధువు తీపి,
మావిపండు తీపి, మదకోకిలము తీపి,
మధురతామయంబు మాధవంబు. 69

క॥ పరిమాణచ్ఛాయాకృతి
పరిమళరసమాధురులను బహుభేదంబై
యరు దగుటను, ఫలరాజను
బిరు దడిరి రసాలమున కభిజ్ఞులు సుకవుల్. 70

ఆ॥ రసము గట్టి కట్టి, రసనస్సఁ బసుపుఁ తేఁ
గరఁగి, చల్లగాను గళము దిగును ;
మరిదిమ, పసిమి, తావి, మాధురి, గుణపంక్తి
మంచుఁగరఁచు, మంచిమావిపండు. 71

ఉ॥ మల్లెలు రాలి, కా ప్రసరి, మరిఁది, విహాయసకాయసకాసం
దిట్టపునిట్టరాళ్ళ యన నిల్చినకొబ్బరమోళ్ళ నెట్టెప్పు
బట్టులబూలతోట్టలను, బాలలుఁ కుక్కలు గుర్రిఫ్లు పెట్టి, మే
ల్కట్టున బొమ్మలట్లు, లటుఁ గానలిడ్డు పెనుపట్లు వేసవిన్. 72

ఉ॥ చేడె, మగండు, వంతుమెయిఁ ద్రాలు ముక్కున నేతి తెచ్చుచున్,
బాడిద చెట్టుకొమ్మపలవం బడలంబుగఁ జూర్చి, యంతలో
వీడక, కాళ్ళఁ గుర్రింగి, యరవిచ్చిన తెక్కలఁ జక్కఁజేయుచుం,
గూఁడదె పన్నఁ గాకిపులుఁగుంగవఁ; జూడుఁడి పేదదంపతుల్.

ఆ॥ నాడికేడమాదు నీడంబు పన్నకా
కోలయుగముగోల వీలుచెవుల
కూటటగ కుకోకు లాడవె, సత్తెచెట్టు
కెలన జామచెట్టు కలుగఁ బట్టి. 74

చ. అఱచుచు జీఱకంఠమున, నార్చుచుఁ జక్కనిరంగు తెక్కలం,
దఱుముచుఁ గాకిగద్దల, నిదాఘదినంబుల నిప్పుటెండలో,
నెఱకలు మగ్గునో యనక యేదెడు గ్రుడ్లఁ బాల, ప్రేమఁగా
బ్బెరతల నిల్చుచుం; గడుపుఁబ్రేమ సహింపనిశక్త మున్నదే? 75

ఆ॥ లేకలేక రేయి చేకూఱునాకూరు
కేగు పెండ్లి నెడలు కెంత ? నేఁడు
కుంభకర్ణనిద్రఁ గూరు తెమ్మెరయుఁ దా
మెల్లమెల్ల దీన మేలుకొనియె. 76

ఆ॥ కొట్లు నిండఁ గోట్లుకొలఁది రొక్కంబున్న,
నేమిఫలము, బీగ మెడప కున్న?
జగతి నెండ గాలి సంపూర్ణముగ నున్న,
గడల దేని దానఁ గలదె సుఖము? 77

చ॥ తళతళ వెండిరేకులవిధంబున, వెన్నెలలోన మట్టలా
కులు మలయానిలంబునను గొంచెముగాఁ జలియింప, సందుసం
దులను కళుక్కు మంచు నెల తోఁపఁగ, నేలను నీడ లాడఁగా,
నెలమి జనించు రాతిరి శయింపఁగఁ గొబ్బరిచెట్లుక్రిందటన్. 78

తే॥ వృక్షశాఖలఁ దలక్రిందు వ్రేలుకొండ
గబ్బిలమ్ములు గెలలు గాచ్చుక్రమము తోఁచు,
వేసఁగిపగళ్ళఁ బన్నుండి విడక జనులు,
విసనకఱ్ఱలఁ గదలించువిధముఁ జూడ. 79

తే॥ రాతిగోలెంబులను దాఁచునట్టినీళ్ళు
స్నానమునకును, మంటికూజాలఁ బోయు
నేటినీళ్ళు పానమునకు, నెంతో చల్లఁ
దన మొసఁగు, మండువేసగిదినములందు. 80

సీ॥ గూఁడుఁదొట్లలలో శకుంతపోతములకుఁ
జెట్లకొమ్మ లుయ్యాలచేరు లయ్యె,
మహితధాత్రీరజోమంత్రవిభూతికి,
వాయసాదులు మోళివార లయ్యె,
ధూతనిష్కుటతృణద్రుమపాళిసివసత్త్వ
లకు, డప్పు లయ్యె జాలకపుఁదలుపు,
లెలమావితోఁటఁ బర్విడుబాలురకు, దోర
పండుగాయలు జోరుబంతు లయ్యెఁ

సీ॥ పిట్టలట్టుల యిండ్ల పెంకు లెగిరెఁ బైకిఁ,
బెంకులవలె రాలెఁ బిట్టలిలను,
చల్లిఁ జొచ్చెను గొన్ని తరు, లుల్కి దాయకు,
నుపతంద్రిఁ బోలెఁ గొ, న్నులుక యెదరి,
ప్రకటించె నరఁటిఁ రంభారావణక్రీడఁ,
జెండాటఁ నలఁపించె బొండలములు,
ప్రళయనాటకప్రంజవనిక యయ్యె చుమార,
నుంగుదాడుగఁ దోఁచె నభ్ర మందుఁ,
తే॥ జుక్క లెల్లను బట్టూడి, యొక్క పెట్ట
మల్లిన ట్లగువడగండ్ల జల్లుతోడ,
గోడలును మేడలును సూఁగు లాడునట్లు,
చండతరభంగి వీవ ఝంఝామరుత్తు. 87
క॥ శ్రీరామనవమి రేపన,
మారుతవేగమునఁ గూడి మబ్బులు దివి, గ
ర్జారవములతో, మెఱుముల
తో, రుధిరోద్గారి రాల్చెఁ దొలకరిచినుకుల్. 88
ఉ॥ మింటను మించు, లింటెదుటి మేడను వడ్లనరాచపెండ్లివా
ల్గంటులు, మిర్మిటుల్ గొలుపఁ గన్నుల, మబ్బులు డప్పు లప్లువీ
న్దంటను వ్రిక్కలింపఁ, దనుతాపవధూవరచిత్తతాపముల్
వెంటనె పో, ఘటిల్లె రెయి వృష్టి, కరగ్రహతుష్టి, వేసఁగిన్. 89
చ॥ కురిసెను వాన, మూఁడు పిడుగుల్ పడె; నుప్పలవారిగొప్పయు
ప్పరిగ నగల్చె నం దొకటి; వజ్రికి రాజమహేంద్రమందు మ
త్సరమొకొ? బోధనాభ్యసనధామను సౌధము వ్రచ్చెఁ గొన్నివ
త్సరములకింద; బౌండ్రికనిశాచరుఁ డంపు మహేంద్రు నట్లు-
యేన్. 90

తే॥ అగ్ని చెఱుఁగుగాలి, యూఁగాడుఁ దాఁగాలు
గుంట గొట్టుగాలి, గోడ చెర్చు
చిచ్చుమంట, ఱోళ్ళు చీలుచు బ్రేలంగ,
దావపావకము, నిదాఘసఖము. 91

మ॥ కలయన్ఱేఁబును ధార గ్రోసి సమ దాఘాశంకలన్ జట్టి వే
కలదాలన్ బురుడింప, ద్విజకవిశ్వసస్యంబులన్ ఫలంబులన్ జలా
బులు, సర్వౌషధి భూతతృప్తికిఁ, గాలంబులన్ మాపులున్ బాపులన్
గలఁచివానన్ గృతవిశ్వజీవన్మఘుఁ డఘున్ బ్రాఖిఘమున్ బ్రామలన్.

—• వానకారు •—

తే॥ నీలిమేల్కట్టుఁ గలఁపించె నింగి మబ్బు,
తెరమఱుఁగుదీపమును బోలె ఖరకరుండు,
కాలి చల్లాఱుపెన మయ్యె నేల, ఱోళ్ళు
చీలు రోహిణి చని మృగశిర చేరంగ. 93

క॥ మండెడు రోహిణినిప్పుల
గుండమునకు నింతనీటికుం డయ్యెను, గ
న్పండఁగనె, లేడియూఁపల,
కొం డంటినయెండమంట గుంటు నడంగన్. 94

ఆ॥ సన్నచినుకు రాల్చి చల్లార్చె, రోహిణి
మిన్ను ముట్టుమంట, మృగశిరస్సు;
కన్నుబొమ్మసన్న గడగడ లాడించు,
శక్తి యున్నయన్న శత్రువులను. 95

ఆ॥ నీలనీలమేఘమాలమోఁగిలను, గల
ధౌతధౌతబకవితతి తనర్చె,
నల్లపట్టుసెల్లయుల్లడ, నిడువెల్ల
దమ్మిపూలదోరణమ్ము వోలె. 96

తే॥ ప్రావృడంగన, కబరీభరమునఁ జెఱువు
మల్లెమొగ్గలదండ నా నుల్లసిల్లె,
నల్లబల్లను సీమసున్నంపుగీఁతఁ
బోలు వెలికొంగచాలు, కార్మొగులు మ్రోల. 97

ఉ॥ క్రొవ్వలు, పల్లపుఁబాసలను గుర్తిచ్చినసోగవి దాల్చెనో నిజ
గ్రీవను భూమిదేవి, బహురీతుల నీలపయోదమాలికల్
శ్రీ విలసిల్ల నిండ నలుగ్రేవను వ్రేలుట గాంచి, యుంచ చనన్,
ద్రోవ బోలంగ పండ సవరుం జలిచీమలబార్లు దొల్కరిన్. 98

క॥ తొలకరిని బాటవలఁతికిఁ
గలమంపునాణ్ణు పేర గర్భము నిలువం
జలిచీమలచాల్ నెపమున
నలవడి నలుపుల్ నగుచు నా శేర్పడియెన్. 99

చ॥ వలకపనుండి డాకపక్కఁ బ్రాచిని, భాసురనీలమేఘమం
డలమున వ్రాలుప్రొద్దుకిరణంబులు పర్వఁటఁ, జిత్రవర్ణమై
యలరుచుఁ దోఁచె నింద్రధను;వందు ఘటించినయుజ్జ్వలాస్త్రముం
బలెఁ, దొలుకాఱుఁగ్రొమ్మెఱుఁగు మధ్యమునందుఁ మెఱసెం—
దళుక్కునన్. 100

మ॥ పసరాకుంగమి కప్పుపెంపుఁ గలశోభం దూల, ఝంఝానిలుం,
డసకృన్మర్మరమర్దనధ్వనుల స్నేహోసంద లంటక్, లస
ద్రసితం బంచితశింజితంబు, చపలల్ రత్నప్రభల్ గా, రజో
విసరాంతంబుగ దిమ్మరించె జలముల్, వృక్షాలఁ గాదంబినుల్.

తే॥ వానసోనల మేనులు సాన కుండ,
జను లుచితసాధనంబులు సంతరింప,
ఋతువు మాదిరు లిటు ప్రదర్శించె ననఁగఁ,
బలుఁదెఱఁగువింతఛత్రికములు జనించె. 102

కం॥ సిగ దడియు దుండ, వన్నెల
దిగపట్టుంగోకుగ లెత్తు క్రిమంతులు గాఁగన్,
గగనమున మొగులుగమిఁ గని,
నిగనిగ మనుపురులు విచ్చి నిలుగడెంబుల్. 103

కం॥ మారుతశీతమును, వానిక
ధారలు నాట్యంబు సేయఁ, దకసగాయ బలెన్,
బారిగంభించె నటింప, మ
యూరాళితతుల్, వాని మించనో యన మించున్. 104

చ॥ పొడవుగ మాను కెక్కి మెడఁ, బట్టుఁదురాయి చలించ గాలిచే,
గొడుగును విప్పి నట్టు తెలిఁగుంబుచి గ్రాలి మొగాంబుఁగన్నులన్,
జడిగొనుసమ్మదాశ్రుపులజాలున నుబ్బనఁ, జెల్వు, గొల్కులం
దవరఁగఁ, గేకి, మేఘ పిడె యంబుదసన్నిధి నల్పుఁ గుండలిన్.

మ॥ అనుఁగు న్నీలపయోదమున్ జడల శుక్లాపాంగముల్ చూచి, పి
ప్పినపించెంబుల నెత్తి నర్తనము గావింపంగ, నవ్వానిక
న్గానలన్ జాఱుముక్తిబిందువులు పెంటుల్ గ్రోలి గర్భంబు దా
ల్చునఁ; జేవంపువిధాన మొంటి కట నీకుం జేల కల్పించెనో.

ఉ॥ పించెముఁ జక్క విప్పుకొని, క్రీతి నెమిళ్ళు మహీతలంబునన్,
మించులు కాంచనప్రభల మింటను, నాట్యము సల్పునట్లుగా,
మంచిమృదంగకృత్యమున మబ్బుగమిన్ నియమించి, నానకా
రంచితరీతి సర్వమిథునాళికి శోభనముల్ ఘటించెనున్. 107

క॥ “ఎప్పుడుఁ గనఁబడునన్నుల
నొప్పెడు మాఁవిప్పపింఛ; మొక్కొక్కయెడన్
గప్పదు నీతారక,” లను
నుప్పరమును, నిక్కుమెడ మయూరము గేకన్. 108

సీ॥ శ్రీప్రోచ్చహర్మ్యోపరిపరిణాళీముఖాం
బూరుధారాపరిభిన్నోపలంబు,
గేహాగ్రవలభీసమూహాకీర్ణాపసం
పాతోత్పతత్కణాపహృతతాప,
చూషుట్టిశపరిత్రోళిఘనోభయపార్శ్వ
లఘుఝురీలోలబాలకమనంబు,
తత్రతత్రచ్ఛంచలాక్షీశిఖోన్నద్ధామ
కుళితపరిగుప్తచతుశ్శ్రవంబు,
తే॥ వివిధసవిధాశ్మనోన్నతోర్వీసమాగ
తప్రవాహపరికలుషపాథస్తటాక
పతితధారాళధారాపరిభవనేక
బహుసుస్థూలముక్తామిహోప్రితానాన. 109

ఆ॥ వాననీటఁ బడ్డవడ్డధారలగుంట
లందు నుబుకునీళ్లు లందగించెఁ,
దులసికోటలొద్దఁ వెలిఁగింప, గుఱుగులఁ
వైచి యుంచుపూవువత్తులట్లు. 110

ఆ॥ పచ్చఁదామరాకుపై, జలదేవత
మేనఁ బచ్చడంబు వోనిదాన,
వానచినుకు, లంబువాహంబునను బుట్టుఁ
జినుకుఁబూస లనుట, మనకుఁ జాటు. 111

ఆ॥ తామరాకులం దుదకబిందువులు కంధ
రుండు రాల్ప, మణులరూపుఁ దాల్చె;
నవ్విధంబు, దివ్యుఁ డగుదాతమహిమంబొ,
పావనాత్మపాత్రవరమహిమమొ. 112

తే॥ ఉక్కపోఁగలచిక్కంబు, లోనిగాలి
చిల్లు గొట్టుటచే వానసమయమందు,
నీటిబొట్టులు గిన్నెల నిలుపఁ జాలిన
జాలకంబుల, ముత్యాలజల్లులట్లు. 114

ఉ॥ గాడుపు పెల్లిపడం బసదుగట్టితముల్ బెనువానపోనలుం
గూడఁ, బుతుజ్ఞఁడై ఘనుఁడు సూడుటు, ఘూసతి సస్యగిడ్డ గా,
నోడికజాడ తేరుపడి యున్నసగంబులు, మన్న నేలలుం,
జూడఁగ, గోరిచాళులచనుఁగవ, [illegible] యించుఁ, దోఁచెపున్.

తే॥ కూరభల్లూకములు చెట్టుకొమ్మలకును,
గుంపెనీగోసిపాయీలు కోటలకును
బోలె, నెగఁబ్రాకఁ గొచ్చెను ముమ్మరముగఁ
గంబళులు, మొక్కలకును బ్రాకారములకు. 115

ఆ॥ చిలుకపొట్టఁ బోలిచెను బచ్చపట్టను
కాళిదాసు కనఁడొ గారగోడ
వానప్రాఁకు, నెండ నైచిన మొకపాలు
పచ్చడాలుసాలుమెచ్చుదాని. 116

శా॥ వాహాతిక్రమవేగనిస్త్రితపరీవాహాంబుసన్, మీనసం
దోహంబుల్ వినిమగ్నమై యమకుచో, దుర్భిక్షయుం దొల్కఁ, దు
త్సాహం బెచ్చఁగ బిట్టు మిట్టిపడి, భక్ష్యంబయ్యెఁ జైకాకిసన్;
హా! హా! ప్రిబ్బనలిబ్బి కుబ్బపదువాఁ డల్లే నశించుం జుమీ.

కీర్తిశేషురాలైన నాతృతీయకళత్రముపుట్టినిల్లుంగుటూరు.

1-11-1885 సం॥ నే నాయూరికిబోయి, యొకనాఁడు కాలువయొడ్డున నరుగఁగా, దానితూములోనుండి చెఱువులోనికిఁ జిఱుకాలువదారిని విశేషముగా నీరు పోవుచుండెను. అప్పుడాచిన్నకాలువయొడ్డఁ జేరి బహుజనులు చేఁపలు పట్టుచుండిరి. ఆసంవత్సరము రాజమహేంద్రవ

రమున నధికముగా విషూచి వ్యాపించి జననష్టముఁ గలిగించు చుండె ను. ఈచేఁపల యవస్థ యాజనులయవస్థను స్ఫురింపఁ జేయ నీక్రిందిసీ సము రచించితిని.

సీ॥ మాలఁ డొక్కఁడుఁ డాసమై దేవులాడుచు,
వట్టిచేతులఁ గొన్ని పట్టు చుండె;
మునిఁగి నీళ్ళఁ గిరాతి మొలకచన్నులు దోఁపఁ,
బైఁటకొంగునఁ గొన్ని పట్టు చుండె;
మోఁచేతివల సాఁచి వీచి వైచుచు, బెస్త
వాఁ డొక్కఁ, డొకకొన్ని పట్టు చుండె;
నీళ్ళయోరను బొంచి, నిడుపాటిమెడ వంచి,
బకము ముక్కునఁ గొన్ని పట్టు చుండె;
తే॥ నైన నీరీతిగండము లన్ని గడచి,
చేఁప లెన్నెన్నొ సారణిఁ జెఱువు చొచ్చె;
వేయిమొగముల మృత్యువు వెదకు చున్న,
నాయు వుండినవారికి హాని లేదు. 118

క॥ ఈదుందుభిమార్గశిరము
నాఁడిఁ వదియఁ జవితి, భువియొ యాకసమో, రే
యో దినమొ, దేశకాలవి
భేదము తెలియంగ రానివృష్టి ఘటిల్లెన్. 119

క॥ మాదాక్షిపత్రికనందున,
నేదొంగలో పాఱవైచి రెన్నో నగలన్
భీ, దుందుభివానరెంటిన్;
వా దర్థానువుల కైనఁ, బ్రాణమె గెలుచున్. 120

క॥ పోలున్ రుధిరోద్గారి
స్గిలాలోద్గారి యనుట; నేలయు, నింగిన్,

సోళులు, నేళులు, నేకం
బౌలాగున గురిసె వాన, లాశ్వయుజమునన్. 121

క॥ ధారాసారము, పధికో
ద్గారిసమాశ్వయుజమున, నఖండిత స్వా
ర్వారము, లఘనము, విస్త
ర్జారవర్షుంవసూరాత్రిప్రచారము, గురిసెన్. 122

తే॥ నభము చిల్లులు వడినట్లు, నాలు గేను
నాళు, లుఱుమసిమెఱుమసిగాలివాన,
కార్తికంబునను దధిరోద్గారిఁ బట్టెఁ,
బంట లసి నోటిదోరవి, ఫలము గలియ. 123

క॥ ఇరుసంజల రాగములే
పరయుఁగఁ గార్తికమునందు సంబరమునఁ, జూ
పఱకున్ సార్థకనామం
బుర రుధిరోద్గారి యనెడుబుద్ధి జనించెన్. 124

చ॥ వెలుతులనుండి స్తపగిటివెల్తురు, లోనికి విచ్చువచ్చునుం
గలువలతోరణాలవలెఁ గిప్పునఁ దోఁపఁగఁ, దన్మకందధా
రలొ యన వానసోనలు చొరంగనొకానొకచెంకుటిల్లు, మి
క్కిలి శిథిలత్వ మొందియును, గ్రిందికి వాలుప నీడ తెప్పలన్.

సీ॥ శ్రావ్యమస్వశమృదుస్వనమనోహరములై,
యుప్పరంబున మొయి ల్లుఱుము చుండఁ,
జిమ్మచీఁకటిలోనఁ గ్రొమ్మించు లెడ నెడఁ
దో తెంచి, కిటికీలఁ దొంగి చూడ,
మర్మరధ్వనులతో మబ్బుపై గాలి, క
మ్మనివానతావి ను స్పనుచు వీవ,

ముత్యాలజాలరుల్ ముసుఁగు వేసినదారి,
నుపకధారలఁ జూరు లొప్పు చుండఁ,
తే॥ బట్టెమంచముఁ, బౌనుపుఁ, బందిరియును,
జాలరును, దోమతెర, పూలు, మేలుకట్టుఁ,
బచ్చడము, నడపముఁ, గిల్లుపడుకటిల్లు,
ముదిత దవ్వుల నుండిన ముల్లు గాదె? 126

—— సీతుకాలు ——

ఉ॥ ధారిణి సస్యవృద్ధిక, నిదాఘుడనంబుల సేకరించునీ,
రారవి లోకబంధుఁ డపు డప్పుడు సర్వము గుమ్మరించి, యి
ష్టారక తోమి బోరగిల నుంచుమహాయసపాత్రిమో యనం,
జారుశరద్వ్యహాయస మెసంగు, వినిర్మలమై విశాలమై. 127
సీ॥ తతఘనాఘనకర్దమితచంద్రికాంబువుల్,
వెలిమబ్బుఁబటికచేఁ గలఁక దేరెఁ;
గలుషవార్మలినసైకతసుధాకుట్టిమ
స్థలి, చంద్రికాపూరధౌత మయ్యె;
వలన వోయినకవీంద్రులరాకకల్మిచే,
సుప్రసన్నత సరసులకుఁ గలిగె;
దుర్దినవశత నాథునిఁ గానమిని, సాశ్రు
ముఖి యైనతమ్మి యామోద మొందె;
తే॥ మున్ను దా నీరు మోసిక యున్న తెల్లు,
సురుచిరంబుగఁ బ్రసవవిస్ఫూర్తిఁ దనరె;
రేయువలెఁ గారుకొనువర్షఋతువు వోయి,
వేకువను బోలుశారదవేళ వచ్చె. 128
ఉ॥ దట్టముగా విశాలసికతాతల మంతటఁ గారు గ్రమ్మి చూ
పట్టెడుతెల్లు, పూచి మృదువాతహతిం జలియించు టొప్పెఁ, బై

క్రొత్తిపయఃప్ఫేనములతోఁ బసలోనఁ బెరుఁగమూడిక౯
పుష్ప, పిసిలతోయమునఁ బొల్పుమహాంబుతాశిరాపతి౯.

కం॥ శరసములఁ బెరుఁగుమాన కా
శరసములనె యనుకరించఁ జను ననుచు, సరి
శరములఁ గప్పెనసరమున
శరములు, విమలంబు లయ్యె శారదవేళ౯. 130

శా. చాలం బూచినతెల్లదుబ్బులు సముంచత్కాశమీకాంబులన్,
గాలిన్ నేలకు వ్రాలుచున్, మరలు పేరం జేయుచున్ మీఁదికిం
గ్రాలెన్, గాలను మైలతో నదికి, వెన్నెం భాసలం గూడ, నా
క్రోలం జాకిత లాజఁ బట్టుముడఁగుంబట్టాలచుట్టా లనన్. 131

ఉ॥ మొన్నటిదింత, మల్లెపొదఁ బ్రాచిన దొత్తుగ నంచుఁ, బాలు నో
య న్నిగిడించు కేలి కొక కైనను గొన్నన యబ్బ దయ్యె, నా
సన్నపుసన్నజాజిలతసందులఁ జందుసుధాంశు లవ్వి; హా!
వెన్నెల యెంతమోసము కవిన్ ననుఁ జేసెఁ దిశరన్నిశన్. 132

ఉ॥ శారదరాత్రిపైని సరసంబుగఁ జందురుమాను చిల్కుప
న్నీరనఁ, బొల్పుపల్లవియఁజేయఁ ప్రమించున మించుదూర్వలం,
ధారిణి వేకుపం దగెఁ, సనాతన కావున, సంభవజ్జరా
భారవశంబునన్ బలితపాండురకేశకలాపయయ్యె నాన్. 133

చ॥ శరదృతు వేగుదేక మును, చక్కనిగాత్రమిస్సైకతస్థలిన్,
శరవణ మించు కించు కొకచాయను బూ తలచూప, భాసిలెం,
బరువపుఁబ్రాయపుంబడుచువానికి, నొదలయందు సాంద్రమై
బెరసిననిప్పుపోగెలఅనొందుగికల, న్నర దోఁచుకై నడిన్. 134

తే॥ మెఱమ కుఱుమక రేవగల్ మింట మొఱులు,
కాటకము దీఱ వెన్నాళ్లు కాఱు గ్రిమ్మ,
యాశ్వయుజమాసకృష్ణపక్షాంతమునను,
సర్వధారిని దూర్పువర్షములు గురిసె. 135

క॥ ఇలుముంగిటిపున్నమని
వ్వెలసీడలు, కార్తికమున వెలిజలదార్గక్,
కలధౌతవికచకములం
బులభ్రాంతిని, వింత, ప్రజకుఁ బుట్టించె నిసిన్. 136

క॥ జనులకు యమసదనమె యీ
దినముల శరణం బటంచుఁ దెలుప ననంగా,
దినకరుఁడు దిరిగె దక్షిణ
మునకుం, బ్రభ దఱిఁగి దివసములు కుఱుచలు గాన్.

చ॥ తఱచుగఁ బూచుచెంపొగలతం బిహితం బయి, రేవునందె చూ
పఱకును స్వచ్ఛవారిఁ గన వచ్చెడునిచ్చలు వొప్పెఁ బొద్దుటం,
గఱచెడుకోఱ లేనిపులి గా చలి; గావునఁ గప్పుకొన్నదో
యెఱపుఁబచ్చపచ్చడము, నీజలదేవత నాఁగ, సీతునన్. 138

ఆ॥ అర్కుఁ డోజ దఱిఁగి యస్తమించుచు నుండఁ,
జీకువాలు పోలె సీతు బలియు;
నుదయ మగుచు నుండ నొదిఁగెడునిరులుతో
నుఱుఁగ వలదె? పెచ్చు పెరుఁగు; నేల? 139

ఉ॥ అట్టపుశీతబాధ నుదయాచలభిల్లుఁడు లేచి వేకువన్,
జెట్టులకిందియా కలముఁ, జెత్త చెదారముఁ, బ్రోవు చేసి, యా
మట్టున నిప్పు బెటి, చలిమంటకు నూఁదఁగ, ధూమరాశిఁ జూ
పట్టెడుకీలి పోలె, రవి ప్రాచిని దోఁచె హిమానిలోపలన్. 140

ఉ॥ జంపతులార! మీనదుము సం దిసుమంతయుఁ దోఁప నీకుఁడీ;
కంపిలఁ జేయు మిమ్ము నవకాశము లేశము చిక్కె నేనియుం;
గొంపలఁ దూఱితూఱి వెదకుం బొలయుల్కలవారి సీతు; చిం
తింపుఁడి పార్వతీభవుల, నిత్యహిమాలయశృంగధాములన్. 141

ఉ॥ వెల్లలు వేసి యున్నిటను; వీధుల ముందు నెగళ్లు; లిండ్ల వా
కిళ్లను ముగ్గులుంచ; ట్లనుంగుఁగోత్రినం సున్నపుబొట్లు, జేగు; అ
త్తుల్వెల్లపుఁబూసకున్, పసుపుంబూంతలు, ద్వారములందుఁ గుంకు-
మల్ ;
పట్టెలుఁ, బట్టణాలుఁ, గనుఁబండువు సంక్రమణంపుఁబండుగన్.

ఉ॥ కొమ్మలు కెంపి మెల్పిరిగి క్రొవ్వుపొ శేళులుఁ, జిత్రవర్ణప
త్రమ్ములమేల్పనుత్రిములు, రమ్యశిరస్త్రము, లూనుతామ్రచూ
డమ్ములు, శేఖరిచీఁకటికొలం దలఁపించుచు, గోపురిన్ యథే
చ్ఛమ్మ చరించు, నీమకరసంక్రమణమ్మున, శౌర్యధుర్యముల్.

చ॥ కడచెను దక్షిణాలయమఘాతుకకాలము; వచ్చెఁ బెండిలుల్,
నడుగులుఁ, జేయుశోభనపువాసరముల్ గలయుత్తరాయణం;
బెడలెను సల్లభూజనుల కెల్ల ఘటిల్లినకాకిరూపికం;
గడగుడి డాయఁ గంటి; మెఱగంటియుగాది శుభాగి గావుతన్.

—• 22-10-1882. ధూమకేతువర్ణనము •—

సీ॥ చదలుకు దారిని జనియెడుకాలంపుఁ
బాగబండియావిరిపుంజ మనఁగ,
శరదృతు విది గాన, సురసరిత్తీరానఁ
బూచి వ్రాలిసతెల్లుపూ వనంగఁ,
దరుణార్కుఁ డోడియుద్ధమ్ముకై ప్రధావించు
మందేహుతేజిచామర మనంగఁ,
ఒసిమినీపరిణయపరత వచ్చెదుభాను
ముందు గాల్చెదుచిచ్చుబుడ్డి యనఁగ
తే॥ నెసఁగి యాఁదోఁకగాఁ, దూర్పుదెసకు శిరముఁ,
బడమరకుఁ దోఁక వ్యాపింపఁ, బ్రాచియందు

వేకువను బోఁ దొచుచున్నది, శోక్ష:కి
హేతువు పశుపక్షిశిఖారాములకెల్ల వేకువే. 152

క॥ మనుజాళిఁ దేలుపవాన
గని, గుర్విడను పట్టి, పోవుగతిగని చూచు
చూనరం సూర్చుంచినమా
డ్కాని, సంతప్తారఘామ కెరు వేలు మ.. 153

ఉత్తోఁకచుక్క నానాటికిని గానవచ్చిన తెలిపుచున్న
సూర్చ వ్రాసినది. చిత్రభానుసం వత్సరము వ్రాసినది.

సీ॥ పరిగ్రహితస్థానకేజసారి తా
ఘనపలతునాలతుల యనఁగి,
దైవయాతాగ్రివిన్యాస్త్రిలోకైకా
పత్యసూచకసితధ్వజ మనఁగ,
నుదయపర్వపద్రిదీపోన్ముఖామాత్రము,
సజ్జస్థితం బైనశలభ మనఁగ,
హిమనామవర్గాగమముఁ దెల్పు, నాకిసం
బునఁ దోఁచినయినుపపుపు పనంగ,
తే॥ మొదట నిబిడప్రకాశమై, పిదపఁ బిదపఁ,
బలుచనై, ఘూసరం బయి, తెలివి మాసి,
త్రిభుజరూపంబుతోఁ దల క్రిందు గాను,
వేకువను గానఁబడుఁ బెద్దతోఁకచుక్క. 154

1882 చిత్రభానునం॥ ఆశ్వయుజమాసము, పగలు జాము ప్రొ
ద్దుండగాఁ బడమరఁ గనఁబడుచు వచ్చినశుక్రునిఁ గూర్చి

ఉ॥ వేకువ నేను వచ్చు దెస, వే తఱకరుం జక సద్దతోఁకతో
రాక యొనర్చుఁ, బన్నె ప్రజ ప్రిబ్బినయబ్రిమునం గనంగ; నా
కాకడ నున్న, గౌరవ మిఁక బ్బ దటంచు, నుపాయశాలియై
సోఁకులయొజ్జ, వింతఁ దనుఁ జూడఁ, బ్రతీచిని దోఁచెను బగల్.

— శిశువు; వృద్ధు —

తే॥ అంగిరుఁడై, గర్భమున జన్మ డారఁ బండి,
యిలను రాలును బొమ్మిదినెలలు నిండఁ;
బుడమిపై వెంకి నూ అబ్దములకుఁ బండి,
దేహమును పీసి, తేజమై దివికి నెగయు. 156

తే॥ అడుగుఁడమ్ములు నాలియట్లు నూర్చి,
హస్తకమలంబులను పలయుంపిఁ జేసి,
మూసి కాటుకకన్నుఁడమ్ములను, బొత్తి
కలను పలికిలునవా నెకిం దెలిమిఁ గొలుపు. 157

క॥ తలిమంబునఁ బొత్తుల వెలి
కిలి, వెనుకకు ముందరకును గేరుచుఁ గాళ్లే
తులు గదలుచు నిను, విభవ
జలనిధి నీఁదంగ నభ్యసము సల్పు ననన్. 158

తే॥ వెన్నెలను జిమ్ముగిల్లుజాబిల్లిమణుల
లీల, లాలను నానెడు లేఁతపాల
బుగ్గలం, గిలకిల వేగుఁబోక నగుచుఁ,
గేరుపసిపాప హృత్తాపహారి గాఁడె? 159

క॥ ఊఁయన, నాఁయన, నెనో
కాయంబునఁ గలుగుఁ గదలికల్ కందున; కే
యోమయాంతరయత్నంబుల
నాయాస్వర మొదవు, వేద్య మది యోగులకున్. 160

క॥ బలిబిలిపలుకులు సుధ, చేఁ
బులుముకొనినకాటు, కగులుబొ, ట్టంకంబున్,
గిలకిలనవ్వు వెన్నెల, వ
ద్దల మగునీనిసుఁగుమొగము తొగచెలిఁ దొరయున్. 161

తే॥ దేవుపటముమాఁదితలుపులు తెఱచి యుండ,
సర్వకుంకుమ మాయుచోఁ, బండిరి యాఁగ, వాఁడు
"మాయ కున్న దేవుఁడు పాఱి పోను" ననియె;
ముగ్ధతావ్యక్తమధురముల్ బుడుతనుడులు. 168

తే॥ పొడిచి, పడమరదెసఁ బాఁకుపూర్ణచంద్రు
"బువ్వఁ దిని వొచ్చి, జాబ్లిమాయి, బొబ్బకోత
మొల్లుతూఁ వుంది గాదారి, కడగో బాబ"
యనునపభ్రంశపుశిశూక్తు లమృతరుచులు. 169

తే॥ తొక్కునుడువుల, నంత మేదో తెలుపుచు,
నడుమ నడుమను దోఁగుఁకక, "నాకు రాదు,
నివ్వు చెప్పు మామా" టనునిసువుముద్దుఁ
బలుకులకుఁ దేనెచినుకులు చులుక గావె. 170

శా॥ బాబీ యంచును, బాబిగా యనుచు, బాబా, బాబుగా, బాబిగాఁ
బా! బాబాయి యటంచు, బిడ్డపిలుపుల్ నైకంబుగాఁ దోఁచు గా
రాబం బెచ్చుకొలంది; మానసశరీరాలం బలెన్, రాగ మె
న్నేఁ బొందించు వికారముల్, నుడువులన్ స్వేచ్ఛాగతిం జేష్టలన్

తే॥ తనదుసీడను జేతియద్దమునఁ జూచి,
"పండుకోఁ బెట్టు మమ్మ! పాపాయి" యనుచుఁ,
గాళులను బాఱఁ జాఁచెడుపాలపాప
ముగ్ధభావంబు, ముద్దులు మూట గట్టు. 172

ఆ॥ మఱికి పసరుటాకుఁ గొఱుకుటఁ గని, "మేఁక
తమ్ములమ్మ సేయు నమ్మ!" యనును;
గాగితమున గీఱఁ గని "దార"మనుఁ; బాల
కొమనుసులు భావగర్భితములు. 173

క్రోడీకానిజశరకోశంబు, కను బలి
ష్ఠంబు; దుర్బలంబు జరిగెకుటీ. 179

చ॥ మరణము, నిద్ర, రెండును సమంబులు; నిద్రకు రేయివంటిదే
జర, మృతి; కందు షష్టి కడసంజ; శతంబు నిద్రవేళ; యీ
శ్వరుఁ డది, జీవితక్రమము సర్వము దీర్ఘఁగ నేర్పరించె; న
త్తరుణమునందుఁ గోరుదురు తప్పక, తొంగర దాని నందఱున్.

చ॥ అవయవముల్ పరస్పరము నంటుఁగఁ గట్టినరబ్బరట్టిర
జ్జువులు నరాలు; వృద్ధులకు సుత్రిక్కను కొక్కనొవళ్ళు; గానఁ; గ
ట్లవి నదు శాట నొక్కొ, గమనాదులఁ దూలును వారిమేను; ల
య్యవసరమందు దండము సహాయము మూఁడవకాల్, ముసళ్ళకున్.

చ॥ కలువము, రుబ్బుఱోలు, విసుగంప్ప, మడిన్ సనిక ల్లమానుద
స్తలు, "చివు కూడీ చేప" ముదుసళ్ళకు సర్వనిపండ్లు; క్రూరజం
తులకును లోఁతుపాఁత్రులకునున్, వెనుకంజ యుఁ, బిక్కజంకుఁగొం
కొలయనిసాహసాంకము, మ రొక్కబలిష్ఠపుఁగా; లదృష్టమే.

ఉ॥ చాల ముసళ్ళ కంగమున సత్తువ సన్న మగుం గదా; మహో
త్తాలపుఁదాళమందు బలెఁ, బద్వెపకీతత దోఁచు భీష్మనం;
దాలములోన వాని కడియాలము తత్పటుసాల మాటకున్
మూలము, చేవఁబట్టి యగుపోలికయే యనుచుం దలంచెదన్.

—♦ పొలములు, పిట్టలు ♦—

సీ॥ పూవుపిందెల, వేలుపొడవుఁగాయలఁ, గొమ్మ
లొరగి పచ్చగ నున్నమిరెపచేలఁ,
దెల్లపూగొలలలేఁదీగె, లాం డొంటితో
నెనసి, వాసన గొట్టుననుపచేల,
గవ్వగుత్తులవంటిపువ్వుగుత్తులు పూచి,
గమగమ వలచుకొత్తిమిరిచేల,

దుంతలమీఁద మేఁతిగవృక్షముల్ బలె నిల్చి, పొలాలఁ బొల్చునే
ట్రింతలఁ గన్న, నాగరులడెంద మమందముదంబు నొందదే?

సీ॥ అభిజనప్రీతిఁ, దోయములతోఁ గేదార
ములఁ గొయ్యగాలున నిలుచునవియు,
నత్తరాశమునఁ బొత్రాడుకీటముల వె
న్నాడి, చిత్రముగ వేఁటాడునవియు,
గడ్డి గాంపము మేయుగొడ్డగోదలమీఁద,
హేరాళముగ గుఱ్ఱి మెక్కునవియుఁ,
బీలితెక్కలకుప్పకోలలట్టులు, మోప్ప
లెఱకలై, తివ్వన నెగురునవియుఁ,

తే॥ బెంటులను బట్టి తమలోనఁ గంటు పుట్టి,
కలయఁబడి మల్లయుద్ధంబు సలుపునవియు,
నగుచుఁ, బొలముల నానావిహారములను
నేటిగింతలు చూపఱ కింపు సేయు. 190

ఉ॥ పొంగుచుఁ గ్రుంగుచుం, జనెడుపోతుకరళ్ళకు సాటి వచ్చుచుం,
గ్రుంగిలువేళ నీలలను గొట్టెడునట్టులు, గూఁత వెట్టుచున్,
తెం గనుతెక్కలన్ ముడిచి, తివ్వన రువ్వెడుతాలపోలికన్,
ముంగల గడ్డిపిచ్చుకలు ముచ్చటగా నెగురుం బొలంబులన్. 191

తే॥ అడ్డవల పన్ని యెగుబంతి బిడ్డలాడఁ
గని, యిరుల్వల, నిసి, సంజఁ గట్టి, యక్లై
గూఁడు నన, తివ్వ తివ్వన నీడములకు
మొగిచి గఱు, లూరఁబిచ్చుక లెగయుదెంచు. 192

మ॥ చలదీషద్వికచస్వపతుపుటమై, సంభోగసంవాంఛతోఁ
గలచుంచుంకరణస్ఫురన్మణితముం గావించుచుం గ్రుంగుని

కక్కులవిరిసి, బలుమారు పై కొనుచుం జొక్కుచు బోతు (ప్రేమించి), పు
పులకింపన్, మెడ మల్చి దిద్దుకొను లావుల్, ముక్కున వెంటి-
తాన్. 193

తే॥ బురద జలిచీమ లకట! నమ్మరిపురుపు
దతిమి, యొడ తెల్లఁ బా మయి కఱచి పట్టి,
పంచుపుటి వానిపోరాట చటకి ముడిచి;
జాతివైరంబు సృష్టి నైసర్గికంబు. 194

తే॥ పచ్చనాకులగుబురున బక్కసమిసి,
తొగరుజగిపూలచాలున (ద్రోచి), దాగి,
నీవు తిన దొంగతిండి దాసిమ్మకొమ్మ;
జిటపటలు దాఁగువెవ్వ వేది? చినఁటిచిలుక! 195

తే॥ జాదుముక్కున బచ్చనిజామపింజె;
గరుడపచ్చలమెడఁ గెంపుఁగంఠమాల;
చిలుక! నీహొప్పు తీ; పైన జెప్పు చేఁదు;
కడుపునకు దినుం; తునుమకే కసరు లచ్చి. 196

ఆ॥ ఆకులందు నైక్య మందుఱెక్కల నక్కి,
పూలఁ గలసి పోవుముక్కుతోడ,
దళితదాడిమీలతాఫలబీజర
త్నములఁ జిలుకముచ్చు తస్కరించు. 197

ఉ॥ చల్లనిగాలి నూఁగుచిఱుశాఖల హాయిగఁ గూరుచుండి నీ
పిల్లలతల్లితో, పగరుఁబిం దెలుఁ, బండులు; దోరగాయలున్,
సల్లపనంబులం దినుచు, జామల, మామిడిదాపినిమ్మనే
రేళ్ళ, నజీవహింసతఁ జరింతువు; ధన్యుమ వీవు కీరమా! 198

క॥ పోలీసుభటులు, గ్రస్తీ,
నీలలమాటుపుల నెటు గ్రహింం, త్రటు తిర్య
గ్జాలము, ఫ్వనిభేదాదుల
మూలమునం దెలియు భావముఁ, బరస్పరమున్. 199

—• చటకపరామర్శము. •—

మాచావడీదూలములో నొకపిచ్చుక గూఁడు కట్టుకొని తన పెంటితోఁ గలసి కొంతకాలము నివసించెను. ఆఁడుఁబిచ్చుక కొన్నాళ్ళపిమ్మటఁ గనఁబడదయ్యెను. మగది, పెంటి లేక యొంటిగా గూఁట నుండ నొల్లక కొఁబోలు రాత్రులు చావడిగంటచూరు క్రింద నున్నగోడబొద్దుమీఁద విశ్రమింపఁ జొచ్చెను. ఆపిచ్చుక నుద్దేశిం చి యీక్రిందిపద్యములు వ్రాసితిని. పద్యరచన మారంభించి ముగిం చునంతలో నది మృతి నొందెను. ఆదినములలోనే మిత్రులై మహాపండితు లైనబ్రహ్మశ్రీ ఆకుండివ్యాసమూర్తిశాస్త్రిలుగారు పరమపదించిరి. ఆకాలములోనే యొకవిద్యార్థి విషము త్రాగి మృతి నొందెను. ఈకడపటిరెండంశములు, వేఱొకవిషయము గూడ నిం దుఁ జివర సూచింపఁబడినవి. 19-2-16

తే॥ నీలకంఠాభిధానంబు నీవు దాల్చి
యునికి, నీ కయ్యె సతిఁ బాయు టూరఁబిచిక;
యైన నవునో పున స్తదవాప్తి, యనకు;
"చీడ యబ్బుఁ గా, కబ్బదు సిరి" యటంద్రు. 200

ఉ॥ నీవెలఁదిం దమిం గదిసి, నీడమునన్ నిదురించునీకు, మా
చావడిగంటచూరడుగునన్నపుబొద్దునఁ గాలు మోపి, యీ
తావున గారచి స్తరువిధంబునఁ దోఁచుచు, నొంటిఁ గూరుకం
దైవము వ్రాసెనే! యొటులు దాఁకెడ వీదురవస్థఁ? బిచ్చుకా.

జని, కడు శోకముకొంచుఁ, గడసంజకుఁ జావడి సేరి, గోడ బా
ష్పునఁ బల వాంచి, పుత్తు రెయి; దుర్లభ మీావ్రతచర్య ;-
పిచ్చుకా. 207

చ॥ ఎఱకలు మొల్చి, యీఁకతొడు గేర్పడి, కన్నులు విచ్చకందువుల్,
కొఱయొగుబోదలై, వెడలి గూఁ, డిల వ్రాలుడు, నీవు వెంటితోఁ
బఱచుచుఁ దమ్ముఁ గావఁ నిలఁ బై, గఱు లార్చుచు నవ్వి చూ-
త్కృతిం
దెఱచెదునోళ్ల, మే పిడునదృష్టము నీకిఁక లేదె? పిచ్చుకా. 208

ఉ॥ నిన్నను నేఁడుఁ జావడిని నీతలదాఁచుట కాన రాదు ; గో
డ న్నిమరింపఁ గష్ట మని, దాపున వే ఱొకపంచఁ జేరితో ?
మున్నుగఁ బెండ్లివారమును మూసిన, లోఁ జొర రాక, దొడ్డిలో
నున్నయరంటిమోక మొవుటో వరిఁ దూఱితొ మెచ్చి? పిచ్చుకా.

చ॥ పురువులు, గింజ, లేఱుకొని పొట్టను బోసికొనం, బెరంటిలోఁ
దిరుగుచు, మొన్న మీకులము దే మగప్రు, ల్గొకపాదనుమ్మలిం
జరణము గూరుకో విధివశంబున, సంకట మొందుదాని దు
ష్కరటము పట్టె ; నీవె యదిగా వగతుం ; దురదృష్ట! పిచ్చికా.

చ॥ ముదిసి ప్రభూపకారభృతిఁ బొంది సుఖంచునుహృత్తుస్వర్గతిం,
జదువుచు, జవ్వనంబున విసంబు మొసంగినశిష్యుదుర్మృతిం,
బొదలి సమర్త గా, గ్రహము పూనినబంధులబాలసంస్థితిన్,
హృది దురపిల్లె నీనిహతి ; నిర్వృతి నొందితె నీవు! పిచ్చుకా. 211

——• షట్పదాదులు •——

క॥ గళ, మాడల, పీ, పెఱకలు,
నలుప్రు, కడుపు పసువుఁబచ్చన, జిలుం గెలుఁగై,
వెలికిలి, దానిమ్మసుమ
మ్ముల తేనియ, సూదిముక్కుఁబులుఁ గదె యానున్. 212

ఉ॥ వెన్న విశాఖ్య మనం, వితీపవహని మోనశేషానసుందు, వే
గన్నుల వేల్పునాత్మజుని గాంచినవుంబు, బనించి, శత్రులన్
మున్నగ సాహు మాపి, భువిం బూడుఖగంబులు, చిత్రజల్లుగా
నిన్ని తెఱంగులన్ శలభబృందములై విను గప్పె నిక్కలిన్. 219

తే॥ పసుపుంబచ్చని, వెఱ్ఱని, పలువెలుంగు
వన్నె మిడుతలు, లత లల్లుచిన్నె దోంప,
నెగడు చుండంగ నిట్టట్టు, గగన మొప్పె,
నంబరం బౌటం జిత్రితం బైన భాతి. 220

తే॥ చిత్రకార్తికి మెండగు జెనలగండ
కంబు లంబులం దేలెడుకరణి, మిడుత
పిండు బయ లావరించిన, బెస్తవాండ్రు
పోల్కి, వేంటాడం దొడంగెను బుల్కంగుగములు. 221

---

ఆ॥ తోలు మోట దైవదుంతలకే, గటా!
దున్నహంపుంబోటు, దోమకాటు;
మనుజనహ్యా మగునె? మశకనిట్బురబాధం
దొలంచుటకును, మందు తోంప దెండు. 222

క॥ దోమలం దొలంగింపను రే,
యేమందును లేదు తాళవృంతము దక్కన్;
గామను జే నిడుకొని, త
త్స్వామమునకుం జాలనంబు దక్షిణ యిడుండీ. 223

ఆ॥ రామచంద్రపురిని దోమలు ముసరంగ,
వినవకజ్జపైకి వెడలెం దలంపు;
వచ్చెం దలంపులోన, వైద్యుతవ్యజనముల్,
గఱులతటతటలను గబ్బిలములు. 224

ఆ॥ శోణితంబుఁ గ్రోలుపోఁకులబాధ, దం
డకకుఁ బాచి, మునుల నాఁడు ప్రోచు
నయను, మశకబాధఁ దలఁగి రక్షించుత,
రాణ్మహేంద్రిజనుల రాఘవుండు. 231

నలసంవత్సరమార్గశిరశు ౯ ఆదివారమునఁ బుత్రుఁ డీశ్వరప్రసాదముజనించిననాఁడు వ్రాసినపద్యము.

క॥ శిశు వుదయం బగు నాఁటికి,
మశకంబులు మునను నెందు మాగృహమందున్
నిశల; నిఁక మీఁకుఁ దొలఁగెడు
నశుభము లనునట్లు పిదప నవి రూపఱియెన్. 232

క॥ చీమల కడలి, పయోనిధి
లో మొసలం దాఁగి, దైత్యులున్ సుర లెత్తన్,
భూమిఁ గన కభయ, మమృతం,
బామరలోకమున కరిగె, హాయిగ బ్రదుకన్. 233

తే॥ బొఱియయిలు గట్టుకొనుచీమబుద్ధి చూడు;
మొక్కపని నది యిరుఁగొఱల్ చక్కఁబఱుప,
ముక్కునఁ బెకల్చుభూరేణు వొక్కటొకటఁ,
గలుఁగుచుట్టు నీ ర్పార కుండ గట్టుఁ గట్టు. 234

తే॥ గుత్తపనిఁ, దూర్పుకూలీలమొత్త మెట్లు,
మోఁతలో నల్పుదుప రాకపోకడలను,
జీను లెర కంటఁ బడ నేని, చిటిక దానిఁ
గలుఁగునకుఁ జేర్చ, నట్టులు కష్టపడును. 235

తే॥ తలబరువుతోడ నెగఁబ్రాఁకుతఱి, నొకప్డు
తాను బడు, మ ఱొకప్పుడు తనదుబరువు;

చీమ దాన నిరుత్సాహ మేమి గనదు;
నిండుపూనికఁ దనపని నిర్వహించు. 236

ఉ॥ కంబములోని యొక్క చిఱుకన్నము దూరిని, బారు దీర్చి వే
గంబునఁ జీరుముక్కలను గ్రాలెడుముక్కలఁ గొన్ని చీమ వే
గం బయికిన్, సదస్యమని కాసులకుం జను గస్తిపాలువాం
డ్రుం బలెఁ, గొన్ని వాని గని, సాకలకై దిగుటల్, సగించె సన్.

తే॥ రేయి గూడను పగలు చరించినట్లు
సంచరించెదు, పొట్టకో, జాతిగుణమొ?
జంతువుల కన్నిటికి నాల్గు సహజ ముద్రలు;
కన్నెపుడు మూయవా నీవు? చిన్నిచీమ. 238

ఆ॥ కడమజీవు లొకఁ డొకానొకటిని జంపి,
భక్షణంబు సేయుఁ బ్రాయికముగ;
నదియు నిదియు ననక, యన్నింటిశేషముల,
గీము పావనముగఁ, జీమ దినును. 239

ఉ॥ గోడలమీఁద బల్లులును, గొంగిపురుగులు, సింక నెన్నియో
కూడను బ్రాఁకు; విద్దె యది గొప్పది గా; దిటు పట్టు పట్టునో,
చూడఁగ వింత యయ్యెడును; నంతయు జాఱక పాకెకాడెడున్,
నీడలు గాన నానిలువునిద్దపుటద్దముపైఁ బికీలికల్. 240

తే॥ కలసి రెం, డొక్కగతి దివ్వెకడను బ్రాఁకు
కండచీమలఁ గన, వింత గలిగె నాకు,
"వేర్పడనియనుసరణము వీని కెట్లు
గూడె" నని; చూడ, నం దొండు నీడ యయ్యె. 241

ఉ॥ ఈఁగను గండచీమ, మడియించి భుజింపఁ దలంచి పట్టఁగా,
లోఁగక మక్షి, యట్టు లిటులుం బలిమిం బెనఁగాడ సాగుటన్.

లాఁగికు లాగ లేమి గని, లాఁత్రిపిపీలిక తోడు నచ్చి, వే
వేగ కలుంగు చేర్చి చనె; వింతర చీమలదైకమత్యముల్. 242

ఆ॥ జీవు లెన్నో కలవు సృష్టిలోపల; నైనఁ
బగలు రేయి యనక, పాలిలుమాల,
కలపు, విధివిరామములు లేక, పసఁ బాటు,
జంతుయుగము, చీమ సాటెపురుగు. 243

సీ॥ దార కొల్వు సాలించి యరుగుచోఁ, దమతమ
గదులలోపలనుండి బెదరిబెదరి
తొంగి చూచుచు, బైలఁ దోఁతెంచునన్నసే
వకులట్టు, లాకాశభాగమునను
గ్రహరాజు కుంకుచోఁ గన వచ్చుచున్నవి,
మినుకు మినుకు మటంచు మెల్లమెల్ల
నొక్కఁడొక్కఁడు గాఁగఁ జుక్కలు; నీ వింకఁ
బమఁగు పేకలు సరి పఱచుకొనుచు,

తే॥ గదులు దీర్చి, సోమారివి గాక మగ్గ
మల్లుచున్నావు; నీకు నియంత యెవఁడో?
శిక్షకుం డెవ్వఁడో? యింతజిలుఁగుఁబోఁగు
సంజచీఁకటి నెటు గాంతో? సాలెపురుగ! 244

చ॥ పలువెలిముండ్లతో డివిటపంబులు, నంతట సాలెగూండ్లు పె
ల్లలమఁగఁ, గాల్వయోర నడయంబునఁ దోఁచెను దెల్లతుమ్మరు
ప్పలు, చలి మున్గి, నిక్కి నిడుపాటినరలీ, మెయి భూతిపూఁతతోఁ,
జలువమునుంగునం జపము సల్పెడుభూసురవృద్ధులో యనన్. 245

చ॥ ఒకచిఱుఁదుప్పనుండి మఱియొక్కటి, కిట్టులు తెంపు లేక యు
ల్లికగొని, కాల్వకట్టఁ గొఱలెన్ మిహికార్ద్రపుసాలెప, ట్లటన్

మకరము దాఁటి కుంభమగును మాఘపుస్నానము లాడి, వార్చి, యు
గ్రికులజు, లంగవస్త్రములు రానిగ నాఱఁగఁ గట్టి పోయెదన్.

కం॥ నాలుగునాలుగుగా, నిరు
మైలం, గయినన్న వేళ్ళ మాదిరి నుండుం
గాళులు చెలఁదికి; నైనం
గాళులకున్ నాలుగేసి కనఁబడుఁ గనుపుల్.

ఉ॥ పన్నినవాగురం బగిలి, ప్రాణముతో నవలం బడంగ నె
న్నెన్నొవిధాలఁ బన్నికొనుచుఁగను మిర్రింగను, విచ్చునోటితోఁ,
గ్రిన్నన దాయ వచ్చి, యుదుకాల్చగనోక్కొనపూడిపోఁ, దా
ని న్నఱుమాంసలూతఁ గెన, నెమ్మది యూఁగెను పెన్మకోలికన్.

తే॥ ఉఱికి పైఁ, బల నాలెత్తు క్రొవ్వుకసి పట్టి,
యీఁగ నీడ్చుక పోవుచో, నెగసి వచ్చి
కనుఁడు, దద్దాసిఁ గొనిపోయెఁ గాళ్ళ నిఱికి;
జవి జీవికి నన్నియు సృష్టిలోన.

ఆ॥ సూర్యరశ్మి మెఱయుసూక్ష్మతంతుల నల్లి
వలను, దాన నిలుచువెలఁదిఁ జూడఁ,
చిత్రవిశ్వ మిది గుణత్రయి నిర్మించి,
యందు వెలయునీశుఁ జూత్మఁ దోఁచు.

ఉ॥ దీపము తేఁగనే తను వరించు నటం చని, చిందుభీతిచే
వే పవ పెత్తి మత్కుణము, వెంకి యతం డటు మేను వాల్చఁగా
నే, నఱ తెంచి, మై గఱచి, నెత్తురు పీలిచి, బిస్సుఁ; బ్రాణపుం
దీపియ కాని, సీ! బ్రిదుకుదెవ్వ నెఱుంగదు మద్రవ్వవర్తనుల్.

చ॥ మెలపున, నింటివా గ్నిదుర మేల్కొన కుండఁగ గ్రొచ్చి గోడలం,
గలుములు దోఁచి పాఱుదురు కన్నపుదొంగలు రాత్రులందు; న

ల్లులు, శయనాసనాదులకలుంగులలోనవె డాఁగి, నిద్ర మే
ల్కొలిపియె వింతతస్కరతఁ గొల్లలు నోడళ్లులనల్ల రేవగల్. 252

చ॥ చులకనఁ బ్రాఁకెడున్, మెఱుఁగుసున్నముఁ జేసినమిద్దెక్రేఁగడన్,
వెలికిలి, పెద్దబల్లు లతివేగమునం, గబళింపఁ బుర్వులన్;
దలఁప మహాద్భుతం; బెటులు తచ్చరణంబులు పట్టు పట్టునో
యిలఁ బడ కుండ? నీశ్వరునికృత్యము లెన్న, మహేంద్రజాలముల్.

—• చెట్లు •—

ఉ॥ వేసఁగఁ దూఁగుటూయెలల వేసవ నూఁగుచు, గాలిపాటలా
బాడుశకుంతదంపతులపచ్చనిమెచ్చులదొంతిసౌధముల్,
నీడ నొసంగి, యధ్వగవనీపకతిర్యగనీక మొప్పఁ గా
పాడువిధాతృధర్మపురుషార్థకశాలలు, వృద్ధసాలముల్. 254

శా॥ గొం తెండన్ శరదాతపంబునను నప్పల్ వొక్కఁగా, వంతెనన్
శాంతిన్ గాల్నడ దాఁటి గౌతమిని, జేరన్ రాఁగఁ గొవ్వూరు, త
త్ప్రాంతంబందు వసించి సల్పితివి తాపం బాఱ నాతిథ్యముం;
జింతాహంత్రికి నీకుఁ బెట్టఁ దగునే చింతాభిధం? బింత్రిణీ. 255

క॥ యాతాయాతజనులకీ
తాతపవర్షార్తిఁ బాపునధ్వాగమ! యీ
యాతిథ్యఫలము నీదో,
భూతదయ న్నిన్నుఁ బెనుచుపుణ్యాత్మునిదో? 256

చ॥ తెరపయిఁ దోలుబొమ్మలను, దీపపువెల్గున సూత్రధారి రా
తిరితఱి నార్చు వేడ్కఁ, బఱతెంచి జనమ్ములు గాంత్రు వింతగాఁ;
గరువలి, చెట్లనీడలఁ బగల్ రవిదీప్తిని గారుడాశ్మభా
సురతృణసాంద్రనందనవసుంధర నార్చుహొయల్, గనర్ గదా!

బోధనాభ్యసనకళాశాలలో నే నుపాధ్యాయుఁడఁగా నున్న దినముల నొకప్పుడు దేహ మనారోగ్యముగా నుండి, సెల వడుగఁగా, నప్పటి వైస్‌ప్రిన్సిప లంగీకరింపనందున నతికష్టముగఁ గాలేజి కరిగి, లైబ్రరీమేడహాలులోని దక్షిణపుగిటికీయొక్క గ్రమముతో నిలువఁబడి యధికారినిర్దయత్వమును దలంచుచు నా కెదురుగా నుండి కన్నులకుఁ జల్లఁదన మిచ్చునరుణశిరీషచ్ఛాయాన్వితమును జూచి విరచించితిని.

## చంపకమాలిక.

అరుణశిరీష! నీబటువుపొదల్పనుండలితాకుఁ గొంపవున్
సురఁటులఁ, జల్లగాలి మొయిఁ జోఁకఁగ వీచుచుఁ, గన్నుదోయిఁ గ్రొ
న్మరకతకాంతిపూరము నుదారతఁ జిల్కుచు, నన్ను గ్రంథమం
దిరమున సౌధపాళి వడఁ దేర్చితి వున్న; మహోపకారకా!
పగలును నున్నతస్థితి మన స్సవలం బగుఁ బ్రాయికంబుగం;
దరువర! యెప్డు నీదుసుమన స్సతిపేశల; మానసంతతుల్
సిరులను నిట్లు వర్ధిలుచు, నీడను దర్శనమాత్రఁ దీప్తి నన్
దిరిగెదు నాకు; నీజనకుఁడీనదయాంశుత నిన్నుఁ గొందెనో;
“నరులకు భావ వేఱు పడినం గనుపట్టదు సానుభూతి” యం
దురు; తరు వీవు; నే నరుఁడ; దుస్సహబాధ మదీయ, మేగతిం
గరఁచెనొ నీమనం? బటిసగంబుగఁ బై, లెయిఱు, పున్నకమ్ముకే
సరములనీవిరుల్, పసరుఁజాయలపల్లవపాళిఁ దోఁచి, నా
యెరిసెడుకన్నుదోయి ఘటియించెదుఁ జల్లఁదనంబు; నంతమ్మైఁ
దరుణము వేచి, కోకిలముఁ, దటుకపక్షియుఁ, గీరశారికల్,
సరసతఁ బల్కరించు, మది చల్లగఁ, బ్రత్సహవాసు లౌట నన్;
దిరిసెన! నీదుసచ్చరిత దిద్దును గా కుపకారశూన్యులన్. 258

మ॥ అకటా! నేరేడులార! మీదెసకు నే నత్యంతముం గుందెదన్;
నికటంబుం జలియించియాముసిం శిగమికిన్ మీపాళ్లు లే; వోఁ గదా;
యకృతజ్ఞుల్, ఫలదానశీలురను మి, మ్మశ్మామలం గొట్టిరే!
సుకృతుల్, కష్టముపాలు గావుటకె యీ క్షోణీస్థలిం బుట్టుటల్.

దీనికే సంస్కృతము.

శ్లో॥ జంబూద్రుమాః! హతదశాం ప్రతి వో౽తి దూయే;
న ప్రేక్ష్యతే నికటముష్టిషు కష్ట మీదృక్;
నిఘ్నంతి వః ఖలజనాః ఫలదాన్ శిలాద్యైః;
లోకే సతాం భవతి జన్మ బత శ్రమాయ.

పై తెలుఁగుపద్యమునకు, రాజమహేంద్రపురమున యూనియన్ హైస్కూలుసంస్కృతపండితులాకుంఠి వ్యాసమూర్తిశాస్త్రులుగారు

శ్లో॥ జంబూభూమిరుహాః! బతాహ మధికం శోచామి వో దుర్దశామ్
కింపాకా నికటస్థితా న పథ తే యుష్మాక మీదృగ్దశాః
అశ్మాద్యైః ఫలదాయినః కిమనఘా నఘ్నన్ కృతఘ్నా ను వో;
దుఃఖాయైవ పరోపకారనిరతా, జన్మాప్నువంతి క్షితౌ.

ఆర్ట్సుకాలేజీలో వర్నాక్యులర్ సూపరింటెండెంటు వావిలాల వాసుదేవశాస్త్రులుగారు.

శ్లో॥ జంబూవృక్షాః, బత భవదవస్థా న్నిరీక్ష్యాతి దూయే;
యేనాశ్మాద్యై రకృతమతయో ఘ్నంతి వో దానశీలాన్;
యుష్మద్దైన్యం నహి నికటజే దృశ్యతే ముష్టిమండే;
ప్రాదుర్భావో భువి సుకృతినాం క్లేశ మేవానుభోక్తుమ్.

పై కాలేజీ సంస్కృతపండితులు కస్తూరి శివశంకరశాస్త్రులుగారు.

శ్లో॥ అమృతరసశాలి జంబూతరవః కుజనావలీకృతాం బాధా
మనుభవత భవతి మహతాం పరబాధా నాస్తి జగతి నింబానాం.

మ॥ అనుఁగా! యీశ్వర! రామచంద్రపురవాసా! రామచంద్రస్థ
ధ్యను జంబూతతి, కేలివలం బొసఁగ మొనం, దత్ఫలంబుల్, ఘనా
ఘనయోగంబున సంభవించుకతనం గాఁ బోలు నీపోల్కి నాఁ,
దనరారెన్ వారిసీలగోపకమిళింద ప్రాకరమ్యాకృతిన్. 261

మ. సరసాగ్రేసర! రామచంద్రపురిజస్థాయి రామలింగేశ్వరా!
పురబాహ్యంబున గున్న నేరెడులు, నీపోల్కిన్ సదా నమ్మినన్
బరమాతిథ్యము సత్ఫలాదుల నిడుం బాంథాళికిం జేరరా;
గురులో, శిష్యులొ, నీకు నవ్వి? తెలియంగోరెన్ మనంబుం దాసటే.

మ॥ ధన మెంతున్నను, దాతలైనను, జమీందారుల్ మహోద్యోగులుఁ,
జనసామాన్యులలోని దాతలకు నెంచన్ సాటి రారే కదా;
పనసల్ మావులు, నారికేళములు, జేనా పండ్లతో బాలలోఁ
సనుఁగా; యున్నిఁ ఫలించు నేరెడులతీరా? రామలింగేశ్వరా! 263

తే॥ ధూమనౌకావిహారసుతూహలమునఁ, (22_2_1918)
దారణాబ్ధంబునందు, గోదావరిపయి
నబుడు సల్పిననాకృతిచందకమునఁ,
చిన్న లీకు; కాలెజిసీమచింతలార! 264

తే॥ ఇనుపపట్టాలయీవెలుఁ గిప్పుడు గాని,
సొగసుగాఁ గత్తిరించినసిగల, నాఁడు,
బారు దీరుకాలకులట్లు, మీరు రక్ష
సేయరే కాలెజికి? సీమచింతలార! 265

తే॥ బోధనాభ్యాసనవుబడి, యుం డొకప్పు
డిందు నిజముకట, మీమైత్రి హెచ్చె నాకు;
నెంతబలఁగంబు మీకు నాఁ; డిప్పు డిదేమి,
యింత క్షీణించితిరి? సీమచింతలార! 266

తే॥ ప్రాంతకాలేజనివృత్తి కానవాలు గాఁగ,
నీడ, నొక్కొక్కఁ బాడాడ, నీడజముల,
కజముల, కజస్రి మెట్టఁ బ్రిజ, కతిథిపూజ
సేయు, మిగిలితినే! సీమచింతలార! 267

తే॥ ఉత్కటం బగుబంధువియోగదుఃఖ
మొగడ, జడ లూని, కొందఱు యోగు లగుట
కలను; మీా రట్టుకాదు గా; తలలు పెరిఁగి,
యింతగా మాఱితిరి; సీమచింతలార! 268

తే॥ మట్టు లున్నవి; నేరేడుమ్రాఁకు లున్న;
వెట్టదిరిసెము లున్నవి; యెన్ని యున్నఁ,
గన్ను మీామీఁదఁ బడెఁ దొల్తఁ; గాన, నాకు
స్నేహ మెచ్చె మీాపై; సీమచింతలార! 269

తే॥ శ్రిమికిఁ, గాలేజవెనుకవసారగదని,
లేదు పంకా; య టన్నవెల్తిని దొలంచి,
నాకు వనవీవనలు వీచుమీాకు, నే ని
తాంతముఁ గృతజ్ఞుఁడను; సీమచింతలార!

తే॥ ఓ. జె. కూల్డ్రియిదయను, గాలేజి కేను
వచ్చి, వత్సరత్రయము కా వచ్చె; నైన,
ముచ్చటింప మున్నెన్నఁ డి; ట్లిచ్చ యున్న,
సిద్ధి విధిహ స్తగత; సీమచింతలార! 271

తే॥ రాజకీయకళాశాల, రాజమహేంద్రి
మందుఁ దెలుఁగొజ్జ వసురాయఁ డష్టకంబుఁ
గాను కిడెఁ గొంకి; సాతమీాకంకణార్ద్రి
శిఖరవీజనములు! సీమచింతతరులు! 172

## —• దాడిమము •—

క॥ అంతస్స్తులుగాఁ జుట్టు స
మాంతరపుల నాకుఁగొమ్మ లడరెడు దాడి
మెంతో సుందరము, మఱి
ద్రాక్షాంతం బగుచోఁ, బనస్పతరుపులకించెన్. 273

క॥ పూచినదాడిమ యువిగోఁ;
జూచియె తీఱవలె దానిసొగసు; నెఱ్ఱసిప్పా,
లేచినచివటలకెంపుగు,
రాచిక్కనిపనసుకొమ్మ, లంబడప్పెంపెన్. 274

క॥ పరిపాకఫలితదాడిమ
తరుఫలబీజాళి, సుస్మితప్రియబింబా
ధరవీటీరసరుచిభా
సురరదపంక్తిని విరించి చూచి సృజించెన్. 275

ఆ॥ పచ్చనాకు నూఱి, పారాణి పెట్టినఁ,
గెంపుఁజాయ పట్టి, యింపుఁ గూర్చుఁ;
బచ్చలోనఁ గెంపుఁ బ్రకృతి యేగతి దాఁచె?
సృష్టి నెఱిఁగి యెవఁడు చెప్పఁ గలఁడు? 276

క॥ కలభమునకు నిరు గెలఁకుల,
సెలవుల మొలకెత్తులేఁతదంతములుం
బలెఁ, గొబ్బరగున్నకుమ
ట్టలసందునఁ దోఁచె నిరుగడం దొలుబాళల్. 277

ఆ॥ పచ్చిదోరపండ్లఁ, బ్రథమ మాకుంబచ్చ,
యిరుదెఱంగు లైనయీఁతచెట్లు;
నడిమి దెఱుపు, కడది నలుపు చిట్టెని; బెట్టఁ,
బసుపుఁబచ్చ, యెఱుపు; బళిర! సృష్టి. 278

క॥ చిట్టీఁతకు నేరేటికిఁ
జుట్టఱిక మదేమొ, వానిసూనులమేనుల్,
పుట్టినపు డాకుఁబచ్చన,
నట్టీడున నెఱుపు, ముదిమి నలు, పెట సృష్టిన్. 279

ఉ॥ పాలును నీళ్ళు మిశ్రమగు పాత్రను, నీరముఁ ద్రోసి, క్షీరముం
గ్రోలుమరాళముం, గవివరుల్ కడు మెత్తురు; కళ్మలంపుఁగీ
లాలమునం గ్రహించి విమలంబును, రుచ్యఫలమ్ము సైశ్వ మీఁ
జాలునరంటికంటె నది శ్లాఘ్యమె? యారా! స్వనామపక్షతల్.

క॥ అళికిం బిల్లలు, పేఁపు వి
దళించుకొని వెలలు, టద్భుతం బని కనుచో,
గెల, నేఁడు మాపెరంటిక
దళికిం, బ్రాదుర్భవించెఁ దత్సామ్యమునన్. 281

క॥ సంఊపునఁ భృగుకులుఁడు, గురూ
దరమున్ మాంధాతృకచులు, స్తంభము నరకే
సరి వోలె, నరఁటిబోదియ
పొరలం బెకలించి, నడుమఁ బూ వుదయించెన్. 282

క॥ ఏనుఁగు, పుష్కరంబునఁ
బూనినశోణారవిందముకుళము తలఁ పో,
సీనినబొంతనఁటికిఁ దోం
డానం గొన వ్రేలుపెనునవం గానంగన్. 283

తే॥ పుచ్చి యె దాఋ వల మైనబోదెపొరలు,
నీడ దేరెడునరఁటితుండెమును, గొలువు
దిండు నేయరె నైదాఘదినములందుఁ,
జలువగును దోడు దానఁ గోమలత యున్న? 284

ఉ॥ చక్కని కాంతి, సౌరభము, సాంద్రమరందము, సౌకుమార్య, మిం
పొక్కఁ డొకండె చాలుఁ గవియుల్లము నాఁచికొనంగ; నన్నియుం
దక్కువ లేక యున్ననిను దారిని గాంచి, గ్రహింప కేగ, నా
కక్కట! శక్యమౌనె? విజితాఖిలలోకమ! పుండరీకమా! 290

సీ॥ కచ్చితం బగునంచగఱులకుంచియచాయఁ
గచ్చుదొంతర యెంతొ మెచ్చు సేయఁ,
గొనల ముత్తెములు సుటినగుమ్మతీలకు
చ్చులు వోలె, నకరుపుల్ సొంపు మీఱ,
విడికెంపుటాలు దాపినకుందనపుగుంద్ర
దుద్దుమూడరి, మిద్దె ముద్దు గులుకఁ,
బసిఁడిపిస ళ్లంటుపట్టెడకడలక్క
తెలివిఁ; బుష్పాడిలోనఁ దేఁటి దనర,

తే॥ నఖిలమానోజ్ఞకముల కేకాస్పదంబ
వైననిన్ గాంచునపుడు, మే లైనపండ్ల
లోన మే లేర్చికొనఁ బూనువానిపోల్కిఁ,
బుండరీకమ! చపల మౌ చుండెఁ జూపు. 291

ఉ॥ కమ్మమిటార్లతోడఁ జెలికారము హెచ్చి, కొలంకులచ్చి, బల్
తుమ్మెదనాదు గ్రమ్ముకొనఁ, దూం డ్లనునేకులతోడఁ దంతువ
ర్గ మ్మనుసన్ననూ ల్వడికి, కాఁడకదుళ్ళను బోసె నాఁగ, నం
దమ్ముగఁ గాన వచ్చె వెలిదామరమొగ్గలు, పొద్దుగ్రుంకఁగన్.

చ॥ కలకల నవ్వుకల్కి తెలిగన్నులడాలు హసింపఁ జాలు మే
ల్వెలివిరిదమ్మిపూలు కనువిం దగుపల్లముకుత్తిచెర్వునం,
గలగొడుగాకులం జిసుముకాఁడల, బంగరుఁబిచ్చుకల్ నిలన్,
"మొలచెనొ పైఁడిదామరలు మొగ్గలతో" నని, తోఁచెఁ
బ్రొద్దుటన్. 293

తే॥ విరహాశరనిధి నీఁదెడుతనుఁడును వ
ధించువెర వాత్మ నెంచి, నిర్మించుకొన్న
సూనధన్వునిబంగారుదోనె గాని,
కాదు కాఁ దిది కేతకీగర్భదళము. 294

తే॥ పసిఁడిగేదఁగితీయనిపరిమళమున,
జలరుహంబులచల్లనిసౌరభమున,
ఘ్రాణతర్పణ మొనరించు గంధవహుఁడు,
సంధ్యలను దెర్వ్యోకడఁ సూడుఁజనుల కొఱకు. 295

ఆ॥ పచ్చపట్టుకాంతి పైఁ, జెలిపట్టురా
లడుగుకెలన, నీరె లంచుచుట్టు,
సడును నా, మొప్పునలినిపెన్నటువాక,
కొలఁకులుచ్చివిచ్చుగొఱుగు, ఘ్రీవము. 296

తే॥ రవలు, ముత్తియములు, పాదరసము, కప్పు
రంపుబెత్తులు, సరిగఁ బలంఘ వచ్చుఁ,
గొలన వేర్వేఱుతావరాకులను, వివిధ
గతులఁ దులకించునుదబిందువితతిఁ గనఁగ. 297

తే॥ స్థానభేదంబుచే నవస్థావిశేష,
మావహిల్లుచు నుండును జీవులకును;
జెఱువుకలువాకుపై వానచినుకులకును,
దామరాకునఁ బడువానితళుకు గలదె? 298

తే॥ ఎఱ్ఱగలువలచేతను నింపు మీఱు
చెఱువునకుఁ, దెల్లగలువలకొఱఁత దీర్చె,
నీళులను దేలునాకులఁ గాళ్లు లూని,
నిశ్చలధ్యానపరత నుండినబకములు. 299

— గోదావరి —

తే॥ జనుల దేహాత్మమాలిన్య, మనుదినంబు
నీవు లోఁగొనుదానవు గావె? జనని!
గౌతమీ! దానికతమునఁ గాఁ దలంతు,
నఱుగునను దావకీనతోయముల కసలు. 300

క॥ దిరిసెనపుంబువు భక్తిని
దరిసించెద నందుకొనుము దయ; గౌతమి! యా
తర మగునీమూర్తికి నిది,
హారు వగుకర్ణావతంస మయ్యెడుఁ దల్లీ! 301

క॥ మిన్నాగడపలు దాలిచి,
కన్నుల కిం పగుటఁ జూచి కాంబోలు, నటుల్
మున్నును జెన్నారె ననన్,
నన్నిసుకను నీటియలలజాడలు పొలిచెన్. 302

క॥ తల్లి తలరుద్ద రాఁ, బసి
పిల్లలు పరు వెత్తునట్లు, ఫేనముతో నీ
కల్లోలము లేతేరఁగఁ,
దల్లడపడుమమ్ముఁ బట్టి తల యుంటుదు గా. 303

సీ॥ ఘూతనానాతరువ్రాత మాకస్మికా
యాతమై వాత ము న్ననుచు వీచఁ,
జాలఁగా, నావ కల్లోలినీవీచికా
మాలికాపాళి నుయ్యాల లూఁగ,
క్షేపణీక్షిప్రవిక్షేపణోత్క్షిప్తవా
తూలశీతాంబువుల్ దొప్పదోఁపఁ,
"తీరము జేర, దేదారి? గోదావరీ
వారి లోఁ" తని, నావవారు బెగడ,

తే॥ గుండె జల్లు మనంగ, గగ్గోలు పడుచు,
నొడలు వడవడ వడఁకంగ, నడలు పొడమి,
మేటిగండంబుఁ దాఁగి యామేడఁ గడచి,
దరికిఁ జేరితి మిరులలో దైవకృపను. 304

చ॥ మగనికి దీనికిన్ నవసమాగమవేళ యటంచు, దైవము
న్నగ తెర విచ్చె భూమిసతి నాఁ, గనుపించుచు బోచు, నొక్కన
న్నిగనిగలాడుచేలు, తనసీమలఁ గుత్తుకబంటి మున్గునై
నగపడఁగా, స్వభావనసభముఁ గూడు గౌతమి పొంగె రమ్యమై.

క॥ తల్లిని నెన్నాళ్ళకొ కను
పిల్లలయుల్లములు పొంగెఁ బెల్లుగఁ బొంగెన్
దల్లియొడఁ దాఁక నూతులు,
కల్లోలవతీమతల్లి గౌతమి రాకన్. 305

గౌతమీమహాజలమహిమానువర్ణనము.

(చంపకమాలిక 304 పాదములు)

ఎలమి ఖరాబ్దభాద్రపదకృష్ణచతుర్దశినాఁడు, § పద్మినీ
కలనపుఁడప్పుడై యపరకాంతపదంబున వ్రాలుభానున
గ్గల మగురాగముం, బొడుచు గౌతమి యన్ఘనదర్పణంబులోఁ
బలఁ దిలకించుచుండ్, వఱదవైఖరి నారయఁ, గోటిలింగముల్*
గలదిశ నష్టగట్టుదనుకం జని, క్రమ్మఱి వచ్చుచుండ, రా
చిలుకగుఱ్ఱాల నెక్కి, తన చెల్వయుఁ దాను, నిజాధికారమున్

§ నేను వఱదను జూడఁబోయిన దినము చతుర్దశి; వఱద యేకాదశినాఁడే యారంభమయినది.

* రాజమహేంద్రవరమున సుప్రసిద్ధమగు కోటిలింగక్షేత్రము, స్నానముకొఱకు నొకపేటయు నున్నవి. దానిరక్షణ కక్కడ నొక యుష్టగట్టువేసియున్నారు. అగట్టు తెగినదేమోయని చూడఁబోయితిని.

సలుపఁగ బైలుదేఱె నొకొ చక్కెరవిల్తుఁ డనంగ, నత్తఱిన్
బాలఁబ్రియుఁదానుహ్యూమ్మెటువిభుఁడు,†సరూపములన్,సమోన్నతం
బులు, నగునుత్తమాశ్వముల ముచ్చట నెక్కి యెదు ర్పడఁగ, నేఁ
తెలఁగి సలా మొనర్పఁ, దమస్నేహపువెల్లికి నుద్ది యౌచు రం
జిలుష్ఫురిఁజూపి, నన్ను “మునిషీ!♦ నదిపై నొక చిన్నకబ్బముఙ్
సలుపు” మటంచు, లేనగవుఁజంద్రిక నక్షిచకోరముల్ ప్రకా
శిల, దయ నాన తిచ్చుటయుఁ, జిత్త మటంచును వీడుకొంటి, నీ
బలమున; నో పరాత్పర! కృపామతివై ప్రభుచిత్తమున్, రస
జ్ఞులహృదయంబు లేక మఱి, క్రొత్తగ హార్షపువెల్లు వీసభా
స్థలిఁ దలమున్కగాఁ బఱవ, ధారునఁ జారువచస్సుధోరుధా
రలు గురియింపవయ్య రుచిరంబుగ సేవకు జిహ్వనుండి; యో
కలుషవిదూర! నీదుపదకంజములఙ్ హృదిఁ బాదుకొల్పితిన్;
దొలుత నొకప్పు డే సఖులతోడను, దారణవత్సరంబునన్
దొలకరివేళఁ, గట్ట కెగఁదొట్టినగాతమిసొంపు ధూమపుం
గలమునఁ బోయి చూచి, యటఁ గల్గువిశేషము లేర్చి తెచ్చి కా
శిలమునఁ గూర్చినాఁడ నొకచంపకమాలిక; నాఁటి కద్దియే
బలితపుఁబొం గటంచుఁ దలఁపంబడెఁ గాని, యిటీవలన్ గటా!
యిలు సొర వచ్చె నాన* పదునెన్మిదివందలయెన్బదాఱులో;
నలధవశేశ్వరంబుకడ నప్పుడె కా యెగిరెం గళింగ; య
క్కొలఁదికి మించ దెన్నఁ డనుకొంచును, మాఱిచి రింజనేర్లు లా.
కులు మొద లౌపనుల్ తదనుకూలముగా; నతివృష్టిఁజేసి యా

† ఈయన మా రాజమహేంద్రవరములో సబుకలెక్టరుదొరవారు.

♦ హ్యూమ్మెట్టుదొరగారు కొంచెముకాలము నాయొద్దఁ దెలుఁగు నేర్చికొన్నందున నన్ను మునిషీయని పిలుతురు. ఈయన దొరలలో సుందరుఁడు,

* “ఆన” ఇది క్రీస్తుశకమునకు గుఱుతు.

కొలఁదివి యైనయెండమునకుఁ గుడ్డల నే మును నామె! కర్కాటా!
"తలఁగునె యెన్నఁడైన నపరాధదైన్యము! పాయునె దేహతాపముల్!
కలకల నవ్వునే వసుధ! కానల నాకునె నెమ్మిగుంపు! శా
ద్వలముల మేయునే పసులు! పంటలు పండునె!" యంచునుండ, బెం
గలు దొలఁగఁ, జళుక్కు మని కన్నుఁగిన నిగ్మఱు మిట్లుగొల్పుచుం
చలలుఁ, గులాచలప్రతిమసౌధగృహప్రతినాదకారిగ
ర్జలు, ధరణీపజఃపటతిరస్కృతభూతకదంబకాంబకా
నిలములు, జాతకప్రథమనిఃశ్వసితవిస్ఫృష్టసీరధా
రలుఁ, బరిషిక్తశోషితధరాప్రమదోచ్ఛ్వసితాభసౌరభం
బులు, వరుసం బ్రభూతమయి, భూమిపయిం జిఱుసూదిలేఁదృణం
బులవలె, బ్రోహులం జివురుమొలకలట్టుల్, గలిగించె జీవితా
శలు మరలన్ సమస్తమనుజంతువ్యాసంతరసీమలందు; ని
ష్ప్రాలువున నైంద్రచాపము బూని, శిఖండియఖండతాండవం
బలర, నవీననీలజలదార్యుపుఁ డొక్కమొగిన్ మహాశరా
వళిఁ గురియింపఁ, జావకయ వ్రాలువివృద్ధతపస్తభీష్మమై
నొలికెడురక్తబిందువులొనో యన, నెట్టిగ శక్రగోపముల్
నలుఁగడఁ దోఁచె; నాఘనుఁ డనంతర మాశుబిడప్పి దీర్ఘఁగా
నలవున గాఢముక్తభయదాశవితిగ్మశిలీముఖంబుచే
నిలను బెట్టిల్లునం బసల నేయుచు, దోన, గుబెల్లునన్ శసా
తలముననుండి పెల్లుబికి, ధాత్రినెసంగినగంగఘాంగు నాఁ,
గొలఁతకు, నిర్ధరద్దరులు గోసులు మూఁడును మోసి, తాడియూ
డలఁ గల మొప్పుటాకుకొనఁ దాఁకనుదారప్రఁబోఁతగట్లయుం
చుల, నలలందుకోఁ బెడఁగెఁ, జోద్యము గౌతమి; యట్లెకాక, యిం
గలపుమకెండచే, మిగులఁ గాలుపెనంబును బోలు నేలపై,
నలమక, చుళ్ళిచుళ్ళి మని యప్పుడె యింకినవాననీళ్ళచేఁ

గలుగునె యింతయేని? తెప్పరఁ గానరఁ జెప్పరు దీనిసాటి మున్;
బళిబళి! "వానలేని పెనువ" జ్ఞనుపామెత సత్య మయ్యె: హా!
తెలియునె దైవకృత్యము! లతీంద్రియదివ్యచరిత్రుఁ డాతఁ; డు
యిలపయి హేతు వాతని కహేతు, వహేతువు హేతు వయ్యెడున్;
వెలుపలికారణంబు లోనవేయును దత్ప్రకృతిచ్ఛ మార్చునే!
తులపయి బెండిబంగరులఁ దూఁగెడివాఁడు, తదిచ్ఛ లోపలం
దలఁచినయంతమాత్రమునఁ, ద్రాగను గంటయు లేక పోయెడున్;
గలియును గంట ద్రాగుకొని కాలము పుచ్చెడివాఁడు, బంగరుం
గొలుసులతూఁగుటూయెలల, గోమలితో సతమున్ సుఖించెడున్;
వెలయఁగ నిట్టిమాతనిష్ప్రవీణతచేతనె, "బంగరు లోహ, లో
డలు నగు బం"; ప్లిటుల్ చిరతటస్థమునాస్త్రపధర్మశైలి, సుప్ర
వృ_లతనుదర్శనీయ యగుగోతమి యన్నకుమారికన్, మలల్,
కలిగినయంతలో, నెమిలికన్నులు, మారెడుఁబండు, లేమమఁ
డులుఁ, బులిగోళ్లుఁ, గస్తురి, పునుం, గగలుం, గొజుకొమ్ము, లభ్రక
మ్ములు, గుడుబెండపూసలును, బుప్పొలగుప్తలు, దాంపత్రిబెత్తలున్,
వెలపొడు గైనడా, లవుసవేళ్లును, జిల్లలు, చిడిగంజలున్,
గలములు, భూర్జపత్రములు; గైరికధాతువు, గచ్చకాయ, లే
కలములకొమ్ములన్ వెదురుఁగన్నుల ముత్తెకకిం క్రమస్తకం
బుల నహిరాట్ఫణంబులను బుట్టినముత్తియముల్, సితాసితం
బు లయినచామరంబులుఁ, బ్రభూతమహత్త్వములైన మూలికల్,
ఫలములు, మందులున్, మణిశిలల్, ఘనసారము, గంధసారమున్
దళుకుఁబసిండిసన్నిసుక, దంతముఁ, గుంకుముపూ, హరిద్ర, ము
స్తలు మొద లౌవినోదపు బరిశస్తపుటక్కజవస్తువుల్; మఱిన్,
బులులు, సివంగులుం, జెవులపోతులుఁ, గొర్రెతులుఁ, గొండముచ్చులున్,
నలుఁగుబ్బు, తేఁచు, లేమఁగులు, సంకులు, జీరిక, లెలుంగు,లాదిగాఁ

గలబహువన్యసత్త్వములుఁ, గ్రిమ్మఱ, నవ్వరదాదు లన్ననె
చ్చెలులను, సారె నెట్టి, పతిచేరిక కంపక మిట్లు, చేయుఁగా,
గలగలమంచుఁ బాదకటకంబుల మ్రోఁత లెసంగఁ, గంకణో
ర్మ్మిలు సెలఁగఁ బయల్వెడలి, మోదముతో, దరిదాపుటూరువ
ల్లెలు దన కిచ్చుఁ బోద్వని, వడిం బ్రణయంబునఁ జెప్పిపోవ, వీ
థులబడి నింటికింటికిని దోయజసారథ యేగుదెంచె; నా,
వెంకొనుబంధుభావమును నెయ్యముఁ బాటిలుచోట, నేలదా
ల్చులనుతలున్ విధేయతనె పూని చరింతురు పావనాత్మ; ల
ట్టులు చనుదెంచుగౌతమిఁ గడు స్వభయభక్తులు విస్మయామలు
న్మలిగొనఁ జూచి, "యోజనని! నీవలనన్ మనుమాదుపేదమ
న్కల కటు లీవువత్తు వనుకో మెప్పు" డంచును, "రాక లేశముం
డెలియమి సిద్ధమై నిలువ నేరము నేర" మటంచు, "జేప్పు మా
పోలసి నిను స్వభజించుమొగమోటమి వంతున వచ్చినావా, మా
నెలవుల, కేము చాలుదుమె నీ కిడ సత్కృతు" లంచుఁ, "దల్లి రో!
పలుమను లేల? నీవలనఁ బావన మయ్యెను మాగృహంబు, లీ
కలుములు నీయధీనములు, కైకొను మిచ్చియు" నంచు, లోపమే?
ఫలము నొసంగుఁ బాత్రమునఁ బడ్డది కోటిగుణా" బటంచుఁబూ
జలు వచరించునాగరకజానపదాళి నమగ్రిహించి, వా
రల దగుకల్మి గాని, తనప్రాభవముఖ్యము లెంచుకోక, మేల్
తలుపులు, ద్వారబంధములుఁ, ద్రావులుఁ, బెండెలు, వాసముల్, దనా
బులుఁ, గిటికీలు, దూలములు, బొంగులు, గుజ్జులుఁ, గంబముల్ మొదల్
గలగృహశల్యములీ, పురులు, గాడెలుఁ, గొట్టులుఁ, బాంతజాల్, మొదల్
గలకరంజంబులుం, బెసలు, గందులు, సెనగలు, మినుమ్ము, లన్మ్ములు
ల్వాలు, నలచండ లాది యుపవప్పులదిన్నులుఁ, గందచేమపెం
డలములుఁ, గాయగూరలు, గుడంబు, మిరెంబులు, నుప్పు చింతపం

తలు, నయిరేనిదుత్తులుఁ, బనంటులు, బుంగలుఁ, బుప్లు; దాకమూఁ కళ్లలును, జల్లిమూఁకుడులుఁ, గుండలు, మండిగమంగలాలు, బం డలములు, నాగవల్లిపిడతల్, గ్రౌమిదల్, బొరుసట్టికల్, హసం తులు, గడముంత గోలెములునుం, గడవల్ మొదలైన మంటిపా త్రలు; జిమినీలు, లాందరులు, రంగుఁ బటంబులుఁ, బారదంపుబు డ్లాలు, వెల హెచ్చులస్తరులు, గ్లోబులు, గ్లాసులు, వాలు సేస్లు, లాం పులు, ముకురంబు లింకను నపూర్వముగా వివిధాచ్ఛకాచపా త్రలుఁ; దగరంబు నత్తినుము రాగియు నిత్తడి కంచు వెంకి పు త్తళులు గ్రంచి యేర్పఱుచుతంబుగ చెంబులు, గిన్నెపళ్లెరం బులు, నడపంబులుం, బడిగముల్, బరిణల్, కుడకల్, కరాటముల్, కలశము, లాబుకోర, లబకల్, తబుకుల్, కమలాలు, సిబ్బులున్, దళిగలు, సంపుటంబులుఁ, బెనంబులు, జట్టువముల్, భగోణులుఁ, నిలువుగళాయిగుండిగలు, నీళులకాఁగులు, డేకిసాలుఁ, ద ప్పెలలు, ఘటాలుఁ, గొప్పెరలు, బిందెలు,లోవులు,గాబులుం, గమం డలువులు, జాలవల్లులు, గళంతులు, ముంతలు, స్థాళిపంచపా త్రలు, హరివాణముల్, గరిఁటెదబ్బర, లుద్ధరణుల్, గళాసులున్, దెలెలును, గుంభకోణములుఁ, దిర్మలలోటలు, రైలుజోడలున్, విలసితకాశికాఫవునిపేరివి, జారులు, నన్నపూర్ణల య్యలరులసజ్జ సాగరము, లత్తరుదానులు, పూఁతపోఁతచేఁ తల వగునిట్టివిన్; మిసిమిదంతము గందముఁ డేకు లాడిగాఁ బలకలు గోసి చిత్రికలు పట్టి ఘనందుగ నీడ గాన రా పలిపినమందసాల్, నగలచందుగలున్, దసుకుల్, గలాలసా మ్బ్లలు, నలమారబీరువలు, బొక్కనముల్, వివిధంపుఁ బెట్టె, లం దలములు, జోలిపల్లకులు, నాలకులున్, శిబికల్, సవార్లు మే నలు, జతురంతయానములు, నాణ్యపుఁదకొలు, మేజలున్, గవా

చలుఁ, గురిచీలు, బెంచులును, సోఫలు, మంచెలు, మెట్లు, మంచముల్,
గొలుసులబల్లచక్కలును, గుక్కలు, ముక్కలిపీటగఱ్ఱయున్,
పలుబలిపీఠముల్; కలకలక్వైణనశుభ్రితత్వణ ముత్రై
తలచెను వీణెకిన్నెరసితార్లుఁ, బిడేళ్లును, ఢంబుజుక్; మఱిన్,
గల వింత నిట్టివస్తువు లనంతము; లెన్నని చెప్పఁగాందు! స
చ్చిలువలజేనిక్కైనను వచించుట కన్నియు నెంచఁ బూన్పినన్
నలయు; నటుండనిండవి; వనంబుల లంకలఁ జేల మేయుచుఁ
బలిసిన యెన్లు, నావులును, బఱ్ఱెలు, గొఱ్ఱెలు, ఏక్క, మేఁకలుం,
బుఱలను గొమ్ములం జెనకుపోత్రివృషభోత్తములుఁ, గ్రొవ్వు లాడినాఁ
గలపసిమందలున్; బెరిగి కన్నుల కింపగు పైరు, లింక నె
వ్వలనను నేవి చేకుఱునొ వానిని బొంగుచు స్వీకరించియున్,
వెలలక, యుర్లు, వాకిళుల, పీఠుల, దోఁటల, ద్రాక్ష, సందుగొం
దుల, జనవారిఁ జేరిచి, యెవో తెసపంకిలి, నాలు రేను నా
శ్నిలువర ముస్నచేటితతినిం గని, ముందటిభక్తిసంభ్రమం
బులు విడమింప, మించుచునగ, "మూఁడవనాఁటికి ముష్టిచుట్టమం"
చలమినగాఁ బ్రియ్యసామ్యము యథార్థముగాఁ, బ్రజ, పల్లెపల్లెలన్
వలపలు వోవు చుండి, "మనపాలిటి కీ పెనుభూతి మేటికిం
బిలువని పేరఁటం బిటు లభించెను! బో" దనువారు, "నేఁ డహో!
నిలువ యొనర్చెఁ గొంపలకు నీళ్ళనువారును, "శత్రుసేనయుం
బలె, నిలు ముట్టడించె ఝరి; మాబ్రదు కెట్లు?" ట్లనువారు, "మిద్దెమే
డలు గలవారమే? యెచట డాఁగుదు మే" మనువారు, "నాలుబి
డ్డల మిటు పడ్డపాటు పదటం గలిసెన్; నువు, గొఱ్ఱి, చామ, గం
టెలు మొదలైనపంటలు మునింగెఁ గటా!" యనువారు, "జాలు మున్
గలఁకను గాళ్ళ వ్రేళ్ళఁ బడి, క్రన్ననఁ బైరును జుట్టు ముట్టెఁ జెఱ్
జలమున; నీచవర్తనుల నైజ మిదే" యనువారుఁ, "ద్రాగనున్

జలములు లేక నాఁడు, బకునన్యగృహాదులు మున్ని నేఁడు, మే
మలమగ నయ్యెఁ జూడుఁ; డతి యన్నిటఁ గీ'' డనువారుఁ, ''బాటి రే
వులు పడి మొన్నదాఁకఁ దనపొందినతిప్పలఁ దల్పి; దిష్ట మ
మ్మిలు వెడలించె; నల్పసిరి యిట్టిదె కా'' యనువారు, ''దీనవ
త్సలుఁ డగునీశునాజ్ఞ పెనుసంకెల యయ్యెను గాక, భూతముల్
బలిగొన కున్నె యొండొకఁడె ప్రాణిచయం'' బనువారు నై, కడుం
గళవళ మంది నెల్లెడల; గౌతమి యిట్టులు పుట్టినింటిప
స్తులఁ, జెజసొత్తులం దనదుతోయము లుబ్బుచుఁ దేరఁ గా వడిన్,
జెలువునిదిక్కు వెట్టుతొరచేత, వనాలు గినా లటంచు నే
మళుకక యేఁగదే, నడుము నయ్యెయిచోఁ దెరువాట్లుగొట్టఁ, ద
ప్పలఁ బడి యీఁదుకొంచు నిజవస్తుచయంబును డాయుబోయలన్,
మలకల, మాలమాదిగల, మంగలచాకలవాండ్రి, నీండ్రి జేం
డ్రిల, మరకాంఁడ్ర, నొడ్డిముత రాచల, నీ తెగవారి నెల్ల, మే
ల్బళికరమై యటం గొలుచుపాముల, జెట్టులఁ, దేళ్ళ, మండ్రిగ
బ్బలఁ గఱపించియున్, సుఖుల వైచి గిరాలునఁ ద్రిప్పి ముంచియున్,
సలుఁగుల రేఁచి పంచియు, మొసళ్ళను బై కెనకొల్పియున్, భయా
కులులను జేసి పుచ్చుచును, గొందఱ కూర కనుగ్రహించి, కా
సులు, మొహరీ, ల్వరా, ల్నగలుఁ, జాఱగ నిచ్చుచు, నచ్చటచ్చటన్
గలకల నచ్ఛఫేనరుచి నవ్వుచు, నిండుగ నేగువాఁగు నా
తలమె నుతింప! నప్పు డిసుదట్టులకొట్టిక లిండ్లబారులై,
డకసరి పోఁతగట్లు జలదామలయంచుల ప్రక్కగోడలై,
కలసి విదిక్కులం బఱచుకాల్వగముల్ వివిధోపరథ్యలై,
హాళహాళి నేగుభూమతను లాఘ్యలసారటులై, బిగించుచాఁ
పలఁ బరు వెత్తుతొట్టివడవల్ తెరువన్లయొకెద్దుబండు లై,
యలయుడుసాధిమాధులు జవాధికసైంధవధీరసాదులై,

జలధిపథఘాటి, ఘాటిఁ దోలుసారె యిటుల్ చనుదేఁ, దదీయమం
డలనిఖిలప్రధానపురనాయకరాజమహేంద్రపట్టణ
స్థలు, మహనీయు లగ్రకులజుల్, ధనధాన్యసమృద్ధు లూరుజుల్,
బలిజెలు, నింకఁ జల్ దెగలవారును, దైవపౌర లూహ్యనిద్దపుం
దళుకుటనంటితుంటలును, పంటులు, జీలుగుబెండ్లు, సంతనన్
గలయఁగఁ జేర్చి, పై సొగసుఁగాగితపుంగల మేర్పరించి, ప్ర
క్కలఁ జలువన్నెముచ్చిపరికల్పడమ్ముల్ పచరించి, రంగుగు
చ్ఛలతెరచాఁప లెత్తినబెడఁగుపల్లవములల నెత్తిఁ బూని, యిం
పులకడనుండి, డోల్, ఖోలుముఖోళ్లు, సానాయులు, వీరణాలు, గా
హాళములుఁ, గొమ్ములుబూర లివి యాదిగఁ, దూర్యము లెన్నియేని బి
ట్టులియఁగ, పీఘు లేగి, భజనోత్సవ మొక్కెడ, నాగవాసపున్
గలగిళగానసాభినయనాట్యము లొక్కెడ, వాహనాలబా
రులు మఱియొక్కచోట, సపురూపముగాఁ బ్రిజ మూఁగి చూడ, ని
మ్మలనరదెంచి, ఘృష్ణగిరిముఖ్యము తానెజరేవులందుఁ, బు
వ్వుల, నిళ్, గుంకుమాక్షతలఁ, బూజ లొనర్చి, దుకూల మిచ్చి, చి
మ్మిలి, పెసఁగన్న, ముద్దులను, మేల్ఫలముల్, వడపప్పు, నానఁ బ్రాల్,
చలిమిడి, పానకంబును, గుడంబు, నివేదనఁ జేసి, పండుటా
కులు, గపురంపుబాగములు గూర్చి విడెంబు లొసంగి, గాతమిన్
వలగొని, పెక్కుజోత లిడి, వస్తువు లో వెలిగించి, యల్లనన్,
" పిలుఁగుల ముస్గ కుండ మముఁ జేకొని సీవిటు దేల్పు మమ్ము " నా,
జలముల దెప్పలకా విడిచి, చల్లనితల్లిని సాగ నంపఁగాఁ,
" కలిమికి, విద్య కున్నతికి, ఖ్యాతికి, నాగరకత్వరీతికిం,
గలనగరంబులందు నధికం బగుమండలరాజధానిలో
పల, మఱి నాము మోఁ ప్రిల, నిటువంటివి యుంటకు నింక సైఁతునా
తిలలకుఁ జూడ్లు, ద్వారములు దాఁకఁగ, జెల్లలు దొల్ల గోడఁ కా,

గలుగులు దళివ్వఁ గొక్కు లెలుకల్, చెదబూజులు గూడు రాలఁ, గి
ప్పాలఁ బొగకజ్జు లేరుపడ, బొట్లఁగ మాలమ్ము, బంతి కంతకం
గులగులలై, తమంత నిలఁ గూలఁగ నున్నను, దాత తాతతా
తలయుఁ దరంబునాఁటి దని, తా పరిలింపక చేయునేత ; వా
రల కెపుడో ప్రమాద" మని, రమ్యవివాసనహర్మ్యమందిరం
బుల నిఁక వారు గట్ట, దరిపూర్వపుఁగొంపల నేలమట్టముల్
సలిపి, యమాన వృద్ధి, తదనంతరవాసరము-దు, నథరిథే
రు లులియ, గౌతమీతటిని పొర్లుచుఁ బైనము సాగి, "సప్తసం
ఙ్ఞలు ధరియించి వల్లభుఁడు, సప్తవిభాగము లయ్యె నంచునో,
నలలితసప్తనామముల సాధ్వియు సంభ్రమ నేఁగుచాయలై
గలసెను; భీను లయ్యుఁ గులకాంతలు, పావనవృత్తిభంగ మా
నెలవున, సద్గతి న్నెరపి, నెమ్మి వినమ్రతతోడఁ బ్రాణనా
థులకడఁ జేరుటల్ వినమె? త్రోవ నటుల్, పరమేశ్వరాదు లో
స్థలములఁ, దన్నుఁ బట్టుటకు దాఁకొనునయ్యనకట్టలాకుగ
ట్టల నిజశక్తిచే గడగడఁ వణఁకించుచు, విశ్వరూపముల్
బెలుచ ధరించునట్టు లర వెత్తిగ నిర్వసరొమునుపాడముల్,
జలనిధినీటిమట్టముకొలందికి మించుగఁ బొంగి, వానియా
వలలను దాఁటి, యచ్చటను దాయులకుం బెనుప్రాపులై నహా
ఙులధృతి దూలఁబుచ్చి, రమణుల్ శరణాగతగోత్రరక్షుఁడుల్
జలనిధిసార్వభౌముని, వెనం జని చూచి, విలోలవీచిబా
హువుల, నుభయాంగకంబులును నొక్కటిగా, బిగికౌఁగిలింతలన్
గలయికఁ బొంది, లోకమునఁ గాంతయుఁ గాంతుఁడు నేక దేహమన్
పలుకు స్థిరీకరింప నన, ద్వైధము పేరనె కాని యేమిటన్
గలుగక యుండఁ బొంది పతి, గౌతమి తా సుఖ ముండె; నిట్లు, కే
వలపరమేశ్వరాయతకృపాజనితోదకవిత్వవైభవో
జ్జ్వల వ. సు. రాయ ధీనదివసంరచితాతతగౌతమీమహా

జలమహిమానువర్ణనపుఁజంపకమాలిక, యారవిందుమం
డలముగ, బాలకోత్తమగళంబుల, లేఖకముఖ్య పాణులన్,
గొలువులఁ బొల్చి, యాశుకయ, గుమ్మని కమ్మని తావి గుప్పుచున్,
మలినులమాట యేటికి? సమస్తబుధావళి కింపు గావుతన్ 307

---

క॥ నభమున నక్షత్రంబులు,
గభీరనీరనిధి మణులు, ఘోత్రస్థలి సుమముల్,
ప్రభువా! నా కెప్పుడు భవ
చ్ఛుభగుణములు భావ మంతర స్ఫురణకుఁ దెచ్చున్. 308
ఉ॥ చిన్నెలు వన్నె లేర్పఱిచి చేసితి పుల్లుకులంబు లెన్నియో;
కన్నులఁ గాంతు రబ్రపడి, కాని యెఱుంగరు పేళ్ళ నైన; హా!
చెన్నగువిసిహూవులును, జేష్టలు, నచ్చిన నొత్తునట్లుగా
నెన్నఁగఁ జాలునే ర్పొసఁగ వెవ్వరి; కెంతటివాఁడ వీశ్వరా. 309
తే॥ వివిధవిషయప్రసక్తిని వేలువేలు
తఱుల రచితంబులైనపద్యములు కూర్పఁ
బడినవసురాయచాటుప్రబంధమందుఁ
బ్రకృతిసంజ్ఞంబు రెండవప్రకరణ మిది. 310





శ్రీరస్తు

శ్రీపరమాత్మనేనమః

# వసురాయచాటుప్రబంధము



## ప్రాస్తావిక ప్రకరణము

క॥ ఆకంచు నరయ కున్నం
గోకంచుఁ గువిందుఁ డెట్లు గూర్పం జాలున్?
నీకొఱ నెఱుఁగనిమానవుఁ
డేకొఱ కక్కఱకు వచ్చు నీశ్వర! సృష్టిన్? 1



ఉ॥ నన్నయతిక్కనాదిరసనల్ గుఱియించినచాటుధారలే
మన్నన నీకఁబోలు; నణుమాత్రముఁ జక్రిసమబ్బ దెందు; హా!
జున్నులలోనఁ జిన్నిపువుజు న్నెటు, లట్టులు పద్దియంబులన్
మిన్నలు చాటువుల్,రససమృద్ధి ననిర్వచనీయమాధురిన్. 2

సీ॥ నుతసూనృతవ్రతానుష్ఠానపరతచేఁ
జంఘాలుకడ హరిశ్చంద్రుఁ డుండెఁ;
పితృవాక్యపాలనాన్వితమనస్కత, రామ
చంద్రుం డరణ్యవాసంబు సలిపె;
శరణాగతత్రాణపరత డేగకు శిబి
తనమేనికండలు తఱిగి యిచ్చె;

సమయభంగవిభీతి సకళత్రముగ మత్స్య
పతిబానిసీలైరి, పాండుసుతులు;

తే॥ పతిహితాచరణైకసువ్రతనిరూఢిఁ,
జంద్రమతి, కృష్ణ, దమయంతి, జనకతనయ,
దోసకారులచేతను గాసి వడిరి;
నీతి కావడయే గదా నికషణంబు. 3

ఆ॥ కావుకావు మనుచుఁ గటువుగా నఱచును
బంట్లు దినెడుకాకి; పల్లవముల
మెసవుపికము కూయు మృదుమధురంబుగాఁ;
దిండి వేఱు, మాటతీరు వేఱు. 4

తే॥ మొలచెఁ గటిపేఁవమొ క్కని ముదము పడుచు,
మూఁడుకోన నాకులను, గచ్చమొక్క యయ్యె;
మోముఁ గని విశ్వసించిన మోసపోదు;
రంతరంగపరీక్ష సేయంగ వలయు. 5

ఆ॥ సత్తు వ్రాసి, చిత్తు జడ్డనఁ జించుచోఁ,
గలుకు మని మనంబు కలఁత పాఱు;
గరవిరిచి మొదలఁ గార్యంబు తీఱిన,
నిట్టె గా యొనర్తు, రెట్టివాని. 6

ఆ॥ ఏఱు దాఁటి, తెప్ప నెవ్వరుఁ గాల్ప రే;
సాకు తయ్యె నద్ది; యేమి కతమొ?
చింతుర సత్తు వ్రాసి చి; త్తైత్త రామాట;
యెల్ల రాడుమాట కల్ల నిజము. 7

మ॥ తెపశాఖాగ్రమునందుఁ బెంటిగమితో దాంపత్యసౌఖ్యంబుఁ ద
త్పరతం బొందుచుఁ గ్రిందఁబోయఁ డనుకంపాశూన్యుఁడై, వింటఁ దీ

యంత మొందు; నంత నక్షరవ్యాపార
మడఁగుఁ; గట్టి మిగులు; నాశ యుడుగు. 14

క॥ తుంబురునారదముఖ్యాం
శంబుల జనియించుభక్తజనములశుభగే
హంబులకుం జెంత, నిశాం
తంబులు గలనరులు, పరమధాములు ధన్యుల్. 15

ఆ॥ నీర మింకి పోవ, నారికేళఫలంబు
గుంజు, పెంకు వీడి, కురిడి యగును;
మోహ మంతరించి పోవుకు, జీవుఁడు,
దేహబంధ ముడిగి, దేవుఁ డగును. 16

ఆ॥ బుట్టబొమ్మలోన నట్టు వొక్కఁడు దూటి,
వేయుగంతు, లెంతొ వింతఁ గందు;
బొందిఁ జొచ్చి నలువుపురుషుచేష్టలు మెచ్చు;
రవమతికి నిమిత్త మతివరిచితి. 17

ఆ॥ ఆఁప లేదు మరణ; మూర్తిఁ బెంచును; గాన,
నంతమున మమత్వ, మనుచితంబు ;
భవహరంబు; మోక్షపరమసాధన; మట్టి
యదన జీవ! తలఁపు, హరినో హరునో. 18

చ॥ అనుగున డాలఁ దోఁచుదివియద్దునిబింబము వేఁడి, నించు కే
నడఁపఁగ నేరవయ్యెడుఁ దటాకముఖాదులవారిపూరముల్;
వెడలి యణువ్వరూపమున నింటికి, నవ్వి హరించు దాని; నె
క్కుడుగద బల్మిసూక్ష్మమునకు, న్మఱి స్థూలముకంటెనారయన్.

క॥ స్థూలమునకంటె సూక్ష్మమ
వేలబలము గలది; నీరు, వేఁడిని బాష్పం

మర్త్యమున మాటపొందిక మార్చిన బ్రదుకు;
బ్రాహ్మణబ్రాహ్మణేతరుల్! వాని గనరె. 26

క॥ అనుకూలము ప్రతికూలం
బును, బ్రతికూల మనుకూలమును గా మారున్;
మునుము న్నిద మిద్ధ మ్మని,
యనాగతము నిశ్చయింప రనుభవరసికుల్. 27

తే॥ అంద మన్నది తోడమ్మనంటె కాని,
సత్త్వమం దంతగా లేదు, వాస్తవంబు;
దుష్కృతిని సీమజేలుంగుడుస్తులను గాల్చి,
తాల్చి రాష్ట్ర స్వదేశ్య ఖద్దరుపటాళి. 28

ఆ॥ ఆహితాగ్నికులత కానవాలో, నోర
సిగారుచుట్ట; యదిస మో, పెఱుంద
జేబునిచ్ఛ; కృత్తకేశ బాబ్, మీసాల
యయ్య లుంపుద్రి సోమయాజులు కలి. 29

ఆ॥ గోగణమ్ము రోసి, కుక్కురమ్ములం గొంద్రు,
బ్రాహ్మణులను బైటం బాఱం దోలి,
మాలమాదిగలనె యోలగమ్ములం జేస్తు,
పైడు వేలయిఱువ పైనకలిని. 30

మ॥ మొగడల్ దోంచె; వికాస మొందె; దెస లామోదమ్మున న్నిండె; నె
చ్చెగ ఝుంఝు మ్మని గండుందుమ్మెదలు రాం జొచ్చెన్, నిమేషంబు-
లేం
తస్సగ నౌత్సుక్యము పేరిమిం గడపుం "గల్గుం బండు" లంచున్ శుకం;
బిగమా! యంతకె యచ్చుమావిని, దదీయేచ్ఛావిఘాతంబుగన్.

క॥ కలకంఠము జాతమునం
జలమునం దఱిమెను; తా మెసంగుచు దళముల్,

ఫలములు నీ కది యిగురులుచు;
వలదే యామేలు వలుప! బలిపుష్టంబా. 32

తే॥ నీలకంఠద్యుతికిఁ దోడు, పింఛములును
భూతిచెలువంబుఁ దాల్చితి, పోతుటెపిక!
చిత్తమున శివసాన్నిధ్యచింత యున్న,
వేసముల కేమి లే, కామవిజయి వగుము. 33

క॥ విడిచిన తామరపూవా!
తడ వేటికి సలిపె దీవు? త్వత్సన్నిధి కి
ప్పుడు వచ్చినయీతుమ్మెదఁ,
గడుపు తనియఁ గ్రోల నిమ్ము కమ్మని తేనెన్. 34

ఆ॥ ఎంతదొడ్డవాఁడె, యిందిరావల్లభు
బొడ్డుఁదమ్మి కన్నముద్దుబిడ్డ;
కనుల నీరు గాఱుఁ, గటకటా! పడ నైచె,
ముల్లుకొనపమీఁద మల్లెపూవు. 35

క॥ మూలంబులు, శీలింప, ర
సాలంబుల వైనఁ గావు స్వాదువు; లైనం,
బాలలదోసాయుగీ
మూలంబులు, తద్విరుద్ధములు రసికులకున్. 36

క॥ వాతెర నమృతము గ్రాఁతియె
శాతోదరి? కద్ది సర్వసాధారణమే;
చేత నమృతంబు గలిగిన
నాతిని గీర్తింప వలయు, నాలుక యున్నన్. 37

ఆ॥ కదల కుండ నిలిచి కన్ను మూసి జపంబు
చేయుచుంటి బకమ! చేపకొఱకుఁ,

జేవిగనిమమీఁదఁ; గానవు, నీనీడ
మీను నీటఁ జూచి, మిట్టి సురిఁగె. 38

చ॥ సురభిళమాలతీమృదులసూనములన్ సరి గ్రుచ్చి, దాని నా
హారికి నొసఁగినం బరము; సంగడి సమ్మినచో నిహంబు, గు
ర్పూరముమెడం దగిల్చెదరు రోయక రెంటికిఁ జెడ్డరేవణల్,
సరసులు తమ్ము సవ్వుటకు సాహసగర్భుఁడు వ్రాయఁ, దప్పునే?

ఉ॥ ముచ్చట చూమనోహరవుమూర్తి యొకానొకఁ డెద్ది యేని, దా
నెచ్చటి కేనియుం జనుచు, నీక్షణగోచర మైన, మానవుం
డచ్చెరుపాటుతో మలఁగి యా మొగమై మఱియొక్కమా రెదన్
మెచ్చుచుఁ జూచు; నట్టులె సుమీ రసవత్పదపద్యపాఠముల్. 40

చ॥ చదివినపద్యమందుఁ గలసార మెఱుంగఁగ లేనియజ్ఞుఁడున్,
హృదయముహాయిఁ గన్నను, గవీంద్రుని మెచ్చకపోవు గొంతెయుం
బడవి విశేష ముండి, కృతిపద్యము లూరక కోరులోభియుం,
గడ భువి, మూఢమూర్ఖజనగార్దభముల్; ముగు రేకరాశియే.

చ॥ అమితము లెన్న భాషలు; మహాకవు లెందఱో దాన దాన; గ్రం
థములును గోట్లు తద్విరచితంబు; లనంతము లందుఁ జిత్రచి
త్రములు స్వభావకల్పనలు; తద్విధి నిచ్చలు హెచ్చుచున్న వె
చ్చ, మెవఁడు గాని కానని, యసంఖ్యపదార్థము, లౌర! సృష్టిలోన్.

ఆ॥ వస్తువునకు గౌరవంబు లాఘవమును,
భాషచేతఁ గూడఁ బ్రాప్త మగును;
శస్త్రముగను దోఁచు, ఛత్రిక మనిన; నె
గ్గుగను దోఁచుఁ, గుక్కగొడుగ టన్న. 43

ఆ॥ వింద మన్నఁ, బద్యవితతి కర్తగళాన
ననదు; పాకకాస్యమందె హెచ్చు;

గాంచ, గోద, నాసికాత్ర్యంబకమునొ్గ
న్వల్ప; రాణ్మహేంద్రిముం దనల్ప. 44

ఉ॥ జీవులలోనఁ జేయుపనిచెట్టుల, గుట్టులఁ, జెప్ప నేల? స
ర్వావయవంబులుం గలమహాబలశాలుల, సింహముఖ్యనా
నావనజంతులం, బశుగణంబుల, మానిసి పట్టి యేలెడుం;
భావ మిదేమొ "నోరుగలవానిది రాజ్య" మటన్నమాటకున్.

క॥ గళమున స్వరమాధుర్యము
కలతావులఁ, బ్రాయికముగఁ గనఁబడు బికముల్;
పలుకునె బహిరంగముగాఁ
గలకంకము రుతము, నితరఖగములపగిదిన్? 46

తే॥ గాలివలన జనులకనులు మండునె? దానఁ
గలియుకొన్ని రేణువులనె కాని;
పాలనంబు కాదు బాధకం; బదాన
నమరుకుజనులు నిబంధాద్రికహులు. 47

ఆ॥ ఏలు లెన్ని పక్షి, నెదుగదు నారాశి;
యూరుపుల్లను గాలి, యుగవు గాను;
చెత్త యెంత పడిన, త్రొక్కిబడదు నెచ్చ; దే
దోమఁ బుట్టు, నక్కి యాడెడ జిందు. 48

ఆ॥ పీఁచుమామిడిపండ్లు పెక్కు లున్నను, రుచిఁ
జేయ పక్వ ద్రాక్షలె, పీఁచుఁబట్టి;
పక్షములను దాల్చి పక్షు లన్నియు నున్నఁ,
బక్షితుఁ డొకఁడె గా నుపక్షుఁ డనఁగ. 49

ఆ॥ నూఁది, రాయుకొలఁది నూఁదంటు జాతి, నా
కర్షణంబు, కరము గాంచునట్టు,

లిప్త నస్త్రలాభ మెంత చేరువ యగు,
నంత వేగిరించు నంతరాత్మ. 50

క॥ కనుఱెప్పలకు మీలస వే
ష్టనములు నిద్దురను రేయిటం గా పగు; నే
ర్పన లో రోమపుదోమ తె
ర నీశుఁ డిడఁ జేని ఘ్రాణరక్ష తరంబే? 51

ఆ॥ సూర్యునందు లేవు, చుక్కలందును లేవు,
చంద్రునందు, దివ్వెలందు లేవు,
కంటిఱెప్ప వెండ్రుకలఁ బుట్టుఁ గిరణముల్,
వెలుఁగువెల్లి చీలి వేనవేలు. 52

ఆ॥ పసరుటాకు గిల్లి, పాలు గాఱినఁ, గుంద
నగ్రకులుఁడు; కటిక, యావు నఱికి,
యఱుత నెత్రు వఱద యైనఁ, జింతింపఁడు;
మాంసభోజనునకు మనసు ఱాయి. 53

ఉ॥ క్రిన్నన ముక్కునం గఱచి, కాకము పిచ్చుకఁ గొంచుఁ బోవ, నా
పన్నతదార్తనాదమున, బగ్గు మనున్ మన; పట్టిపిచ్చుకే
యెన్నియొ పుర్వులన్ గమిచి, యిట్టటుఁ ద్రోటి విదుర్చుచుండ, ను
త్పన్నము గాదు జాలి యటు, వాయి గలట్టిదె ప్రాణిసృష్టిలో.

ఆ॥ కోడిగ్రుడ్డు తినుట కొల యంద్రు; కొబ్బర
కాయ తినుట పాతకంబు నాహు,
పిల్ల గ్రుడ్డులోన; విత్తున ఫలవృక్ష;
మేది జీవహింస యిందుఁ గాదు. 55

తే॥ క్రూర యగు ధర్మదేవత; క్రూరతరము
క్రోధము; బుభుక్ష యక్కటా! క్రూరతమము;

బరువుం బృథ్వికిఁ బాప సిద్ధ మయి సామాన్యంపుఁజూ పుండఁగా,
నెరగా నత్పైను బ్రాఁతిఁ బ్రాఁతి; కెటుగా సీహింపఁ దెల్పుంగృపన్?

ఆ॥ ఇనుక రేణువులకు, నినునియాలోకంబు
హీరశోభ దెచ్చు; హీరములకు,
నపరికాశ మిడఁ దదాలోకవిరహంబు;
దైవసుముఖవిముఖత లివె పరిజకు.

క॥ ఫలరూపము దైవముపని;
గలుగు, నది తనంతఁ; బురుషకారం బెది, నా
నలవయుఁ, బాదును, బాదిరి,
గలచో వి త్తునిచి, చక్కఁగాఁ బెంచుటయే. 64

చ॥ పులికిఁ దలంకి బోయ, తరువుం ద్వర నెక్కి, దిగం దొడంగెఁ గో
ల్పిలువ, వెడందనోరఁ గబళింప బుభుక్షను వాని; నంతలోఁ
జలమున వచ్చి, గోండ్రిలుచుఁ జాఱమొగం బెగయంగఁ, దూఁటి నో
రులొకట నొండు, వ్యాళయుగి ద్రుంగెఁ బెనంగి, మతంగుఁ డుబ్బఁగన్.

ఉ॥ ఈయసమానసౌరభము నెవ్వఁ డొసంగెనొ నీకు, వాఁ డయో!
పోయక పోమె నేమి యొకో పూర్ణతమం బగునట్టియాయు? వా
హా! యెఱుఁగంగ నయ్యె; భవదల్పతమప్రియయం బె లోకముం
శాయఁగ రాని నెవ్వగలఁ పాల్పడుచుం; జిర మేల? మల్లికా! 66

ఉ: ఏలతకూన నిన్నుఁ గన, నెంతటిపావనవృత్తిఁ బూనెనో;
పోలిచి చూడ, మంజుగుణపుంజమునం జెలు వొందె దీవు; వే
యేల! చలింపఁ జేయువె మహింబ్రజఁ, గేవలమార్దవంబునన్?
లాలితసౌమనస్యమునలాభము లిట్టివి కావె? మల్లికా! 67

ఉ: అంటినఁ, గంది పోయెద వటంచును నుల్లము తల్లడిల్లు; ని
న్నంటనిచోఁ, నవజ్ఞ యగు నంచును జంకు జనించుఁ; గాన నీ

చిటికెనకు నుంగరం బిష్టఁ, జెలువుఁ దెచ్చు;
బొటమనకు నది పెట్టినప్పుడు నగించు. 74

క॥ తొలిపుట్టువుసంస్కారము
గలిగినవారలకె, గురువు గఱపిన దంటుం;
జ్వాలదురుదీపము ముట్టిన,
వెలుఁగవు, చము రేమి లేమి, వెలిమిడికచికల్. 75

ఆ॥ బాలుఁ, బ్రథమవర్ణపరిచయక్రియయందు,
బాల, నూత్నసురతకేళియందు,
లాలనం బొనర్ప, లాభ మగు; నాతాత్రిన
బెదరఁ గొట్టి రేని, మొదలు చెడును.

క॥ గంగానదికిన్ యమునా సంగము,
జనకాంఘ్రికాంతిర్మఃపకతనం బు
ట్టుంగల్మిఁగ, సముమంతర
పుంగల్మిఁగ నెంతురె, ప్రాష్ణభూగోళజ్ఞుల్. 77

ఉ॥ దానపరాయణుం డగునతం డగుఁ గాక దరిద్రుఁ, డర్థికిన్
దా నెట నేనిఁ దెచ్చి యయినం ధన మిచ్చును; జందమామ తే
జోనిధి గాక పోయినను, సూర్యునియొద్ద గ్రహించి వెల్గు, శ్రే,
కానఁగ నీనిచీఁకటిని, గన్నులకున్ దయతో నొసంగఁడే? 78

ఆ॥ దాత కాలవశముచేతను లోభియై,
యాత్మదత్తమైన దపహరించు
జాడ, బాట కిష్టనీడ, మధ్యాహ్న మొ
ద్దకును లాగుకొనియె ధరణిరుహము. 79

ఆ॥ శుభపరోపకారశూన్యవిత్తాదిక,
మన్యులకును గానియట్లు, పెద్ద

యీఁదునీడ, చెట్టునే పొత్తుకొని యుండె,
నెత్తిమీఁదఁ బొద్దు నిలుచు నపుడు. 80

చ॥ బడలిక లుప్పతిల్లి, వనపాదపశాఖల నల్లుకొన్నయొ
ప్పిదమున, నూర్ధ్వబాహువుల, వృద్ధిని బొందినగోళ్ళ, చుట్టుకోఁ
బొదలినగడ్డమున్, జడలు, బూడిదపూఁతయుఁ, బుట్టఁగోఁచి యై,
పదమున నెత్తుగాఁ బొకఁడు; పన్ను ధనాశ తమూఢవేసముల్. 81

క॥ హోరాసూచిం గాఁ బ్రజ
కూరుపు విధి ముక్కురముల నునిచి, తమంతం
దా రాడ నిమిషసూచిం
గా, తెప్పల మర్చె జేబుగడియారము గాన్. 82

క॥ పెంచుచునే, పక్షుల దో
రించుచు నౌనకఁడు; ద్రుంచు వృక్షంబుల, నా
టించుచునే, పవనుఁడు; పా
లించుచునే, సృష్టిఁ ద్రిబలిమి హరించున్. 83

ఉ॥ అంబుధిబాడబానలశిఖావశతాపము చెప్పఁ జంచు, ము
న్నెంబు, పయోజగంధి జగతీసుతనాసిక నాశ్రయించె; హా!
యంబుజసూతివాఙ్మిత వితానముకానె? దవప్రియమానపిప్రియో
గంబున మాన్చె నామెపిపాసగాటపుదూపుపుట్టగ్గ వేఁడుముల్. 84

క॥ కాని దని తెలిసినప్పు, డర
మే నుకో కాలిఁ, బక్కుమి త్తిగఁ గనుఁగొ;
మ్మేనుంగువంటిమానిసి
మీనుం గగుటయు ఘటిల్లు విటఖక్షమాతిన్. 85

క॥ పశు వెఱుఁగును, బా మెఱుఁగును,
శిశు వెఱుఁగును, గానరసము; జీవులకున్ శ్రు

త్యశస మగుః సీసుధాధా
రశక్తు, మ్రోకులు చిగుర్చు, రాలు గరంగున్. 86

ఉ. ఇల్లీలు మార్చి, దుష్టపితసృష్టికిఁ దప్పఁగ, దాఁపఁగా వలెన్;
మల్లరణంబు సల్ప వలె, మాటికిఁ జావఁ దెగించి, గంతుతోఁ;
బల్లులుఁ దొండ లాది యగుప్రాణుల వేఁటను నేర్వఁగా వలెన్;
బిల్లలఁ బెంచుకష్టమునఁ, బిల్లికిఁ జాలినతల్లి యున్నదే?

శా. బాగత్యల్పము, నో గనల్పమును, విశ్వంబందు నెం; దందుచే,
యోగుల్ నేరుతు రేమొ కాని కన బా, గో గెల్లరుం గంట్రు; జం
టేఁగల్ సల్పునసన్యసాధ్యజగమత్కృష్టోపయోగశ్రీమో
దోగం బెన్నక, వాని లోభు లనుచున్ దూషింత్రుగా మానవుల్.

చ. పొనఁగమి తిర్యగావళుల బుద్ధి, సమానగుణంబె యన్నిటన్;
నినుఁగులమీఁదఁ దండ్రిలకు నెమ్మదిఁ బ్రేమము లేమియు, నన్నిగ
పరిసరములందు, నెందు బహుధర్మత తల్లులకుం, గనంబడున్;
బసర మటన్న, నీచపరిభాషణ మాటకు, నివ్వె హేతువుల్. 89

క. ఒత్తుగ మొలచిన మొలకలు
చెత్తే సుమీ; లాభ మేమి చేకుఱదు తదు
త్పత్తిని; వైరస్యమున నె
యుత్తమఫలములు లభించు చుండును సృష్టిన్. 90

ఉ. దూరమునుండి చూచినను, దోరపుగుండ్రనిపొర్దుదిర్గుపూ
తీరయు, చేరఁ బోయినను, దీవియ లాందరునందుఁ గోరకా
కారమునం దనర్చును; గావునఁ, గన్నులు దెల్పుసాక్ష్యమం
దారయఁ, గొన్నికొన్ని విషయంబు లసత్యము లయ్యెడుం జుమీ.

క. కామాన్ధులకు బలె,
సోమార్లకు నిదుర్వు లగును జుమ్మీ జాముల్,

యామినులు సుషుప్తికి బలె,
వామనములుగావె యన్ని వ్యాపారులకున్? 92

క॥ ధారుణిని మేఁకపోతుం,
బూరేకుంబోతు, బోగపుంబోతు, వృథా;
హారయ, నీముల్లెగ సా
ధారణముగ గరుడ మూఁడుదానిక చెల్లున్. 93

ఆ॥ మూఁకే నడదు కన్ను; బోన మేమియు నైఁప;
దొకటి పలుకఁ బోవ నొకటి వచ్చు;
నోడల విఱుప్పు, నడలఁ దడఁబాటు, గోవాళ్,
కల్ల మాక్రిమించి యున్న యుసరి. 94

చ॥ జనకునిఁ దక్షకోరగుఁడు చంపినకోపముచేతఁ ద్రాఁచులన్,
మును జనమేజయుండు, బొక్కిపుచ్చఁగ జన్న మొనర్చు టబ్రమే?
వెనుకను వేసినో కఱచె నెట్టి దొకం డని, వేఁపు లన్నిటిన్
జనపతియూసతిన్ హతము సల్పుచు నుండఁగ మాలమాదిగల్.

క॥ చేఁపలవంటలకంపులు,
వేఁపులగుంపులును, గోళ్ళవిష్ఠలు, బూతుల్;
కాఁపులకొంపలపొరుగున
బాఁపలకాఁపురము, నరకపాతము సుమ్మీ. 96

ఉ॥ ఆదివరాహమూర్తి, కనకాక్షునిచేఁ బ్రిలయాబ్ధిమగ్న యా
భూదయితన్, సముద్ధరణముం గొనకోఱ నొనర్చె; నైన దా
యాదకులంబువాని, కకటా! ప్రతివాసరము, న్నిసాదని
ష్పాదితదారుణజ్వలితపావకదాహముఁ బాపఁ బోడు సూ. 97

క॥ ఘాగయణువు, లావిరణువులు,
నిగపుదుమారంపుటణువు, లే ఋన్నతపున్

నగముసిగనుండి దిగువడి
నెగయునణువు, లణువు లఖిల మిట్లని తెలుపున్. 98

క॥ మంగళసూత్రింబులయం
దుం, గౌరియురంబునందుఁ దూఁ గాడెడుబో
ట్టుంగన, పెం క్లీ డిదె యం
చుం, గుదురుల రెంటిఁ బోలుచుం బ్రకటించున్. 99

క॥ మొదలను వెన్నెల, చీఁకటి
పదపడి, యగు రేయివంటిబ్రదుకునకంటెన్,
దుదనజికో, తుదకో, వెన్నెల
మొదవెడు రేవంటిబ్రదు, కనుత్తమము సుమీ. 100

---

క॥ గుడి గాదె నీదుశిల్పము
పిడుఁదులు, పొక్కిళ్ళ గజప బిడ్డకు ప్రాలం!
దొడి పగునొరవడి సుమి యే
యెఱుకకుఁ గానీ, త్వదీయసృష్టి; మహాత్మా!

ఉ॥ అత్మీయుగంబు దేవరకు నర్కుఁడు సోముఁడు నందురే! సహ
స్రాక్షుఁడ వంచుఁ దెల్పునిగమాంతపుఁబల్కుల కేమి దారి? యా
పత్తమునన్ మదీయ మగుభావముఁ జెప్పెద, నొప్పొ తప్పొ; మిన్
బుఃఖము లెన్నొ, యన్ని భవదీక్షణముల్ గఁ దలంతు నీశ్వరా!

తే॥ వివిధవిషయప్రసక్తిని వేఱు వేఱు
తఱుల రచితంబు లైనపద్యములు కూర్పఁ
బడినవసురాయచాటుప్రబంధమందు
మూఁడవ దిది ప్రాస్తావికము ప్రకరణము.



వినతాంగులనాభీ స్థనదేశము। గనుఁగొని పొందకు కామావేశము;
వనుకొను "మాంసవసాదివికారము। తనువఖిలంబును" యని ప్రతివారము
నళినీదళగతజలకణ మెట్టులు। చల, మీజీవము చంచల మట్టులు;
తెలియుము, జగ మాధివ్యాధిహతము। కలుషశుచాహంకారకబళితము

పాఠాంతరము.

సరసిజనీదళజలకణ మెట్టులు। తరళము, జీవము తరళం బట్టులు;
మరిజగమురుగభిమానగ్రస్తము। నరయుము శోకనిహతము సమస్తము॥
ధనసంపాదన మొనరించెడితఱి। నెనరూనుచు బరిజన మెక్కుడుగుఱి
వెనుకను జర్జరతనుఁడై బ్రతుకుడు। మనికికి నేమము విన రాఁడొక్కఁడు॥

---

మపేట దివాణమున నుంటిని. ఆగ్రామమునకు దాదాపు క్రోశము దూరములో భీమకోసుపాలెమను నొకపల్లెటూరు గలదు. అందు భాగవతి హరిశాస్త్రి లనుప్రసిద్ధవైయాకరణు లుండిరి. వారియొద్ద వ్యాకరణశాస్త్ర మభ్యసించుటకు దూరదేశములనుండి విద్యార్థులు వచ్చి, శాస్త్రిలవా రున్నది కుగ్రామ మగుటవలన దొడ్డమపేటలో వారములు చేసికొని ప్రతిదిన మాయూరికిఁ బోయి చదువుకొని వచ్చుచుండిరి. ఆవిద్యార్థులలోఁ గొందఱొకనాఁడు మధ్యాహ్నము దివాణములో భోజనము చేయుచుఁ గావించుప్రసంగములో వారొకచేరువగ్రామమున సంపన్ను లగువైశ్యులయింట జరుగువివాహమున సదస్యసంభావనకు వెళ్లినట్లును, కవిత్వపరీక్షార్థ మీయఁబడినసమస్యను బూర్తి పఱిచినట్లును, జెప్పుకొనుమాటలు తత్ప్రాంతిని భోజనము చేయుచున్న నాచెవిని బడినవి. అందుమీఁదటఁ దత్సమస్యను గుఱించి వారిని బ్రశ్నింపఁగా సభాధ్యక్షు లగుభాగవతివాసుదేవశాస్త్రిలవారు "శ్రీదక్షపురీనివేశశ్రీభీమేశా" యను కందపాదము నిచ్చి పద్యపూర్తి గావింపుఁ డన్న ట్లుత్తర మిచ్చిరి. సమస్య యనునది విపరీతార్థము గలదిగా నుండవలెనే యిది యేటిసమస్య యనుకొనుచు నిట్టివి గూడ సమస్య లనఁబడవచ్చును గాఁబోలు నని తలంచి నేను గూడ దానిని బూర్తి పఱుపఁ గోరి భోజనానంతరము వాసుదేవశాస్త్రిలవారియొద్దకు వెళ్లి కందపద్యలక్షణము నేర్చుకొని శ్రీదక్షపురీనివేశశ్రీభీమేశా యనుమకుటముతోఁ బదిపండ్రెండు పద్యములు చేసి తద్గురుసన్నిధికిఁ బంపితిని. ఆపద్యములలో నాయన యేమియు విశేషము కనిపెట్టిరో గాని నీ వింకఁ గొన్నాళ్లకు మంచికవి వగుదు వని నన్నాశీర్వదించిరి. ఇప్పటికి నావయస్సు 13, 14,

ఆ లెవ్వతె? నీకాత్మజుఁ డేఁడుర! చాల విచిత్రము సంసృతి, వేఁడుక!
నీలోఁ జూడుము నిజము వేయన। కాలిజనుఁడ? యెటవచ్చితి? యోయన॥
సంగ మడంగును సత్సంగమయుతి। బ్రుంగును సంగము, మోహా-
చ్ఛాయహృతి;
దుగ్రిఁగిన మోహము, తో, స్థిరతత్త్వము। భంగుర! యటజీవన్ముక్తత్వము॥
కడచినవయసెటఁగామవికారము? । జడమింకెడు నెక్కడఁగాసారము
నెడయనోడమి, కల దేపరివారము। పొడమిన జ్ఞానము, చెడు సంసారము॥
ధనజనయౌవనదర్పం బేలా!। తునుమును గాలము తృటి నది; బేలా!
అని "మాయామయ మఖిలము"నిది విడి। కని బ్రహ్మపదంబునఁ-
జొరు విడివడి॥హరి॥ 14

రేపులు, మాపులు, రేలు, పగళ్ళును। దేపఋతువులరుదెంచును వెళ్ళును
నైపుణిఁ గాలముసూపెడు; నుగమఱు। నీ! పాశానన శింపదు, పగవరు॥
ఇరువులు, మంజరులీపం డ్రెంపును। గురుబోధమునకు గోడులు చెందును
గరుణనువై యాకరణము నిఁగనిమును। పరమగురుఁడు శంకరుఁడివిపినిచెను

---

పూర్వాంధ్రీకరణపద్యములను బోలిన వితరులవి కూడ ననేకము లుండుటం బట్టి వానివి మాని యీనవీనాంధ్రీకరణమే యిందుఁ జేర్పఁబడినది. పాఠక వినోదార్థము మరియొక బాల్యస్వరూపప్రకటనముగా ముక్తిదాయకములో నిక్కృత్యాదిపద్యముకటియు, ద్వాదశమంజరిలోని దొకటియు, నిందుఁ గనఁబఱుచుచున్నాను.

ఉ॥ శ్రీకర వాస ఫేనముల చేఁ జెలు వొందిన సువాస్సధాసము
త్నైకమ జన్మభూమి యయి, శ్రీమదనంతధరాధరోత్తమాం
గాకలితప్రదీప్త మణికాంతపదుండు గభీరుఁ డయ్యె, భం
గాపలవర్జితుం డగు దయాంబుధి దాశరథిం దలంచెదన్.

చ॥ విడిముడి గల్గఁ గల్గు జడు; పింతియు కాక, సుఖంబు సున్నయాఁ;
గొడుకులవల్లనైన నగు గోరము; లీగతి యేరికేనియున్
విడుపక వచ్చుఁ; గాన, విడి విత్తము మీఁదియపేక్ష, మూఢుఁడా!
వెడఁగుఁదనంబు మాని కఱిచేలువు మే లొనఁగున్; భజింపుమా.

కోరిక మోహము క్రోధము లోభము దారిచిక నమాత్మను బహులాభము
నారకి మాత్మజ్ఞానవిహీనులు। చేరి పరితపించెద రట దీనులు;॥ 33
అనువినునామసహస్రము, గీతలు। కనుమది హరివిగ్రహమును, జేతలు;
మను సజ్జనమైత్రిని నీవనయము। ధనమిడు దీనులకును, గొనివినయము॥
కని మూషకకృష్ణకరణేధ్యాయికి। బొనరచి రిహపరముల నెఱపోయికి
ననఘులు రంకినుసంతేవాసులు। ఘనబోధము నిటు కరుణాదాసులు
మూలశ్లోకంబులవలెఁ దెలుఁగున। గాలినమంజరికల్, సుచిగలుగున
వేలము; భజనోపంసములకుఁ గవి। హాళిని వసురాయండు పలికె నివి॥
ప్రాయంబఱువదిపై నేడేండులు। న్యాయమున వివి హరిభక్తికిఁ దోడులు
హా! యనుకూలప్పుటడనున సిరిపతి। నేయమ్మున వసునిఁ బనిచె వరకృతి॥

---

(28—9—1917. ఉత్తరరామచరిత్రనాటకముప్రథమాంక పద్యములు)

క॥ ఆకాంక్షించెదము నమో
వాకం బిడి గురుజనులకుఁ బ్రాచీనులకున్;
మేకొని యొసఁగ మే మమృతను
బ్రాకటముగ నాత్మకళను వాచాదేవిన్. 34

తే॥ వశ్యురాలయి నిరతానువర్తనమున
వాణి యేవిబుధున కుండు వదనమందు,
రచిత మతనిచే నుత్తరరామచరిత;
మభినయింతుము మే మది యాంధ్రమందు. 35

క॥ రామునిమాతలు వోయిరి
జామాత యొనర్చుచున్న జన్నంబునకున్
క్షేమవిధాయి వసిష్ఠుఁడు
రా, మున్నరుంధతీపురస్కృత లగుచున్. 36

క॥ తనుజాత దశరథునకుం
జనియించెను బూర్వమందు శాంతా యనంగన్;
జనపతికి రోమపాదుని
కి నొసంగె నతం డపత్యకృతికై నామెన్. 37

తే॥ వ్యవహరింపంగఁ దగు సర్వపద్ధతులను;
దూషణాభావ మనునది దుర్లభంబు,
పలుకులయు మఱి చిలుకలకొలుకలయును
సాధుభావంబునందు; దుర్జనులు జనులు. 38

క॥ వైదేహికిఁ గూడను నప
వాదంబు ఘటించినారు పలువలు; తత్క్ర-
వ్యాదగృహస్థితి మూలం
బౌదాని; కనిశ్చయంబ యగ్నివిశుద్ధిన్. 39

ఉ॥ వీనర లోనిస్నేహమున వేడ్క ఘటింపఁగ వచ్చి, యిన్నియున్
వాసరముల్ మహోత్సవమునన్ జనకుం డిటఁ బుచ్చి, యిప్డు వి
చ్చేసె స్వదేశ; మందులకుఁ జింతిలు దేవిని నూఱడింప, ధ
ర్మాసనమందు నుండి మనుజాధిపుఁ డంతిపురంబుఁ జొచ్చెనున్.

క॥ తా నిత్యానుష్ఠానవి
ధాన, మవహరించెను న్వతంత్రిత; సన్మా
ధానులకున్ గార్హస్థ్యము,
చాన ! బహుపరిశ్రమాయసంకటము గదా. 41

క॥ కనియెను విశ్వంభర నినుఁ;
జనవిభుఁ డజనన్నిభుండు జనకుఁడు నీ; కే
నును సవిత్రుఁడు గురు లని పే
ర్కొనఁ గాలమున జ్యేష్ఠ కీవు కోసలపు సతీ ! 42

క॥ శాంతికిసాధుజనంబుల
వా, కర్థము ననుసరించుఁ; బ్రాచీనులు న
పాకృతు లసబుద్ధులమహ
త్పాకలితప్రవాహ్యు, నర్థ మనువర్తించున్. 43

తే॥ ఆంక పశీఖమి మే మింట, నల్లునత్రి
యాగమునఁ; బిన్న వీవు; రాజ్యంబు గొత్త;
ప్రజలయనురంజనమున భావంబు నిలుపు;
స్థిరయశంబ కదా మీకుఁ బరమధనము. 44

క॥ లోకారాధనమున క
స్తోకస్నేహంబు దయయు, సుఖముగ, గడకుం
భూకన్యఁ గూడ, విడిచితి;
నా కావెత లేశమును గనన్ రాదు మదిన్. 45

ఆ॥ పుట్టువున నె పరమపూతాత్మురా, లీమె
కిక్క అగునె పావనాంతరంబు?
లన్యములను శుద్ధి యర్హ్యమా నెట్లు, తీ
ర్థాంబువులకు నైన, నగ్ని కైన. 46

క॥ పలువలు లోకులు; వారిం
గులధను లలరింప వలయుఁ; గూడనినుడి నిన్
బలికితిమి; తావిపూవుం
దలఁ దాల్చుట తగును గాని తన్నం దగునే?

ఉ॥ వేలకొలందిఁ యబ్దములు వేధ మొదల్ బలువేల్పు లెల్ల, ను
ద్వేలముగాఁ దపంబులను వేదహితార్థము చేసిచేసి మున్,
పోలఁగ నప్పురాణగురువుల్, చిరత స్తతపోమయంబులన్
గ్రాలునస్వకీయ తేజములఁ గాంచిరి వీనిఁ; గురంగలోచనా. 48

క॥ బంధుగుల, వసిష్ఠాదుల,
సంపదల నీరాజించి, గౌతమాత్మజుండు శతా
నందుఁడు జనకపురోహితుఁ
డిం కర్పించెదను చూడు; మిందువిభాస్యా! 49

ఆ॥ జనకరఘుకులములసంబంధ మొకనికి
నధికతరముగాఁ బ్రియంబు గాదు?
నాతయుం బరిగ్రహీతయు నయ్యె, ని
కార్యమునఁ దనంతఁ గౌశికుండు. 50

చ॥ సుముఖి! పురోధ గౌతముఁడు చూడు మిదే, భవదీయశస్తహ
స్తమును, గృహీతకంకణముఁ, దత్పృహితోత్సవ మొందె హావునా
సమరెడుదాని, మామకకరార్పితముం బొనరించు; నిచ్చఁ, ద
త్సమయమున ర్థమానమువిధంబయి, నాకు ముదంబుఁ గూర్చెడున్.

తే॥ తండ్రిగారు సజీవులై యుండ, దార
సంగ్రహము నూతనంబుగా జరిగి యుండఁ,
దల్లు లారయు చుండఁగా, నుల్లసిల్లు
నట్టియామనదినములు హా! గతించె. 52

చ॥ విరళతఁ గొందఁ బ్రొంతములు, నెల్తుల మొగ్గలు. మోను లెత్తుప
ల్వీరులను, ముగ్ధవీక్షలఁ, దలిర్చు మొగంబున బాల, వెన్నెలల్
గురియు స్వభావవిభ్రమపుఁ గోమలఘున్ మధురాంగకంబులన్,
బరమకుతూహలం బవుడు నాకును నంబలకుఁ ఘటించెఁ దాన్.

ఆ॥ ఎఱుకు తేనితోడ నెట్లు సంఘటిల్లెను
మనకు సఖ్యమున సమాగమంబు,
శృంగబేర మని ప్రసిద్ధిఁ గాంచిన పేరి
యూర, నిదియె, యల్లగారచెట్టు. 54

క॥ కొడుకులకు రాజ్యలక్ష్మల
నిడి, తమవార్ధకమునందు నిక్ష్వాకులు పూ
నెడుపుణ్యవనవ్రత మిది,
పడుచుండనమందె తాల్పఁ బడె నార్యునిచేన్.

చ॥ మును సగరాధ్వరంపుహయమున్ వెదుకం, ధరఁ ద్రవ్వి, కిన్కమం
డినకపిలర్షి తేజమున నీ ఱయి పోఁ బ్రపితామహుల్, తపం
బు నగణితాత్మతాపమునఁ బూని భగీరథుఁ, డెట్టకేనిఁ బా
వనభవదంబులన్ దడిపి వారి వియద్ధుని! యుద్ధరింపఁడే?

చ॥ అలసత నొంది వ_త్త లయి, యధ్వజఖేదమునం బ్రిముగ్ధమై
పలుబిగికౌఁగిలింతలను భాళిని మె_త్తన నొ_త్తినట్టిని
స్తులమృదితాబ్జనాళసముదుర్బలతావకకోమలాంగముల్,
చెలియ! మదీయ వక్షానురముఁ జేరిచి కూర్కితి గాదె యిక్కడన్.

తే॥ గట్ల, వాగులడరుల, వైఖానసులని
వాసతరు లొప్పునలతపోవనము లివియె;
శములు, నీవారముష్టింపచనులు, గేస్తు,
లుందు రాతిథ్యపరు, లిండ్లయందు నిందు. 58

చ॥ ఎలమిని లక్ష్మణుండు మన కెల్లసపర్య లొనర్పఁగా, ముదం
బొలయఁ దదద్రియందు సుఖ ముండినవాసరముల్ దలంతువే?
తలఁతువె, తన్వి! యచ్చటిసుధామధురామలవారిగాతమిన్?
దలఁచెదవే తదంతికనితాంతవిహారము లస్మదీయముల్? 59

ఉ॥ చెక్కునఁ జెక్కు హత్తుకొనఁ జేరికమ్రాఱఁగఁ గూరుచుండి, యొ
క్కొక్కకరంబుతోడ మన మొండొరు బిగ్గఁ గవుంగిలించి, చె
న్నక్కువతోడ నక్రమతమై నెవియెవ్వియొ ముచ్చటించుచో,
గ్రక్కున రాత్రియే గడచెఁ గా, తెలియంబడ కేగ యామముల్,

ఉ॥ దానవకోటిచేఁ గనకదంభమృగాకృతివంచనంగృతఁ
జానితివృత్త, మేర్చు హృదయుం, బది తూలిత మయ్యె; హా! జన
స్థానము శూన్య మాట, వివశస్థితిఁ గుందెడునార్యుచెయ్వులన్,
గాననగంబు లేడ్చె; నగ ఖండము వజ్రముగుండె యేనియున్.

చ॥ పెరిగినయూఁతిముత్తెములపేరటు, ధారగ మూఱి జాఱి, జ
ర్జరకణమై ధర న్నెరయుఁ, గ్రిందుగఁ, దావకబాష్పవారి; శో
కరయము హృద్భరంబు నరికట్టఁ దలంచెను హో; చలించునీ
చెరమలచేతఁ, గెంబెదవిచే, నది తోన సమానుమేయ మహా. 63

చ॥ ప్రియజనవిప్రయోగజము పెల్లుడికించున దయ్యె, నాఁడు నే
సయుఁచితిఁ దత్ప్రతిక్రియను జల్పమనంబున; నిప్డు మచ్చనుం
డి యెమునుపొక్కు నల్పకరణిన్, మనలం బహుదారుణంబుగా
నయయొ! తదుగ్రశోకదహనార్చులు మర్మము లేర్చె నాహృదిన్.

—•పాఠాంతరము•—

చ॥ ప్రియజనవిప్రయోగజము పెల్లుడికించునదయ్యెఁ, దత్ప్రతి
క్రియ నెటులేన మోఘ మొనరించుతలంపునఁ జేసి యత్తఱిన్
సయిఁచిన, లోనిదుఃఖదహనంబు పునఃప్రవిసవ్యమానహృ
ద్భయకరమర్మదుర్వ్రణముభంగిని నల్పు ననల్పవేదనన్. 64

చ॥ పటుమదమల్లికాక్షచలపక్షమరుద్విధుతోరుదండసం
కటములు పుండరీకముఁబు కైరవముల్ గలభూవిభాగముల్,
పొటపొట రాలి, బాష్పకణముల్ మఱి యూరెడుసంతరంబునన్,
గటకట! యిచ్చటన్ వికచకంజదళాయతనేత్రి! కాంచితిన్. 65

—•పాఠాంతరము•—

చ॥ పటుమదమల్లికాక్షములపక్షము, లందు ఘటించుజెక్కలై,
కటగతిఁ బుండరీకములుఁ గల్వలుఁ, గాఁడలతో స్ఫురింపఁగాఁ

బాలుపాటు రాలి బాష్పకణములే, మఱి యూరెదుసంతీరంబునన్
గటకట; కంటి నీకొలుకుఁ, గాముని నంబలెఁ గంజలోచనా! 66

తే॥ అంజనానందవర్ధనుం డైనయట్టి
రామహోబాహుః గాంచితి, మెంతపుణ్య!
మిత్రనిమిత్రమమునఁ గదా, యెల్లభువన
ములును, మనమును, మని, కృతార్థుల మయితిమి, 67

ఉ॥ గమ్మన నేఱుమద్దులు, సిగ న్నిలువ న్నవనీలనీరద,
బ్బు మ్మగుమాల్యవంతి మది, యేతవహార్యమ; యార్యుఁడిచ్చుటన్
ఒమ్ముఁడ! చాలుఁజాలు; నిఁక తిఃపర మెత్తకు; నైపఁజాల; నా
కమ్మహింజావియోగ మకటా! పునరా త్తమున ట్లగుం జుమీ. 68

తే॥ శీతకరమయూఖములచేతఁ జెమ్మగిల్లు
సింధుమణిహారప్రశస్తి మొందుభుజము,
సాధ్వసశ్రీమజస్వేదజలకణంబు,
జవ మిడునట్లు నామెడఁ జేర్పు; తరుణి! 69

మ॥ అరయంజాలసుఖంబొ, దుఃఖమొ, పిమోహంబో, మఱినిద్రయో
విరియం బాటినదుర్విషంబొ, మదమో, విస్ఫార మిం కేదియో,
పరిమూర్ఛేంద్రియ మావికారము భవత్స్పర్శంబునం గల్గి, క
ల్కి, రో! చైతన్యము, ఘూర్ణమానమురుశక్తిం జేయునున్మాలమున్

తే॥ క్లాంతజీవలతాంతవికాసనంబు,
లింద్రియవిమోహనములు, సంతృప్తికరము,
లమృతములు కర్ణములకు, రసాయనములు
భావమున, కంబుజాక్షి! నీభాషణములు. 71

తే॥ పరిణయం బాది గృహమందు, వనమునందు,
బాల్యమునయందు, మఱియు జవ్వనమునందు,

యెలరు నీచే సనాథములై జగములు;
నాతి! విపదబ్ధిఁ బడె దీ వనాథ వగుచు. 78

తే॥ ప్రజల కిక్ష్వాకువంశంబుపట్లఁ బ్రియమె;
విధివశంబున నపవాదబీజ మొలచె;
జరిగె సంశుద్ధి యట్టు లాశ్చర్యభంగి;
నెవరు నమ్మెదు? రది దూరవృత్తము గద 79

ఉ॥ చిన్నతనాఁటనుండి కడుఁ జేరిమిఁ బ్రోది యొనర్చి, యిప్పుడీ
యన్నులమిన్న, నిట్టిపరిణామాపృథగాశ్రియ, నమ్మి నాయెదం
గన్నులు మోడ్చి కూరికెసుగర్భిణి, మృత్యువు వాతఁ ద్రోయు చుం
టి న్నివ నొందు పన్ని, గృహానీడజ సూనరియుం బలెం; గటా!

—• పాఠాంతరము. •—

క॥ ప్రోచి చిననాఁటనుండి, క
టా! చిరమైత్ర్యపృథగాశ్రియను బ్రియను, మిషన్
ద్రోచెదను మృత్యుముఖమున,
నీచుఁడు సౌనకుఁడు గృహ్యానీడజఁ బోలెన్. 81

ఆ॥ ముద్దరాల! నే నపూర్వదుష్కర్మచం
డాలుఁడను; త్యజింపు నను త్యజింపు;
మంచిగంధపుంద్రుమం బని చేరితి,
విధివి దుర్విపాకవిషకుజంబు. 82

ఉ॥ ఘోరపుదుఃఖముం దెలిసికొంటకు సంఘటితంబు రామునం
దారయఁ జేతనత్వము; కటా! మతి యెందులకేని కాదు సూ;
చీరుచు నూర కాయములఁ, జీకును ఛిద్రత లేని ప్రాణముల్,
సారపువజ్రకీలములచందమునం దనరుం దిరంబులై. 83

—• పాఠాంతరము. •—

తే॥ దుఃఖసంవేదనార్థంబ, దృష్టిహీనుఁ గనిచెఁ,
దథ్యముగ రాముడును జైతన్య; మకట!
చీలుమచు మర్మములు, సర్వకీలములకు
దీటు వచ్చెను బ్రాణముల్, స్థిరము లగుచు. 84

కం॥ అలనా రెల్ల మహాత్ములు;
కలుషాత్ముఁడ; మేలు మఱచు ఘాతకుఁడను నేఁ,
దలపెట్టితిఁ దన్నామము,
గొలఁ దాఁకినయట్లు నా రగుడు దనుకొందున్. 85

చ॥ ఒరగి యురస్థ్సలంబునఁ దయో! నెఱనమ్మిక నిద్రఁ గూరుచు
స్ఫురితకఠోరగర్భభరఁ, బుణ్యసతిం, గృహలక్ష్మిఁ, బ్రేయసిం,
గరుణఁ దొరంగి మత్కరయుగంబున నల్లఁ దొలంగఁ ద్రోసి, ఘో
రరగహనంబునందు బలిగాఁ బొలదిండులపాలు చేసెదన్. 86

ఆ॥ అంచితోగ్రతపులు, యమునానదీతీర
వాసు, లఖిలలోకవంద్యఋషులు,
లవణభీతిచేఁ జలాయుతులై, యిట
నిన్ను శరణు చొచ్చి యున్నవారు. 87

కం॥ జనకరఘూద్భవకులజన
మనీషితాశేషగోత్రమంగళ మగునా
మెను, బుణ్యదేవయజనం
బునఁ గాంచితి వీవు, వినుతపూతచరిత్రన్.

(ఇతరాంకములలోనివి.)

మ॥ కరటుల్ చెక్కులతీఁట వోవ నొరయం గంపించి, ప్రాంతాళిప
ట్టురుఘర్మంబున నల్కి రాల్చిరులఁ, జేయుం బూజ గోదావరీ

ర్షుణికిం. గూలకులాయభూజతతి, కూజత్కాంతకాపోతమై
బరఁగుల్ నీడల ముక్కులంగిలుకుచుం బత్తుల్ దివం బుర్వులన్.

ఉ॥ చాపముఁ గంకపత్రములు సోఁకెడుతూణయుగంబు వీఁపునం,
బూఁడిదయుం బవిత్రమును బొల్చునురస్థ్సలి రౌరవత్వచం,
నీశితవార్ధ్వకాంచి బిగియించినమంజిటిపుట్టమున్ గటిం,
బోఁకిమి విల్లు నమ్ముసరముం గయిఁ బైప్పలవాఁడ మొప్పెఁడున్.

ఉ॥ జ్యాపటుజిహ్వ, యుత్కటతరాటనిసంష్ట్రిములం బెనంగొనం,
ద్రేఁపును బోలె గర్జితసదృక్షునఘుర్ఘురఘోష మొప్ప, నీ
చాపము, గ్రాసలాలసహసన్మహిషధ్వజపక్ష్మియంత్రిజృం
భోపమవిస్మయావహమహోదర మయ్యెడుఁ దత్క్షణంబునన్. 91

విభిక్షేతరాంధ్రికరణములు.

చ॥ తొడిగినచెప్పు కూర్చ మగు ధూర్జటిమేనికిఁ, బుక్కిలించి తూ
పొసుచుజలంబు శంభున కపుం బరమామృతసేచనంబు; మున్
గఁడిచినవంజు హా శివునకున్ నవ మానుపహార; మేది యె
వ్వఁడువునఁ గాదు భక్తి? భవభక్తవతంసుఁ డహో! కిరాతుఁడున్.

మ॥ ఘనమోహాటవి సంచరించు నెపుడుం, గాంతామణీపీవర
స్తనదుర్గంబులయందు గంతు లిడు, నాశాశాఖలం దూఁకు, నా
మన సన్నిల్కడలేనివానరము? సాంబా! భక్తి బంధించి నీ
వెనువెంటం గొనిపొమ్ము దీనిని శివా! భిక్షూ! కపాలీ! విభూ!

ఉ॥ జక్కవ లూఁబటల్ గనఁగ, సారె చకోరము లారగింపఁగాఁ,
బొక్కిలిదీగ్గితమ్మివెలిమొగ్గరవి ప్పరమోడ్పు నై, నగం
బోక్కవుఁ బాంచజన్య, మిరుజోతుల వెగ్గెడువెన్నుకన్గవం,
గ్రక్కున నంతరాయతిమిరచ్ఛట పాయ నపాస్తి చేసెదన్.

ఆ॥ ఓయి! చేతఁ బాత్ర మున్న తెర్వరి! నిలు;
జ్యోతిషుఁడవా? వెజ్జవో? మఱియు

పతి చిరప్రవాసి, వచ్చె నేఁడు! దత్త
యంధురాలు, కలదె యింజనంబు! 95

ఆ॥ అత్త మేలుకొన్న యది; వెలిగెను దివ్వె;
కంద్రు నాదుకౌతుకంబు సఖులు;
తాళు గడియ; నాథ! చాల నాఁకలిగొన్నఁ,
గేలుదోయి నారగింతురయ్య! 96

ఆ॥ అత్త మేలుకొన్న యదె! దివ్వె వెలుఁగునా!
కంద్రె యిదుకౌతుకంబు సఖులు!
తాళ మైన గడియ; చాల దూపిల్లినఁ,
దరుణి! కేలుదోయిఁ ద్రావుఁ డెవఁడు! 97

క॥ చతురులు కనఁ బఱుపం గల
రతథ్యములు తథ్యములుగ; నౌను జుమీ; యు
ద్భుతముగఁ జిత్రకళాపం
డితులు సమమునందుఁ జూపు నిమ్నోన్నతముల్. 98

ఆ॥ కనుము భాగ్యవంతుఁ; గనఁడు పండితు శూరుఁ;
బండితులును శౌర్యవంతులైన
యట్టివారు కుమారు లవుదు రౌలయు
గాసిలెదరు, తినుచుఁ గాయఁ గసరు. 99

క॥ తినుటఁ దలఁచుటఁ దాఁకుటఁ
దనతనబిడ్డలను మీఁదు, దామేలును, బు
ల్లును, నేఁడు; పిల్లె పంపిత
జనవృత్తులు నని వచింతు సర్వజ్ఞమునుల్. 100

క॥ స్తనములకాఠిన్య, మహాం
గనిరీతులకఱకుఁదనము, గవితాపాకం,

బహునిధి లోకములోపల
ననుభవరసికులకుఁ గాక యుండదు కేలు కా! 101

క॥ పసి మెఱుఁగును, బా మెఱుఁగును,
నిను మెఱుఁగును గానరసము; నిస్తులకవితా
రస మెవ్వఁ డెఱుఁగు! నెఱుఁగ
గ సమర్థుం డగునో కాఁడో గంగాధరుఁడున్. 102

క॥ త్రుటిపశవజృంభలందుం,
బ్రతుకుము, లెమ్మనుట, చిటిక వైచుట, సమయో
చితవిధులు గురునియెడ నేన్;
బతితుఁ డగున్ మిన్న కున్న పక్షమునందున్. 103

ఆ॥ ఇతరదుఃఖజాల మిచ్చు వచ్చినలీల
సంఘటించు; దాని సైఁతుఁ; గాని,
విరసునకును గైత వినిపించుతేఁ వ్రాఁత,
వ్రాయఁ బోకు, ధాత! వ్రాయఁ బోకు. 104

ఆ॥ ఉపనిషత్తు లన్నియును ధేనువులు, గోప
బాలకుండు పితుకువాఁడు, క్రీడి
లేఁగదూడ, బుధులు త్రాగెడువారు, గీ
తామృతంబు మహిత మగుపయస్సు. 105

ఉ॥ రాముఁడు పోరిలో భుజపరాక్రమముం బ్రకటింప, సవ్యమున్
వామ మనున్, "భుజింప మును వ, త్తని వెన్నడి దేల!" నా, "శిర
స్స్నమము రావణీయ మొకతూఁకునఁ ద్రుంతునో! యొక్కటొక్కటిం
గా మఱియింతునో" యని జగత్పతిఁ దా నడుగంగ నంచనెన్.

తే॥ సజ్జనునిచిత్తమును బోలె స్వచ్ఛ, మర్థి
లీలఁ దేలిక, యాత్మజాలింగనంబు

భంగిఁ జల్లన, తద్బాల్యభావమట్లు
తీయు, నైనసుగంధపానీయ మిమ్ము. 107

(క॥ కోపము రాదు గదా నీ
లోపముఁ దెల్పెదను, "నిచ్చలున్ నీచులతో
నే పొత్తు నీకుఁ; దొరికెడు
బాఁపనయి" ల్లనిన; లచ్చి పతికి ట్లనియెన్.) (సాంతము) 108

మ. కొని నాపోశనమున్ మదీయపతి నొక్కొక్కఁ; డంద ప్రాబాల్య మా
సనమం దుంతురు నాకు గిట్టనిసతిన్; నానాప నిచ్చల్ శివా
ర్చనకుం బేఁకుడు; మంచ నిం చటులు సర్వక్షోభముల్; నాథ; యే
మని నారిండ్లకుఁ బోవు? నొక్కరుఁడు కట్టా! తన్నె నన్నున్
మిమున్. 109

ఆ॥ క్రోతి; యూఁతకల్లు క్రోలి కై పెక్కఁగ;
దంమమీఁద దాని నంటఁ బొడిచె
బుట్టతేలు; పైగఁ బట్టెఁ బిశాచ ము;
చెప్ప వలెనె దానిచేష్ట లింక? 110

ఆ॥ గోళ్ళతోడ గోఁకిఁ గొండొక సౌఖ్యంబు;
వ్రేళ్ళతోడ నలుప వేయి సౌఖ్య;
ముడుకునీళ్ళు పోయు మండ నిం కొక సౌఖ్య;
మున్నిసుఖము లంచు నెంతు దురద? 111

ఈపై పద్యము మత్కృతమైనది ప్రాస్తావికముగా నే జదివినప్పుడు పెదపూడివాస్తవ్యు లయ్యగారి యుమామహేశ్వరశాస్త్రిగారు చదివినశ్లోకమునకుఁ దెలుఁగు.

ఆ॥ అండకండూతి నేసుఖ మావహిల్లు,
నట్టిసౌఖ్యంబు నీకు లభ్య మగుఁ గాక;

యందుమీఁదట నేదుగఖ మావహిల్లు,
నట్టిదుగఖంబు నీవైరి కగును గాక. 112

క॥ గుణము దిగంతములకు, మా
ర్గణతతి నీకడకుఁ బోక రాకలు నలుపున్;
గణుతింప నపూర్వమ్మిది
పుణి యిది విలువిద్య; నెట్లు పొసఁగెనొ నీకున్. 113

క॥ నీయు [illegible] మ్మొ నేఁ
డోయమ్మ [illegible] గి మొత్తుకున్; మానిసిగాఁ
జేయును దద్విజ మంత్రి; ప్ర
భూ! యేమంతరము దారువునకున్ శిలకున్? 114

ఈక్రిందిపద్యము [illegible] ంగ్లీషుపద్యమునకుఁ దర్జుమా.

క॥ నెనరులు తెలె [illegible] నవు
బరక [illegible] పోలిక [illegible] బైఁబై;
నరుగ నవె ముత్తియ బు [illegible]
నరయు [illegible] గాత్రించు [illegible] టంగిన్. 115

ది 20—9—1880 సంవత్సరప్రాంతమున విశాఖపురమండలవాస్తవ్యుఁడగు భాసూరిలక్ష్మీనారాయణకవి యనుదరుణవయస్కుఁడు శిష్టికరణకులస్థుఁడు ధారాళముగాఁ దెలుఁగుఁగవనముఁ జెప్పఁగలిగినవాఁడు రాజమహేంద్రవరము వచ్చినప్పుడు తత్కులస్థు లేలూరిలక్ష్మీనృసింహముగారు సభ చేయించునందర్భములో నీక్రింది పండితరాయప్రాస్తావికశ్లోకములకుఁ దత్సభయందలిపండితులును బైలక్ష్మీనారాయణకవియును నేనును దెలుఁగుఁ జేసినపద్యములు.

"శ్లో॥ కర్పూరధూళీరచితాలవాలః
కస్తూరికాకర్దమలేపితాంగః

వహ్నిర్నసీరై రభిషిచ్యమానః
ప్రాచీనం గుణం ముంచతి కిం పలాండుః.

శ్లో॥ మా గర్వ ముద్వహ బిడాల మహీపతీనా
మంతఃపురం మణిమయం నిలయం మ మేతి
పట్టాభిషేకసమయే తు మహీపతీనామ్
బాహ్యస్థితస్య కలభస్య చ మండనశ్రీః."

ఈశ్లోకములకు భాసూరి లక్ష్మీనారాయణకవివి.

ఉ॥ చాల హిమాంబుపూరమున జల్లి, సితాభ్రపరాగకల్పితా
వాలమునందు నాటి, ప్రతి వారము సారఘనంగ నాభజ
బాలముచేత దోహదము వాటిలఁ జేసి, యుల్లిగడ్డ కే
లీలను సౌరభోన్నతి ఫలించునె, యెన్నటికైన భూస్థలిన్?

మ॥ ఎవరత్నస్థగితావనీపతిలకాంతర్గేహసంవాసవై
భవగర్వం బది యేల నీకు? నృపతుల్ పట్టాభిషేకాధికో
త్సవకాలంబున బాహ్యసంస్థితకరీంద్రంబున్ విభూషించి గా
రవముం జేతురు; గాని, నీ మొగము మార్జాలాధమా చూతురే?

ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రులవారివి.

ఆ॥ కప్పురంపుమన్ను గల్పి పాదొనరించి
మృగమదంపుటనట మెదిపి నాటి
హిమజలంబు వోసి యెదుగంగఁ జేసిన
గబ్బు విడుట లేదు గదర యుల్లి.

తే॥ మణిమయం బగు రాజమందిరమున
నిలుతు నంచును మిక్కిలి నీల్గ కుండు
మాబిడాలమ! పట్టమహోత్సవమున
బాహ్యకలభంబు మండనప్రథ వహించు.

నావి.

ఉ॥ గమ్మని, తావి గ్రమ్మఁగొనుకప్రపుధూళిని బాదు చేసినం,
గమ్మనివాసనల్ నలచుకస్తురిపంకము పైని బూసినన్,
నెమ్మి హిమాంబుపూరమును నిచ్చలు నీరముమాఱు వోసినన్,
బా మ్మని యుల్లిగడ్డ తనపూర్వగుణమ్మును దోఁసి వేయునా!

ఉ॥ ప్రాకటభూకశత్రువినరత్నముయ బహురాణివానమే
నాకు నివాస మందును, ఘనంబుగఁ బ్రుళ్ళకుమా, బిడాలమా!
స్వీకృతరాజ్యసంపదభిషేకముఁ బొల్చు లొందు వేళ, న
వ్యాకిట నున్నభద్రకరభంబున కే సుమి ముఁడవానలుల్. 117

---

క్రిందిసమస్యాపూర్తి కవతారిక (సొంతము)

క॥ మగపోఁడి, మగువపోఁడిమి,
మొగములఁ బెక్కిటను దోఁచు; భూతేశుపమై
నగ వగుటఁ జేసి నీకును
నగ మాఁడుఁదనంబు గలుగఁ జూడరొ! నాథా! 118

మ॥ గెలుపుల్ తొమ్మిదినూర్లపైని బడి, బుగ్గిన్ శూలి కుర్తుంచె శీ
ర్షల, నట్లు బిక్కటుక, స్నహరరంధ్రక్షోణిస్ఫూర్జమ్మల, గన్,
గలిక! భూమను సాక్షిఁ జేసికొని యుత్క్రీడ; శేషించునా
తల లీతొంబది, కన్ను లీమెనుబదిం, దథ్యంబుగా వ్యర్థముల్. 119

---

మిత్రసమ్మానము. 29-8-1922

క॥ ఒసఁగెఁ నిడమర్తిదుర్గా
ప్రసాదరాయనికి, షష్టివత్సరపూర్తిన్
వసురాయఁడు దుందుభిని, శ
తసమల్ వర్ధిల్లు మనుచుఁ దనభక్తమణిన్ 120

క॥ ఎనిమిదిట సఖుఁడ! నీకం
టెను నే వయసునను బెద్ద; నెయ్యము మన కీ
చనుదుందుభిన్ నలువది
యెనిమిదియేఁ; డ్లగుట నెలమి నిటు దీవింతున్. 121

క॥ సంతు, సుగుణ మైశ్వర్యము,
సంతసము, బ్రతిభ, యుక్తిపటిమ, మధురకవిత్వా
సక్తరుచి, కవిత, మేల్మిని
దొంతిడ, నీశ్వరుఁడు నీకు దుర్గయు దాంకెన్. 122

---

మ॥ తెనుఁగున్ నాటక మేర్చుకొన్న మెరికా తెల్లుఙ్గ్మలున్ జిన్నకన్
"మునిసిస్నేహితుఁ" డంచు, నొక్కన పరే, మున్నాటకటెత్తోఁ
[టకున్,
జని • వాండర్బియరాఖ్య వెజ్జుఁ జొర వచ్చున్ దెల్పి, తోడ్తెచ్చి, మ
ద్వసితన్ మన్నిచెసార్థకాఖ్య! కొను* చింతారత్నమున్ శంకరా!

క॥ నీవయు నదె, నేయోంగ్లకుఁ
గా వచ్చెను నఱుప, డందుఁ గడపితి నసురా
సావాసమునఁ బరార్థము,
జైవాతృక! వక్కలంకశంకరరాజా! 124

క॥ ఆరోగ్యప్రార్థనముం
బారాయణ మాచరింపు ప్రతిపన మిందున్;
నీరోగత నీ కిడు నది
సారముగతి; వక్కలంకశంకరరాజా! 125

---

• ఈడాక్టరుదొరసాని కొన్నాళ్ళకుఁదర్వాత నవగా 1905లోనో 1906 లోనో న్యూడార్క్ఫుదొరు గారిని బెండ్లియాడి, యొకకూఁతుఁగని, పాపముస్వల్పకాలముననే హృద్వ్యాధిచే నాకస్మికముగ మరణించినది

*భక్తచింతామణి.

చెన్నపురినుండి మిత్రుఁడగు బోడపాటిరాజన్నగారు వ్రాసిన పద్యలేఖకుఁ బ్రత్యుత్తరము- 1883-

చ॥ పసమలబోడపాటికులపావనసార్థకరాజనాఖ్య! మీ
యుపతసవీఁ లేఖ నయనోత్పలహర్ష మొనర్చె నిన్నమా;
పిస సహజంబె గాఁ తనువు లెచ్చట నున్నను, నే స్తకాండ్రకున్
హృదయము చేరు వౌటఁ, గనిపింపదు దూరము; మిత్రరత్నమా!

శా॥ బీ. యెల్ క్లా ననుమాటఁ జూచువఱకున్ బేరారయన్ లేక, యా
రా! యెవ్వారిటు వ్రాయువా రనుచు, నే నాశ్చర్యముం బొంది, యెం
తో యానందము నొందితి న్మనమునందు న్మిమ్ము నారాబ్లూచి; యా
హా! యాహార్షము చెప్పఁగాఁ దరముటయ్యా మాటలన్? మిత్రమా!

క॥ *నాటకము పూర్తి యయినది;
యాటకు ననుకూల, మయిన, నచ్చు పడ వలెన్;
మాటలలోఁ గాను గదా!
మూటలు నాయొద్ద లేవు ముందే మునునో. 128

క॥ మనదుర్గయ్య, సవాశివుఁ
డును, బేరయ, జోగిలింగుఁడును, మొద లగువా
రనుదినము గసంబడరా!
యనుఁగా! వారలకుఁ గుశలమా యచ్చోటన్. 129

—• కవిత్వము •—

ఆ॥ చిన్నపోవుఁ గవిత, చెడి మాఖపర్వంబు,
బుధులు మెచ్చబోరు పోయి రేని;
కాన నాత్రిపడక, ఘనయత్నమున నల్ప
వకును కృతులు, వరను లా నసంగ. 130

*వేణీసంహారము.

క॥ కవి గానిపురుషుకంటెం,
గవికష్టసుఖంబు లెఱుఁగఁ గలుగం జుమ్మీ,
వివరించి తెలిపినప్పుడను
భవమున, నొడాళ్ళిలు గానిభామిని నరా. 131

క॥ చూలాలితనముఁ, బిడపను
బాలెంతతనంబుఁ దెచ్చి, ప్రసవశ్రమము
దూలించి, కందు, తల్లిం
దేలించు సుఖాంబుధిం; గృతియుఁ గవి నట్లే. 132

ఆ॥ గాలి వీచి, మబ్బు గ్రిమ్మి, చీఁదఱ గొల్పి,
గొప్పజల్లువాన గుమ్మరిల్లి,
హాయి గలుగఁ జేయు; నట్టులే కవి కొఱఁ
బ్రోధకల్పనాఢ్యపద్యభూతి. 133

ఆ॥ వావి గానిసతులకై వడి, జగతిలో
నాయురర్థకీర్తు లపహరించు,
నీవి యీనికృతు; ల టేల యపేక్షించు,
నభ్యుదయపరంపరాభిలాషి? 134

—• చిత్రకళ •—

ది 8-4-1923 రాజమహేంద్రవరమున జరిగిన చిత్రకళాప్రద
ర్శనమును జూడఁబోయి తద్విషయమున, రచించినవి.

మ॥ కవితాచిత్రకలావిలాసవతు, లక్కా-సెల్లియుం బ్రైసజా
హ్నవితోఁ, బార్వతితోడఁ, బోల్పఁదగుధన్యల్ ; చక్క నైనట్టియ
క్కవయుం దెక్కువతక్కువల్ దెలిసికోఁ గష్టంబ యౌ; నైన, మ
క్కువయాంధ్రం, బయిఁ బ్రిక్కఁ దాల్చునిటలాక్షుం డానో
(దక్షుం డటన్. 135

చ॥ ఒకపటమందు వీణియయు, నొక్కసరోరుహపాణి, యామె వే
ణికొనను దోఁటి లాగునొకనెమ్మియుఁ, జిత్రితముల్; మనోజ్ఞప
ద్మకలనఁడాయ వచ్చి, యచటం జడఁ, గాళభుజంగబుద్ధిఁ బ
ట్టుకొనె శిఖావళం బనునటుల్, కనువారికిఁ దోఁచులాగునన్. 136

కాలేజిప్రిన్సిపల్ కూల్డ్రియిదొరగారు చిత్రించి కనఁబఱిచిన వానిలో నెచ్చుగాఁ గన్పుఁ దన్పినచిత్తరు వర్ణనము 26-8-1917.

చ॥ అరకల రెంటి నాఁపి మడి, నామ్రముసీడను గూరుచుండి గొం,
తిరువురు దుక్కికాండ్రు భుజియింతురు కూ, డొకయింతి దేనెటన్,
శిర మర వంచి పాల, యొగుఁ జెట్టుపలం బద మూను మేఁడిఁ,గా
తరమటు లెత్తు వాలము మొదల్ పసికేర్, వలచిత్రిమిం పగున్!

తే॥ పద్యమును బోలె జిత్రంబు, భావపూరి
తం బగుచుఁ దోఁచునదియె, హృద్యమ్ము సుమ్ము;
దొర లిఖించినమూఁడుచిత్తరువులందు,
మడఁకచిత్తరు వెచ్చుగా మది నలర్చె. 138

తే॥ వన్నెలును భావవికృతులు, వానియందుఁ
జూడఁబడు నేని, నీడల కీడు వచ్చు
చిత్తరువు లుండునే! యెల్లచిత్రకరులు
వెలుఁగునకు శిష్యు లనుచు భావింతు మదిని! 139

---

## —• పరిషత్పత్రిక •—

మ॥ పరిషత్పత్రిక రాణ్మహేంద్రమహిభృత్పట్టాభిషేకాంధ్రవ
త్సరవర్ధంతిమహాసభాభినుతపద్యావ్రితముం బిప్పిగా
వర సెం;జీమలు వోలె సూక్ష్మదృశు లం దానందముం గంద్రు; తేఁ
టి రసంబున్ వెలి పుచ్చు కున్న, వనవాటిం బుష్పమున్ శప్పమే

ఆ॥ బెరయుసనముఁ బిండి పీల్చి పుంటను బౌఱ
వేయువానిఁ గాదె పిప్పి యందు?
సభ్యజనులఁ దనిపి, సంపుటం బెక్కెడు
వానిఁ, బిప్పి యనుట బాగె పతి? 141

క॥ పరిషత్ప్రతికిఁ దగునే
పరుషోక్తి? ఫలంబు తనకు పగ రైసఁ, బం
జరకీరము వినువారికి
విరసంబుగఁ దోఁచుపల్కు వెడలింపదు గా. 142

—— శృంగారము ——

సీ॥ కొదమరాచిల్క ముక్కున నొక్కఁగన వచ్చు
పచ్చిగంటులదొండపంటితోడ,
గండుఁగోయిలతొఁటికాటుఁచేఁ బాలు
చెమరించులవలీఫలములతోడఁ,
గలువనెచ్చెలికానికరము లొత్తుటఁ జేసి
కందుతామరకోరకములతోడ,
ననిలాతిసమ్మర్దమునఁ జెదరియుఁ, గ్రొత్త
సిరి మించునెఱజాతివిరులతోడఁ,

తే॥ బ్రిథమపాథోలవంబు లభ్రమున జాఱ
మొనయుగేదంగిపూమొనమురువుతోడఁ,
బోలిచి, తలఁచినమాత్రాన వలపు గొలుపుఁ;
దెలియ, దిది యేమివింతలేఁదీఁగ యొకొ? 143

క॥ పలుమొనలజిగు లకరులుగఁ,
బలుకులు తేనియగ, మునరుభ్రమరకములతోఁ

దిలకామోద మెసంగం,
గల, వేకువ నొక్కవికచకమలము దోఁచెన్. 144

ఆ॥ పాలవెల్లిఁ బచ్చిపగడంపుమొలకను
హాత్తె నేని యాణిముత్తియంబు,
లీను వచ్చు నేమొ, యీనస్మితానన
భానురోష్ఠదంతపంక్తిరుచికి. 145

తే॥ పుష్పవతులైనవెనుకను పూపపిందె
లేర్పడుట సాజ మౌఁగదా యెల్లలతల;
వింత! యీలతకూనకు వెనుకఁ గాక
ముందఱనె యవి బటువులై పొటమరించె. 146

తే॥ ముగుదనెమ్మోనియొప్పిదమునకు నడ్డు
పడినబాల్యంబుపైఁ, బుష్పబాణుఁ డలుక
పొడమి, యడరించునెత్తమ్మిమొగడజోడు
గుండ్లబారన, నెనఁ దోఁచెఁ గ్రొత్తచనులు. 147

క॥ భావింతు యువతికుచములు
లావణ్యపయోధివీచులం బుద్బుదముల్
గా వెనుక; నిప్పు డవి త
ద్గ్రావంబులో యంచు శంక గలిగించు మదిన్. 148

తే॥ కమలములపొత్తు సరసి జక్కవలకవుఁ
బగలు గలిగించుట గద స్వాభావికంబు;
కామినీమణి! లావణ్యసీమ వైన
నీయెడ నదేమొ విపరీతనీతిఁ దోఁచు. 149

చ॥ వలకయి నడ్డి నానుకొని, వామకరంబున దక్షిణాంసమం
దలిజలకుంభమంచును సుతారముగా మునివేళ్ళఁ బట్టి, ము

ద్రోలికెడుబాహుమూలరుచియుం జనుగుత్తులు నాస క్రొల్వ, ఱె
ప్పలు పయికెత్తి చూచె విటుఁ బైదలి, బేడిసబెళ్కుఁజూపులన్.

మ॥ నిను నీఁ డేమియుఁ జేయ లేదు గద; తన్వీ! నీవు సన్మార్గవ
ర్తినియుం బోలె, శిరంబు వంచుకొని దారిం బోవుచుం, బోక, ప్ర
క్కను గూర్చుండినవీని, స్నేహవిషదిగ్ధం బైన వాల్చూపుటే
టును వక్షంబున నేటవాలుగ వధూటీ! నాటి వేధింతువే! 151

సీ॥ వాఁడిగోళ్ళ నొసంగి వ్యాఘ్రసింహములకుఁ,
గొమ్ముటీఁటియ లేనుఁగుల కమర్చి,
దృఢవిషాణంబులు వృషభంబులకు నిచ్చి,
ఖరఖురంబులు ఘోటకములకు నిడి,
కుంభీనసములకుఁ గోఱలు దయచేసి,
వృశ్చికమ్ముల కిడి విసపుఁగొండి,
నీడోద్భవములకు నిశితచంచువు లుంచి,
తొండముల్ ఘటియించి తుమ్మెదలకుఁ,

గీ॥ బ్రకృతి, ప్రజలకుఁ దనవగ్గ బయలు పఱుప,
నట్టి వుడిగి, ప్రసాదించె నబలలకును
గలికిచూం; పది యామె, క్రేఁగంటఁ బఱపు
మాత్రి, మూర్ఛ మునుంగనిమగలు గలరె! 152

చ॥ పడి కెడు రెక్క నేరక, ప్రవాహములోపలిబేడిసల్, కడుం
దడఁబడి మిట్టుచున్, వెనుకఁ దగ్గుతెఱంగు గనంగ నయ్యె, న
య్యెడ ననురాగ ముబ్బ యితరేతరదృక్ప్రతిరోధకంబుగాఁ
బడఁతియుఁ బల్లవుం డొకరివట్టున నొక్కరు జంకుచుం గనన్.

క॥ శరములఁ బఱపి, పరస్పర
శరముల మరలించుబిరుదుసరిజోదులమా

దిరి, దోఁచె, మిథున మితరే
తర మారంభమునఁ బ్రేమ తలకొని చూడన్. 154

క॥ నునుఁజికిలిమెఱుఁగువాలిక
కనుదళుకులు, మదనునపదనుగలములుకులలా
గునఁ గరచు నురము మెఱముఁగఁ,
గనుఁగొని రొక రొకరిఁ జొరవఁ గామిని ప్రియుఁడున్. 155

తే॥ కలువపూవులు విలసిల్లఁ, గలితసాంధ్య
రాగమున లేఁతవెన్నెల పాఱకినట్లు,
వెలఁది, తెలివాలుఁగన్నులఁ బ్రియునిఁ జూచి,
సలుమొనలకాంతి కెమ్మోవిఁ బొలయు నవ్వె. 156

తే॥ ఉల్లమునఁ బుట్టి పట్ట రా కున్న ప్రేమ
మల్లెపూవులు గుప్పిళ్ళఁ జల్లినట్లు
బెళుకుఁదెలివాలుఁగన్నులతళుకు లెసఁగ
జెప్ప లల్లార్చి ప్రియుఁ జూచె నప్పొలంతి. 157

తే॥ ఎట్టిగాఁ గాఁచి గిన్నెఁ దో డిడ్డపాలు,
గడ్డ కట్టినకమ్మనికలువు కాదు;
ముదిత కెన్నాళ్ళనుండియో మదిని జేరు
కొనినయనురాగమున కది గుఱుతు కాని. 158

క॥ మగువను నుసిగ్గులేనగు
మొగమును గను చుండ, రేయి మొగుడు నెకన్నుల్?
జగతిని ముకుళింపవు గద
తొగపువ్వులు చందమామ తోఁచి వెలుంగన్. 159

చ॥ కనకము తన్ను లోకులు నుగంధము లేనిది యుంట కెంతయుఁ
గవలుచుఁ జంపకాకృతిని గైకొన, నప్పుడు కూడఁ దేఁటి యుం

టని డిది యేటిపూ వన, బడంతుక మే నయి పుట్టి, నర్వభూ
జననయనాళు లెంతయును సంతసిలం గొఱ లేక భాసిలున్. 160

క॥ ముక్కరఁ దాల్పనిసుందరి
ముక్కనుతన్, స్నానసమయమున నలిలంపుం
జుక్క నిలిచి, నను విడ కని
యక్కఱఁ బ్రార్థించుము త్తియము నా, మెఱసెన్! 161

క॥ రమణీరమణులు కూడుచుఁ,
దమతమరతిమేల్మితారతమ్యముకై వా
దము లాడ నగలరవమున,
రమణిని రతిరాజు కాంచిరవళిని మెచ్చెన్. 162

సీ॥ హిమవారిపూరసంకుమదాదిసంకీర్ణ
చందనచర్చికాసౌరభంబు,
సద్యస్సమానీతసంఫుల్లమల్లికా
చాంపేయ ముఖ్యపుష్పములతావి,
కనకరేఖాకల్పఘనవేణికాకల్ప
కైతకదళసముత్కరపు నలపు,
పర్యంకపార్శ్వ స్థపాంచాలికాకరా
గరుధూపవర్తికాపరిమళంబు,

గీ॥ నాదిమసమాగమప్రతిమానురాగ
తల్పసంగతమిథునమిథఃకపోల
ముకురలిప్త ప్రబోధనామోద, మొకటఁ
గమ్మవాసనలవారి ఘ్రాణమ్ముఁ దేల్చె. 163

వ॥ కళపెళఁ గాచువహ్నిశిఖఁ గ్రాఁగెడు రాగరసంపుటూష్మముం
బలె, సెక లీనునూర్పు లతిమాత్రముల్లై నిగుడంగ, సంగముల్

సలసలలాడ, గోర్కు లెద సందడిలన్, బయి మానవుంబిగిఁ
బొలయులుకం దపించుతరుణుల్, మరకాఁగులు మారుకల్మికిఁ.

—• చెన్నపురప్రదర్శనము •—

ఉ॥ ద్వారములందునద్దపురవాకులలో వెలిజంటతల్పులున్,
జేరఱ లన్నిటన్ మెఱపుపీవనదివ్వెలు వేత్రపీఠముల్,
బీరువ లద్దముల్ దెరలు వెల్ల పటాల్ తగుచోఁ గుళాయులున్,
గూరువిశాలహర్మ్య మొకకోనఁ బురిం బస రాయపేటలోన్.

చ॥ నడుమను మండువాపగిది నాలుగులాజులు; వానిఁ జేరి న
ల్గడలను నాల్గుపెన్గదులు, కచ్చిత మన్నిట బల్లకూర్పు, ద
ద్దడపునుసౌధ మంతపయిఁ, దన్ముఖపట్టము గచ్చుఁగంబపున్
వెడఁదనరెత్తుడాబ, బసపేరు వెలింగ్టను రాయపేటలోన్. 166

ఆ॥ ఉఱుము లుండవలదె మెఱుముతో ననియో, న
రంబి చేసె దద్దడంబు మాని,
మించుదివ్వెలబసమేడకు నధికారి,
కూర్కుహార ఉలుక గుబగుబలకు. 167

ఆ॥ అయిదుభూతములు నయత్నసిద్ధము లాది
మాంతిమంబు లెందు; యంత్రశక్తిఁ
గలుగు మలఁగు మూఁడు వలయుచో నడిమివి,
చెన్నపట్టణమునఁ జిటికలోన. 168

చ॥ తళుకనుమించుదీపములు, దప్పినడంచుకుళాయిధారలుం,
బలితపువైద్యుతవ్యజనమారుతసంచలనంబు గల్గి, చు
క్కల తెరువున్ స్పృశించుబహుగానసభాన్వితసౌధరాజి, రా
జిలుబహుచిత్రవర్ణములఁ జెన్నపురిన్ దొరయున్ ఘనౌఘమున్.

ఉ॥ నీళులఁ ధూమనావలును, నింగి విమానములట్లు, నిద్దపు
న్నీలవిశాలరథ్య గమనించెడువాయునమాన వేగపుం

జాలుపువింతమోటరులు సారటులుం బెనుటాంగ్రముకారులుం,
జాల సహాయకారులు బహుళమ్ముగఁ జెన్నపురీవిహారికిన్. 170

ఉ॥ అంబుధినీర మాఱివిశిఖావళిచే బడబానలంబు దం
దంబున, భాగ్యవద్ద్రవిణతండ మజస్రము చిత్రశస్త్రమా
ల్యంబునఁ బీల్చునాంగ్లవణిగాపణముల్ కవణిల్లుసౌధరా
జంబులు సింధునందనకు జన్మగృహంబులు చెన్నపట్టనన్ 171

తే॥ ఉదధికల్లోలముల ఘోష మొక్కపక్కఁ
బురము మోటారుకార్లచప్పుడొకవంక,
వికల మొనరించు వీనులఁ బికము దేర్చెఁ
జెలఁగి రక్తాక్షి మాఘమునఁ జెన్నపురిని. 172

తే॥ వడమినీలాలయొడ్డాణమున మెఱుఁగు
రవలు చెక్కినచక్కనిజవహారంపు
గాఁ గనంబడుఁ, జెలియలికట్ట వెలుఁగు
నబ్ధికల్లోలముల బెడఁగారునుఱుఁగు. 173

క॥ పరుగునకుఁ బందె మిడుకొని,
దరిపేరిటియాటతల్లిఁ దాఁకినతరఁగల్,
మఱుఁగునెపంబున నలుపుం
బరిహాసము శరధి, వెనుకపడుభంగములన్. 174

చ॥ ఎదురను దారసిల్లినసుహృత్తు నొహో యని పెద్దనవ్వుతో
నెద గదియించుమానవులయిష్టజనాదరచేష్ట దోఁచెమున్
మదిఁ; దరిఁ బ్రాకి వెన్కకును మళ్ళుకరళ్ళను సాముపట్లఁ బె
ల్లొదవెడుఘోషఫేనముల, నూర్మ్ములు రా జలరాశి వేఁకున్. 175

ఉ॥ వేవెలుఁగ స్తమింప, గృహవీథులు సౌధము లబ్ధివేల, దీ
పావళియుత్సవం బభినవాగతుఁన్ దలఁపింప, భర్మరం

జీవపుఁదోరణంబు లనఁ జెల్లుహొరంగుమెఱుంగుదివ్వెలన్,
శ్రీవిభవాభిరామ మగుచెన్నపురంబు మనోహరం బగున్. 176

చ॥ టకటకధావదశ్వఖురటంకపుటాంచలఘట్టనార్భటిన్,
చెకుముకిఁ బోలె రాకటికినేలను బెల్లడరన్ మిణుంగుఱుల్,
నికటధరాతలంబు బకర నేమిపరిభ్రమణంబులం, బృహ
చ్ఛకటఘటావిహారములు సాగును సాగరవేల సంజలన్. 177

సీ॥ వాలుగామయ మత్తవైశాఖ మగువేల,
నిటికి కూర్చున్నచూపఱనెఱకలు
నీలవినీలంపునీర, మూడాడను
దలలపై వెలిపాగ లలలనురువు,
లై యొప్ప నిశ్శబ్ద మావింతకంధిని
గంధికిఁ దోడుగాఁ గాంచునట్టి
భాగ్య మబ్బెను జెన్నపట్టణంబున మాకు
గాంధిమహాత్మునాగమమునాఁడు;
మున్న వచ్చిరి కన్నాట్ ప్రభుండు సతియు;
నుత్సవంబులమీఁదనే యుత్సవములు;
చెఱఁ బడియు, రాజధానినే చెందె భూరి
గౌరవము జోగి; దైవసంఘటన లరుదు. 178

ఉ॥ పున్నమరాపునం గలువపూదొర వెన్నెల గాయుచుండ; వా
రాన్నిధి పుత్రిశీతలకరస్పృశి జెంగటఁ బొంగుచుండ, వి
ద్యుత్సన్నిభదీపముల్ వెలుఁగుచుండఁగఁ, జల్లనిసైకతస్థలిం
గన్నులపండువయ్యెఁ బ్రజ గాంధిని జెన్నపురిన్ గణించుచోన్.

చ॥ పడమర భాగ్య, ప్రాగ్దిశను వల్లభుఁ డెల్లగ నోలి రెంటి కే
ర్పడుటను, గౌతమీసికటరాజమహేంద్రపురీలలామమున్,

నానిబీసెంటుదివ్యబోధాశ్రమమున
గొప్పవట మనుపెనురచ్చకూట మజుఁడు. 184

చ॥ అనుఁ గగువిశ్వసుందరబహద్దరుతోఁ జని చెన్నపట్టణం
బున హాయికోర్టులోఁ బని మ్యూజియము, మానిబిసెంటునాశ్రమం
బును, గనిమాకరలై బ్రిరిని, ఫోర్టును, పార్కు, బటానికల్ వనం
బును, విక్టోర్యహాల్, గుజిరిమూరుబజాఱులు, బీచిఁ జూచితిన్.

చ॥ రతనములం దొకండ వని రాజమహేంద్రమునందుఁ బోలె, గ
న్యాత నుక రాస్వకీళ్ళగణమందును నందను గంటి లక్ష్మవా!
ప్రతిభ త్వదీయ మెంచి వసుఁరాయఁ డొనంగువ కాల్గునామ, స్వీ
కృతి యొనరింపు మిత్రమ! రమేశుదయన్ జయ మస్మదీయ మా.

—• వివిధములు. •—

తే॥ పక్కములచిప్ప నిండను, బనియగాల
డబ్బులను బోసి, బల్ల సిడంగ, నుట్టి
చేర్ల ఁగి రేయి డబ్బులు చెసర ఘండఁ,
జిప్ప నట్టెక పైఁ జేర్చి జిత్తె మెలుకే. 187

ఆ॥ గోలకొండతురకకొడుకు బాఁపనిఁ జూచి
"మొందు సీదు దేవు డెసఁకు" ననిన,
నిన్నుఁ జూపి కాదె జన్నిగ ట్టనాఁడు
తురకత్రు శ్నపంచె దూలగొండి! 188

ఆ॥ ముక్కు నోరు నొకఁడె మొక్కకు; నేనుంగు
కరముతోడఁ బోలెఁ గాలితోడ
గాలి నీరుఁ బీల్చుఁ; గాన జిల్లు లమర్చుఁ
గుంకునదుగుప్రక్కఁ గుమ్మరీ డు. 189

క॥ మాయింటి కాఁడుఁబసుచును,
మీయింటికిఁ గోడలుం జామీ వైదిక! యీ

గేయాంధ్రకవిత; కాదేన్
మీ యెడ నద్దాని కపరిమితభయ మేలా! 190

క॥ ఏఁబదియేఁడుల రాజ్ఞీ
జూబిలిపద్యముల నంటిఁ జొక్కుచు, "వచ్చెన్
జా బొక్కనేబుకో" యని,
దూఁబలుకుం బల్కి "కెంటిక్యో" యన పలికెన్. 191

క॥ హిందూదేశంబునయం
దుం దొరతన మర్థకాంతి నొందిన సుగుణం బెం
పొందించికొన్న పెక్కుడు
లం దుందుభి చాటి పేర్చెలా! నిలువ నగునే. 192

— ఱైలు —

క॥ తనదరికి ధూమశకటము
చనుదెంచె నటన్న నంతనను కాదేన్, నం
దనఁ దక్కఁగఁ బొం గిటు ఫా
ల్గునమున మును గనిరె నిరరె గోదావరికిన్! 193

ఉ॥ ప్రాణము లేని దట్టు పొగబండి గమించెను వాయువేగమై,
ప్రాణము గల్గి పాఁతుకొనఁ బాడియె మా? కని, మూర్ఖులెగ్గడం
బాణములట్టు తివ్వనను బాఱఁ దొంకొనెఁ గొన్ని క్రేవఁ గ
ఖాణములట్టు కావ దిరుగం దొడఁగెన్ మతి కొన్ని దవ్వులన్.

ఆ॥ ధూమశకటవేగ మే మని వర్ణింతు,
భూమిఁ గింటఁ బఱచుఁ బోవుచట్టి
పేవి గాని సాటి రావు దానికి నవి;
దానివంటి దొంటి దానినీని. 195

క॥ పలికన్నం బ్రతిభా
శాలి పరిధానుండు లేక జరగదు ధరణీ

పాలనము; చెంతఁ దంతిత
పాల నిలక రైలునడక భద్రిం బగునే! 196

క॥ అపసవ్యత, సవ్యతఁ, బా
దపతతి తిరుగు పెరఁ దోఁచుఁ దనకుడి నెడమున్,
విపరీతత్వంబును సరి
సృపగతి పొగబండి యొసరఁ జేయుఁ బాంథున్. 197

క॥ వలకడకో డాకడకో
కులాలచక్రంబు దిరుగుఁ; గుమ్మరియు మిరుపా
య లుఖ లఘుధూమశకటపు
గెలుకుల విపరీతగతుల గిరగిరఁ దిరుగన్. 198

ఆ॥ సీరుఁ దాగివి కడుపు నిండ, నీలితు గాలి
వాయువశతఁ గా నిరాయతంబు,
కుంజరోన్నతంపుటింజ ఁంపుహయంబు,
ఘోషహేషఁ బఱచుఁ గతఁగ మగని. 199

తే॥ కుముదములుఁ దారకలు నీట నమతఁ దోఁచి
పండువెన్నెలలోఁ బొగబండికెలన,
వెనుక కవి ముందు కివి పోవు; వేర మున్న
వారి తారతుఁ జెటి యొక్క దారి కాదె! 200

ఆ॥ కలువతేఁగెలార! కాంతునితో రేయి
నలువుజాగరంబు చాల దొక్క,
కన్ను మోడ్పరేమి కత? మింత పొద్దెక్క;
రైలురొదను నిదుర రాదొ మీకు.? 201

—॰ రేవుపొగయోడ॰ —

చ॥ తటమును జేరఁ గిమ్మనక దానికెడంబయి పెద్దయార్పులొ
చిటునటు ధూమనావ తెర లెత్తెను గాతమి నాడు టొప్పెడుం

యులు వడిమెన్; బిఱిందికడ నంటంగఁ గట్టినచిన్నినావ, పే
రలలను దల్లిఁ ద్రోఁ బడున మాపసిపిల్లయుఁ బోలె వెన్కఁ దో
ట్రిలుచును రాఁ గొడంగెను; గడిందివిచిత్ర మిదేమొ రూఢిగా
దాలుతఁ దటంబున న్నిలువఁ, దోఁచెఁ జరాచరభేదబుద్ధి వ
స్తులయెడ, నప్పు డన్న, నది సుంతయు నక్కము గాక యేదియో
పత్రిలయము పుట్టినట్టులు, ధరాజము, లిండ్లును, మేడలున్ మను
ష్యులవలెఁ బర్వ లెత్తె; నవు డూర్ధ్వతతీవ్రతరంగఘోష, పీ
నులఁ బడనీయ దయ్యె; దరి నోళుల సూపుచు నార్చుకుంటిగ్రు
డ్డులయతిదీనవాక్యముల; లోపల నుండక నిర్భయంబుగా
నెలుఁగడఁ డాపుపైఁ దిరుగు నాగరికాళికి, విస్ఫులింగముల్
వల దని బుద్ధిఁ జెప్పి గదులం జొరఁబెట్టెను; నిట్లు యంత్రపుం
బలమునఁ లోపలన్ గుబగుబధ్వనులుం, బయి నాళరంధ్రని
ర్గళదురుధూమపుంభుగభుగధ్వనులున్, వెనుకన్ ఝరంబునం
బెలుజలచక్రవిభ్రమఘుమంఘుమవార్ధ్వనులుం జనింపఁగా
వెలువడి ధూమనావ, శరవేగమునం జనుచుండు నప్పు, డ
వ్వలిదరినుండి వచ్చుపడవల్, పెనుగాలికి నెత్తినట్టి చాఁ
పఱుఁ గర మేటవాలగును, వంగి సలాములు సేయుభృత్యులుం
బలె నెదురయ్యె; నంత నొకవైపునఁ బైపయి మింట వింతవ
న్నెలగిలు లల్లలార్చుచును, నీళులజాడలు దేఱి చూచుచున్
మెలఁకువ నిల్చినిల్చి, నదిమీఁదఁ దటాలున వ్రాలి, తోన లే
చు లకుమకుల్ దనర్చెను, వసుంధర బంతులు దూలులాగు; పే
ర్వలనను, గుంపులై పఱద వచ్చెను మ్రాఁకుల కానఁ జెంది, బో
రలను బరుండి తెప్పల, శిరంబు లొకించుక యెత్తి, కాలు సే
తుల నలిలంబు వెన్కకును ద్రోయుచు, నెవ్వడిఁ బోవుచుంతకా
ఆలఘుజవంబుతో నెరకనై చను పెద్ద మొసళ్ళలాగునం

బొలిపిరి; లాఁతిచోటఁ, జెత్తఁబ్రోవుగఁ గొట్టుక వచ్చు తెప్పెపైఁ
బొలుపుగ నిల్చి యుండుఁ బసుపుపిట్టను కాకుల బారు, కట్టుప్రమాఁ
కులపయిఁ దెప్పవాంఛ ప్రియసిక్తంపులశీరున నుండెఁ; నొంటిచోఁ,
గలఁకను జెందని యున్న యుదకంబున దట్టపునుర్వ, ముత్యపుమా
డలవలెఁ గాఁగుపాలను దడింబుగఁ గట్టినమాఁగఁ జేన్ మదిం
దలఁపఁగఁ జేయుచుండె; నొకదారిని, మెత్తులు గుబ్బు వచ్చి కక్
దళముగ మొల్చి యున్న చిఱుఁపింకలచుట్టును, నీళ్ళ యోరదా
గులవలెఁ బూయుచున్న వెలిగొంగలు, పచ్చలరాగిడీలకుం
బొలఁతులు నుట్టుమల్లెవిరిమొగ్గనరంబులఁ గేసు చుండెఁ; ని
ట్టులు నదిసొంపు, చూపుచు నెటు లక్షల స్మ్రాదలంగ నీక, పె
న్నుళిలను బద్ధవస్తువులనుం బలె డిద్దరఁ దిప్పు చుండఁగా,
బలిమిఁ బెనంగులాడి పురివంకకు దానిని నే మరల్చుచున్,
గొలనఁ బరిభ్రమించి యళి, కొండొక ప్రస్ఫుటపుండరీకమం
దెలమిని వ్రాలువట్టు, లలదృష్టియు మారుతఘాతగాతమౌ
సలిలతరంగఘట్టితలసత్సితదండవిధాయిసాధమం
దలరుచు నిల్చి, దానిసొబగా మెతగాఁ గని, ♦ యాల, నల్లకా
పలకలకట్టడంపునదిపారమునం దెగువన్, ఘనాఘనో
జ్జ్వలజవాలుపొచ్చెతుమ్మములన వ్రాలి, పురాణపుజిడ్డిగోర్లు నె
మ్మెలకును సంతసించు, చటుమీఁదట*నార్ట్మనుపూరికప్పటా
ప్పాలవిడఁజాల్పుటుప్పరిగమూర్ధమునన్ క్షణమాత్ర ముండి, మున్
పిలుచను నాంజనేయుఁడు సువేలమునుండి త్రికూటపర్వత
స్థలమున దూఁకినట్టులు, పదంపడి యచ్చటనుండి దృష్టి, వే
వలకడ కట్టె క్రిమ్మఱి, చివాల్నఁ ♦ దవాలకచేరిమేడయా

♦ ఈనదీతీరప్రదేశపుగుఱుతు లనేకములు రైలు వచ్చినపిమ్మట మాఱినవి.

*ఇతఁడు 1884 సంవత్సరమున మిషన్ హైస్కూలు స్థాపించిన యమెరికా పాదిరి. నాయొద్దఁ దెలుఁగు నేర్చిన వాఁడు. ♦ ఇది గుండువారిమేడ.

దల కోకయుంజ వేసి, యట దాపున నున్నయనల్పశిల్పసం
కలితవిభాసురోన్నతమ్ముకఁడును తేశ్వరగోపురంబులం
గలుగుననేకచిత్రములఁగాంచుచుఁ, గ్రేవను వాలఖిల్యమో
గులవలె వెన్నముద్దపులుఁగుల్ తల క్రిందుగ వ్రేలుచింతచె
ట్టులపయి వ్రాలి, వెండియు నిటుల్ నదియోరనె పెద్దసత్ర, మ
వ్వల నెఱజాలదిబ్బ, లటుపై నలధాన్యపుఁబాక లాదిగాఁ
గలిగిన వన్నియున్ గనుతుగా గ్రహియించుచుఁ బోయిపోయి, కో
మలతరగారుడోపలసమాజమయావృతియట్లు చుట్టు నా
ర్మొలచిన *సీమచింతకుఱుమొక్కలవెల్లునవెల్లుదాన, నే
బలమున రాణ్మహేంద్రవరపట్టణ మిప్పుడు నాఁడునాఁటికిం
గళలను శుక్లపక్షశశికైవడి వర్ధిలుచున్న దింకవ
ర్ధిలఁగల, గట్టికాలెజి పతివ్రిమదంబునఁ గాలుమోపుచున్,
గలశేనవృద్దానిముఖకాంతికిఁ, బున్నమచందమామవె
న్నెలకును గల్వపూలవలెనే కనుదోయి వికాస మొందఁ, నె
చ్చెలులనుఁ దట్టి, "చూచితిరె స్నేహితులార! నభంబునందుని
శ్చలముగఁ బక్షయుగ్మమును జాఁచుక గౌతమియొద్ద వ్రాలఁగా
నిలిచినరాజహంసివలెనే పొడకట్టెడుశాస్త్రపారశా
లలలితరూప మీపురి కలంకరణం బది గాదె?" యన్న, వా
రలు "సరగాని నీ వది మరాళి యటంటివి గాన, మాకు న
య్యలఘుతరోపమానము తనంతన కల్గెను; మేము దానిపి
ల్లలమె కదా?" యటన్న, "సఖులార! ద్విజుల్ నుడి మీరరు; దానిపి
ల్లలె యనిపించుకొంటకుఁ దలంచినఁ, గడు కవీంద్రు" లంచుఁ, గా
శలి నిటు నర్మగర్భసరసప్రియవాక్కుల ముచ్చటించుచున్,
"వెలయఁగ భోజరాజముఖవీక్షఁ గవిత్వము పుట్టినట్టులే

* 145 పుటలో వర్ణింపఁబడినవివే.

కలిగిన పెట్టిమాట లిటుఁ, గాంచెదఁ జూడఁగఁ బట్టివచ్చె సుండీ;
పలుకువెలందినట్టివకుఁ బట్టగునీరమహేయమందిరం
బిల గలయంతకాలమును నిల్చి యొసంగుత" మంచుదీవనల్
పలుకు చతిక్రమించి, యటుపై నొకగుట్టను, జూపమేరలో
విలసిల దూర్పువైపున మహావెలియొకం; డది చూచి, పూర్వమా
స్థలమునఁ బాళెముల్ దిగుటఁ దగ్గృహమ్ముం బడవాలు వాసమున్
నలుపఁగఁ గట్టి రంచు, మునుమున లోకకొండడు చెప్ప వించు, న
వ్వల ధవళాద్రి శృంగమున స్వామిజనార్దనునాలయంబు న
ర్మిలిఁ గని, రాజశేఖరచరిత్రమునం* గవిలింగ, మచ్చవుం
బలుకులఁ దేట తెల్లముగ వ్రాసినయంశములం దలంచుచున్,
జలపరిమాణసూచిపదసంఖ్యలతో నదినుండి లాకులో
పలికిని బోవుదారి కిరుఁబ్రక్కలఁ బాఁతిన కెంపుకంబముల్,
తలదనుకన్ మునుంగ వఱదన్, బయిఁ దోఁచెడువానిగుమ్మటం
బులనుఁ జక్కినుండి యలబొబ్బరిలంకకుఁ బోయి, కన్నుకు
బ్బులఁబడిగాపులున్న జనముం గొని, యంతటఁ బొద్దుగ్రుంకఁగా;
వెలికిని రిత్తగాఁ బగటివేళఁ గనంబడి, రాత్రివేళఁ జు
క్కలగమితోడఁ గ్రిక్కిఱిసి కానఁగవచ్చునభంబు వోలె, న
గ్గలముగ స్థూలనాళపుముఖంబున వెల్వడి యెల్లవారిచూ
డ్కులకును బాష్పరూపమున గోచరమౌ ఘనధూమ మవ్వు డ
త్యలఘురుచిస్ఫులింగమయమై ప్రతిబింబముచేత గౌతమీ
జలములఁ జిచ్చు లేచ్వెలుచుచందము నేర్పఱుపంగ, ధూమనౌ
తిలకము వెంట మిన్కు కరుదెంచెడు నంచు నుతించుచున్, గుతూ
హలమున గంట గంటయుర కందఱముం బరమేశు సత్కృపా
కలనముచేత రాత్రికి సుఖంబుగఁ జేరితి మిండ్లు క్రిమ్మఱన్॥ 204

(112 పాదములు)

---

* కందుకూరి వీరేశలింగము.

తే॥ భరతఖండంబునను గూడఁ బ్రాఁక కుండఁ,
బశ్చిమముననె చల్లాఱె భండనార్చి;
జరిపె సాక్షిగ దాని కుత్సవము లిచటఁ,
గాళయుక్తిఁ గార్తికసితైకాదశిఁ బ్రజ. 205

తే॥ మంచియర్థంబు గలయేఁడు మంచి నీదు;
చెడ్డయర్థంబు గలయేఁడు చెడుగు నీకు;
విసర దొరఁకొనె నానంద విసపుగుండ్లు;
కమ్మలడ్డవమ్ముఁ జిమ్మఁ గాలయుక్తి. 206

(4-9-1922)

ఉ॥ “చిత్రవధంబు మెట్టవయిఁ జేసిరి ము” న్ననురాణ్మహేంద్రచా
రిత్ర మదృష్ట; మిప్పు డిది దృష్టము; ప్రియపువాని నెవ్వరో
గాత్రముఁ జీల్చి, పాణిపదఖండములుం, దల, మొండె, మిడ్డమ్మ
త్పాత్ర, రసంబు నుష్ణనిచి, పాఁతిరి చిత్రపువారిదొడ్డిలో;—

——

లయగ్రాహి. ఓడ, తెఁచాఁపవడి లేశివరు వెత్తుతటి
బేశిన యొకంతు విధి మూఁడి నది మిట్టెం;
దోడన తటస్థపడి గోము పడ రివ్వా యను
నీడజము, దాని ముకుతోడ వెనఁ బట్టెన్,
సోమునను, దాని నఖ మూఁకఁ గొనఁ దాఁచి, సిడి
జాడ గరుడం బెగసి వేడుక యొనర్చెన్;
బీష పడ లేక పెనఁగాడి, విడిపించుకొని
దా డుటికి రివ్వ, నది బేశినము రాలెన్. 208

చ॥ జలముల మీఁను మిట్టుటలుఁ, జంచున దానిని రివ్వ పట్టుటల్,
తల నఖ మూఁకకోఁ బులుఁగుఁ దన్ని సుపర్ణుఁడు రెంటి నెత్తుటల్,

విలవిలలాడి రివ్వ విడిపించుక పోవుట, లూడి యేటిలో
నలకులంబు రాలుట, లివన్నియు నొక్కక్షణంబులోఁ జూడరా.

రాజమహేంద్రవరమునఁ గందుకూరి వీరేశలింగముపంతులు
గారు, 1881 సం. డిసెంబరునెల 11 తారీఖున శ్రీపునర్వివాహము
లు జరిగింపఁదలపెట్టిన సందర్భమునఁ గాకినాడపురవాస్తవ్యుఁడగు
పైడా రామకృష్ణయాఖ్యధనికవైశ్యుఁడు పంతులుగారి కార్యమునకుఁ
బ్రోత్సాహకరముగా నలువదివేలరూపాయలు విరాళమిచ్చెనఁట, ఆ
సందర్భమున నతనిఁగూర్చి రచించినపద్యము.

ఉ॥ నీరధిఁ గట్టె రాముఁ; డనలీస్థలి ముంచునధర్మకాశుభ్రము
ర్నీరధిఁ గట్టి తీ; వొకటి నేర్పునఁ గాచె వితంతుగర్భమున్
గూరిమిఁ గృష్ణుఁ; డిష్ట పదకోటులు గాచెద వీవు; రెంటికిం
గారణ మెన్నఁ బైఁడి; యటు గావున, సార్థక మాయె నీయెడం
బేరును నింటిపేరు; నినుఁ బేర్కొన రా దెటు రామకృష్ణుఁడా!

ఆ॥ విధవ సధవఁ జేయ వీరేశలింగంబు,
గ్రామ్య రమ్యఁ జేయ రామమూర్తి,
కందుకూరుగిడుగుకలశాబ్ధులను గల్గి
రగ్రవర్ణు లిర్వు రాంధ్రభూమి. 211

---

తే. సంబి రెడ్డి కమ్మరి కరణము పురోధ
మంగలియుఁ జాకలియు మాలమాదిగలును
గుమ్మరి తలారి వడ్రంగి నుమ్మ్రి కోటిక
లందు బారబలావతీ లనెడువారు. 212

---

క॥ వానినకడవలఁ గుమ్మరి
చానలు దొంతరలు వెట్ట నందిటఁ బట్టం,
బైనానెఁ జనులు, తమవలె
వానిఁ బయోధరము లగుచు వర్ధిలుఁ డను నాన్. 213

తే॥ ఈడనకఁ జిక్కైదె కాకినాడనగరి,
యెమ్మెలను మీఱు రాజమహేంద్రిపురిని;
బహుచుభోగపుఁజూనకుఁ బసలు మెుదు;
మునలిముత్తైదువకు నింత పసుపుబొందు. 214

సీ॥ రైలుఘోషకు జంకి మూలమూలల దాఁగె,
బంగరడ్డలకూఁటిపల్లకీలు;
బ్యాండుమేళముకంటఁ బడ సిగ్గు పడెఁ, బెండ్లి
తోరణా లదరించువీరణాలు;
మాయమై పోయె ముద్రామఁత్రములదాడిఁ,
దాళపత్రిలు గంటాలు నొాఱలు;
నగ్గిపుల్లలపెట్టియలయార్భటికి విచ్చి
మొగ్గ లయ్యెను జెకుముకులు, ఊలు;
నూటకలములపాళీలపోటి కోడి,
బాతునెమిలీక లంగిళ్ళు పాసి పోయె;
నప్పుఁ బ్రతిశిల్పమును బూర్వశిల్పమునకు
నబ్బురంపువిశ్వామిత్రు లాంగ్లజనులు. 215

---

క॥ గానసుధఁ దనుపుఁ గర్ణము
ఘోనోగ్రాఫున కమర్చుబూర; వికచమై
తా నెత్తావిని గుల్లబు
సూనము తాద్యశము నానఁ జొక్కించు నిసిఁ. 216

—సుందరుఁడగునొకనవనాగరకుని మోహము—

తే॥ కత్తిరించిననీలాలకములఁ జెనసి
బవిరిగడ్డంపుఁజెంపలనవుదు మీఱు

కొమరుజిగి మెఱఁగు మిసిమిపసిండి ప్రసిలములకుండ్రి
చట్టమున నిగ్గుటద్దంబునట్టు లలరు. 217

క॥ అలల ముసుంగుచు సాగుచుఁ
దల క్రిందుగఁ గాల్వనీటఁ దాళంబులసీ
డలు, పాతాళమునకుఁ జను
పలుదలలబిలేశయములపగిదిఁ దనర్చున్. 218

ఉ॥ రోఁకటితోఁడ దోర్లత లఁరోఁజము లాడ నతోన్నతంబు లౌ,
చూఁక నడల్చుపోటులకు పాలుగ్రమ్మఁ జేతగఁగాళ్ళు ముందుకుం
దూఁకెడువీఁకఁ జూచియువతుల్ నలయంబుగఁ బాడుచుం బదా,
లూఁకున వడ్లు దంత్రుచెమటోడికలన్ జలకట్లు వానఁగన్. 219

చ॥ చుఱచుఱఁ గోరచూపులను జూచి, గిత్తిల్లని ఱంకె వేసి, ముం
గొత్తిసెల నేలమువ్వ, కొనకొమ్ముల పాలుమ్మని మన్ను గ్రొచ్చుచున్,
జిఱుబుసు మంచు, మూత్ర మవనిన్ స్రవియింపఁగఁ, దోకమట్ట లే
డ్తెఱఁబయికెత్తి, యొండొకటి డీకొని యెన్ వృషభంబు లీసునన్.

ఉ॥ వెళ్ళినతొల్కరిం వఱదవెల్లువఁ గొట్టుక వచ్చి, యేటిపై
కిక్కలిగఁ బ్రాకి, దాఁగి పగ లెల్లను గప్పన, మాపు క్రిందికిం
జల్లగ జాఱి, పక్కలదెసం జనుతాఁచును బట్టెఁ జేతితోఁ
బిల్లలతల్లి; హా! కడుపుఁ జేపుముకుఁ బ్రాణము గడ్డిపోఁచగా. 221

ఉ॥ తారణపుష్కరాన, జలధంబులు క్రమ్మినచిమ్మచీఁకటిం,
జోరులు బొక్కఁ ద్రవ్వి తననూనునిపక్కఁ బరున్నకోడలిం
భూరివిభూషణం దిగిచి మోసికపో, విని దానికూయి, ని
ర్భీరుత వాండ్రఁ దాఁకి విడిపించెనున్మమం; బటుసాహసల్ సతుల్.

చ॥ తలుపున సన్న బెజ్జములదారి బగల్ వెలివెల్గు, చుట్టు ని
ర్మలకిరణప్రసారమును మధ్యము శూన్యము నౌచు, లోన న
వ్వలనికి సూటిగా నిలుచువారికి దవ్వునఁ దోఁచు, మిక్కిలిన్
వెలుతురు గల్గుచుక్కలు దివిన్ రవి గుప్తికినవిచ్చినటుం బలెన్.

క॥ నీ రరిగెమతూము లద్దో
ద్వారములు, హజార మగు వదన, మటఁ గిటికీ
లారయఁ గన్నై; లగారా
కారము మైఁ బోలు; గవ్వ కర్పరముఁ గురుల్. 224

క॥ కనుముక్కులు సుమి వాతా
యనములు గృహాలత్మ్మి; కట్టు లగుచో ఘటియి
ల్లును రేలటఁ దగ వనక; త
దనిమిష తామహిమ సఖ్య మాపాదించుమన్. 225

ఆ॥ పటుజపాను బెనుదుపానునఁ బరిమార్చి;
జలధి ముంచె దరి విశాఖనగరిఁ;
గాకినాడపురిని గాంగ్రెస్సున నలర్చె;
నెత్రి గ్రిక్కునే.టి నెఱపను లివి. 226

చ॥ ఎనిమిదియేండ్లు ముప్పదివయింగలయూమునఁ గాకినాడ వ
చ్చె నఖిలభారతీయసభ, నేతుహిమాచలపూర్వపశ్చిమాం
బునిధులనడ్మిదేశములపూరుషసింహులరూప వేషవ
ర్తనముఁ జూప, బాపురె! పురం బపురూపపుఁజిత్రమై తగన్

క॥ వెల్లిగొని యెల్లనీరుం
బల్లమునకుఁ బొలుచునట్లు ప్రజ చనె రైళ్ళ
బెల్లువడిఁ గాకినాడకు
నుల్లసిలుచు నఖిలభారతోర్వీసభకై. 228

---

క॥ పున్నమ యమవస యయ్యెను,
వెన్నెల యిరు లయ్యెఁ, జంద్రబింబము త్రుంపై
యన్నపెన మయ్యె, మాఘము
నన్నత్తురుగ్రొక్కు నేఁట నాలుగుఁగేయల్. 229

---

ఆ॥ చదల గాలిబోడ, సంద్రానఁ బొగబోడ,
భూమి రైల్ సయికిలు మోటరులును,
శీఘ్రయానము లివి శ్రీమంతులకు నాంగ్ల
పాలనంబునం దభివృద్ధములందు. 230

ఆ॥ అరదములును, వ్యోమయానంబులును, యోగ
పాదుకములు మంత్రపాదలేప
ములును, వాయువేగములు మనోవేగముల్,
ముజ్జగముల రాజమునుల కాది. 231

ఉ॥ కుమ్మరు లెల్ల గ్రొచ్చి మను, గుండలు వాన, దినక్రమంబునన్
గుమ్మరగుంటపేర మఱుగుం జెఱు వేర్పడె రాణ్మహేంద్రమ
ధ్యమ్మున; గాలెజీ కెదురు దాటు తరంగము; కాఁగర్భచి
త్రమ్ములు, మించు దివ్వెలను ధామము కృష్ణసినీమ యాదరిన్.

తే॥ చుట్టును దమస్సు, దేజస్సు నట్టనడుమ,
గలిగి, చిటిగాజుకుప్పెను వెలుగుదివ్వె,
కృష్ణమార్జాలనేత్రసాదృశ్యమునకు
నర్హమై యంద మొందుఁ దిరియామయందు. 233

ఉ॥ కొండలనుండి తోర మగు కూర్మి ననారత మేఱు లొచ్చు మా
యుండలఁ బాఱు తావకపయస్సును దేవ లారఁ గ్రోలుచున్,
దండిగ బెంచుకొన్నాడలు తల్లిరో! భారతభూమి! నీకుఁ గా
కుండిన, మాకు మాతఋణ మొండొకలాగున నీఁగ జాగునే.

---

ఆ॥ మబ్బులోనిరసమొ, మావిపండ్లరసంబు
నిమ్మపండ్లరసము నింబరసము;
నాత్మకళ యొకండె యన్నిటఁ; దత్త్వంబు
పాధిఁబట్టి భిన్నభావ మొందు. 235

---

ఆ॥ క్రుంకు వేవెలుంగు గొలిమిని సంజకెం
జాయ మొగులుఁ బగడు సమయ మనెదు
కమ్మరీఁడు గ్రాఁవఁ దెమ్మెరతిత్తాద,
నెగయుపొగలు నడరు, లిరులు నుసులు. 236

తే॥ నలుపఁగఁ బ్రమాణ ముజ్జ్వలజ్వనకీల
నిలుచు సీతామహాదేవి నెమ్మొగంబుఁ
గాంచున ట్లుండుఁ, గట్టెఱ్ఱకాంతిఁ బూర్ణ
చంద్రబింబంబు దర్శింప జరమసంధ్య. 237

చ॥ చెడ లనుజాలముం, బొమపుజాబిలిజాలరి, యంతరాళ మన్
హ్రదమున వైచి, దాని నిరు లన్బరదన్ వదలింపఁ దేటకా
ముది యను నీటిలోపలను బుల్మి, కరంబులఁ జుక్కమీల ని
య్యెడన హరించె నాఁ బలుచ నాయెను వెన్నెల రేయిఁ దారకల్.

చ॥ అరుణపురస్సరుం డయి సహస్రకరుం డను దేరఁ దేర, ముం
దరఁ దెఱపై, యమానదరిదాపులిభావరిచందమామ వై
ఖరిఁ గనుపట్టుసాంద్రమిహికావృతి, యుత్తరుతోఁ గిరీటి రా,
గురుపతిసేన వీఁగు తెఱఁగుం దలపించెను మాఘపున్నెలన్. 239

---

మ॥ ఫలభూజాతములార! మొక్కెడను మీపాలింటికిన్ వచ్చె నీ
వలచెండాటలు నిట్టుకావము; లయో! వజ్రప్రహారంబులన్

గుబభూద్రంబులు వోలెఁ గూలెదరటుల్ గొడ్డంద్రవఘాతంబునన్;
నిలుచున్ మీఋవాలో పకారసుకృతుల్ నిచ్చల్ రసజ్ఞాత్మలన్.
మ॥ జననం బన్నను మీదె జన్మము మహీజాతంబులారా! జగం
బున; జీవంబున నున్నయప్పుడది తమ్ముం బాసి పన్నట్టి మీ
తనువుల్ లోకహితక్రియార్థవినియుక్తంబుల్; మిముం గన్నదే
జనయిత్రిమణి; మాతృయాపవననస్నానాఘవుల్ దుర్భవుల్.241

సమస్యలు (సొంతములు)

క॥ లోలతఁ గుమ్మరిగుంటఁ, గు
లాలజ లను సెండవేళం దరిఁ బోయన్,
జేలము విడిపోయినయొక
బాలక, జంబాల మవుడు బట్టయ్యెఁ జుమీ. 242

మ॥ పడకింటం బొలయల్క నున్నపడఁతిం బల్మారుం బ్రార్థించియుం,
బడయం జాలక తత్ప్రసాదము, పదాబ్జాతంబులన్ వ్రాలఁగా,
నడుగంటం దగిలెన్ స్రజం; బతివ త్రోయన్ లేవలేఁ, డయ్యెడన్
మెడకుం గాలికిలంకెయై పెనఁగి రామానాక్షి యుం భర్తయున్.

1886 సం॥ ప్రాంతమున నేను కొంతవఱకు రచించిన హరిశ్చంద్రచరిత్ర నిరోష్ఠ్యము, ఉ, ఊ, ఒ, ఓ, పొలుకూడ విడిచినది నష్టమయినది. ఈక్రిందిపద్యము దానిలోనిది. ఆశ్రమవర్ణనము.

సీ॥ ఎన లేనినన తేనె యని తా నలరఁ గాని
యెల తేఁటి తెగ త్రాగ నేగ దచటఁ,
దెలిసీటిచలిడిగ్గియల డగ్గఱఁగఁ గాని
తెగి యంచ దిగ నెంచి తేరల దచటఁ,
గిసిగందనిరసాలకిసలాళిఁగనఁ గాని,
కలకంఠి తిన నానఁ గదల దచటఁ,

దనియంగ నెవ గాంచి, దరిఁ జేరఁగనె కాని,
నెఱచిల్క చెనకంగ నెగయ దచట,
తే॥ నంగజారాతిరీతి నెసంగినట్టి
యచటిజడదారిరాయలయాన గనక;
యనికిఁ దలఁకెడి హరి కరి యంతకన్న;
నింక జింకల గింకల నేల యెన్న? 244

1875 సం॥ ప్రాంతమున, ద్విపదకావ్యముగా నేనారంభించి రచించిన సావిత్రిచరిత్రము నష్టమయినది. ఈక్రిందివి నాకిప్పటికిని జ్ఞప్తియం దున్నతద్గ్రంథపాదములు

ద్విప॥............. .. కలుగ దయ్యెను వ్రేలికణుపెఁడుబిడ్డ;
పాలబుగ్గలు, పకపకనవ్వుమోము, । లాల యొల్కెడుకోమలపు ముద్దునోరు,
కలికికాటుకరేక, కస్తూరిబొట్టు, । జలకమార్చి యిడురక్షాతిలకంబు,
గలుగుపొత్తులనూనెకందు, నిద్దురను । నులుకుచు చేష్టుచు నవ్వుచుండు కన్వెందుఁ
బలితంపుఁ గుండు రూపఱఁ జేయుమందుఁ । దిలకించుతండ్రి య దృష్ట మేమందు. 245

## శిశుమరణచింతనము

ఆ. గాసి వెడలి మాతృగర్భంబు, పదునొకం
డవదినంబునందు నవనిగర్భ
మందుఁ జొచ్చె; తకట! యనుఁగుఁగూఁతుర! మేలె
తల్లికడుపుకన్న ధాత్రికడుపు? 246

క॥ పదిదినము లింట నున్నను,
బదినెల లుదరమున నున్నఫలమే గా, కే

మదనంబు నాదుకన్నుల!
కుదయించితి దుహిత! చెనఁటియుసుపాదముగన్. 247

ఆ॥ పసుపునూనె లూరఁ బంచిపెట్టుట లేదు;
బారసాల లేదు; బంధుజనులు
పొగులఁ, బేరు లేక పోయితి శుద్ధినాఁ,
డల్పఋణము దీఱ; ననుఁగుబిడ్డ! 248

ఆ॥ తలఁపునుండి గెంట దలఁగవు; నినుఁగ! నె
కెట్లు సంఘటిల్లె నింతబలము?
ప్రేమపాశ మీశుఁ డేమిటఁ జేసెనో
కడిఁదియినుపగొలుసుకన్న గట్టి. 249

క॥ ఋణమోచనజన్మము, కా
రణజన్మము, యేదొ నీకుఁ బ్రాప్తించెను; స
త్తృణ మది దీఱె; జగద్గు
రుణుకృప నీకఁ బొంద వీవు జన్మము శిశువా! 250

తే॥ అవయవము లేఱుపడి, గర్భమందు శిశువు
పొదలుచుండంగ, మదిఁ దోఁచి పొసఁగె మమత;
కారణం బేమియో, మంటఁ గలయ నినుఁగు,
మమత మడియక మనసును మంటఁ బెట్టు. 251

క॥ వెలుఁగుం జీఁకటి జగతికి
గలిగించెడునీశుఁడే సుఖము దుఃఖంబుం
గలిగించు; దత్ప్రయోజన
మలఘుమతుల్ గందురి; కాన రల్పప్రజ్ఞుల్. 252

క॥ ఎందులకుఁ దయ సేసితో
కందు, మ ఱెందులకుఁ దోన కైకొంటివో, నా

కం౦ దెలియదు; కం౦ దెడపి, ము
కందు; త్వదీయాంఘ్రిలం దగుల్పు తలంపున్. 253

—• నిర్యాణములు •—

16 జూలై 1888 సం॥ సర్వధారిసంవత్సర ఆషాఢశుద్ధ
అష్టమి సోమవారము.

రాజమహేంద్రివాస్తవ్యులైన బసవరాజు గవర్రాజుగారి మర
ణమును గూర్చి

ఉ॥ రాతుసజాతుఁడై కనికరంబును సత్యము శౌచ మూనెకున్;
వీతుణ సేయ నీతఁడు విభీషణుఁడో, బలితాత యొక్కొ నా,
నతుయదైవభక్తి నలరారినబీ. గవరాజు, సర్వధా
రీ! తుణమాత్రి నాకమున కెత్తుక పోయితె యద్భుతంబుగన్.

ఉ॥ మాకును గూర్మిసోదరుఁడు, మాన్యబుధప్రికరంబువిందు, న
స్తోకతరాపదాళిఁ గని తొల్గఁడు సత్పథ మింతయుం, గళల్
రాకను నెక్కు జొబసవరాజుకళాబ్ధిజగౌరరాజు, నీ
వాఁకొని మ్రింగితే ప్రిథమ యామములోన నె మృత్యురాహువా.

---

—• దామరాజు బసవరాజు 1-3-1903 •—

మ॥ చెలికాఁడా; విధి వక్రిమార్గుఁ డయినం జేయుంగ లేనట్టిచె
ట్టలు చూపట్టునె! చిన్నిపూవుమధు వుట్టన్ బంధుమిత్రాళితోఁ
బలు కాడంగలనిన్ను నిప్పు డధరస్పందంబు దూలించి, ని
చ్చలపుంబొమ్మను జేసె; హా! బసవరాజా! దామరాజాన్వయా!

మ॥ కలరే నీవలెఁ బుట్టుభోగు లిలఁ బెక్కం౦! డొక్కొన్నఁడు లే
మలఁతం జెందితో పితృసంతరము; విద్యాశాలివై, పాఠశా
లల నెన్నింటనో మేటియోజ్జనము నప్పం జాలి, విద్యార్థివ
త్సలుఁ డన్ఖ్యాతి వహింపవే? బసవరాజా! దామరాజాన్వయా!

మ॥ కలితప్రౌఢిమ బోధనాభ్యసనవృందగాలే? లో నొజ్జవై,
యలయుద్యోగము మాని, మిత్రమనిశీ దుర్గామాత్యునాహో త్యుప్రాం
బలిమిన్ బట్టణశుద్ధిశోధకసభన్ బల్ కార్యదర్శిత్వ మిూ
వలఘుల్ మెచ్చ వహించవే! బసవరాజా! దామరాజాన్వయా!

మ॥ మొలకన్ నాటినవాఁడు తాని దగునేపుం జూడ నిచ్చల్ కుతూ
హలి యైనట్టులు, కార్యదర్శిపదమున్ దామోదరున్ జేసి, యుం
దలఘుస్థైర్యుఁగ నిన్నుఁ గోరుజనులున్ దుర్గామాత్యునెయ్యంపుమేల్
జలవర్ణాళిగఁ బోయితే! బసవరాజా! దామరాజాన్వయా!

మ॥ ఫలకాలంబునఁ జెట్టుపై నశనిసంపాతంబు తాం బోలె, నా
దలపై మృత్యువు దూఁకెనే? యకట! పుత్రప్రాప్తికాలంబునన్!
జలితాసుండగు చుండి, ప్రొద్దు లగునీజాయన్ విలోకించి, యెం
తలఁతం బొందితివో హృదిన్! బసవరాజా! దామరాజాన్వయా!

మ॥ కొలికిం జాతెడునశ్రు లొత్తుకొనుచున్ గూర్చున్నయీపౌరమం
డలియం దెందఱు నీకు బంధువులొ, యెందఱ్ మిత్రులో,
[యెందఱో
జ్జలొ, యెందఱ్ కృతిశిష్యులో, యెఱుఁగవా! జాలిం బడం బోకు దం
చలరింపం గదె వీరలన్; బసవరాజా! దామరాజాన్వయా! 261

మ॥ పిలుచన్ వొచ్చిననోరఁ బల్కఁడని తా బేవార్లు, ప్రాణంబులన్
బలి వెట్టున్ బని వచ్చెనే యని నఖుల్, పాఠంబులన్ మాటిగొం
తులలోఁ బోయు నటంచు శిష్యులు నినున్ గొండాడుదుర్; త్వత్ప్రట
చ్ఛలమై తత్ఫలమేర్పడెన్; బసవరాజా! దామరాజాన్వయా! 262

మ॥ గెలుపున్ బట్టపరీక్షయం దొదవె; దక్కెన్ సెక్రెటేరీపదం;
బిలుం సౌధంబుగ మారె; జాయకును జాలిశుండు నిల్చెన్; విధుల్
విఫలయం బొందె; సుఖంబు వింక వని యువ్విళ్ళూరుచో, నీవయిం
జలపాదించెన మిత్తి! హా! బసవరాజా! దామరాజాన్వయా! 263

మ॥ కలుగుం గావుత నీకు శైవమతదీక్షాప్రాప్యమోక్షంబు; నీ
కులమాచంద్రదినేశతారక మెసంగుం గాత; నీచిత్తమీ
లలితాత్మ్యమ్మృతవస్తుదర్శనపుశాలన్ నిల్చుఁ గాతన్ సదా;
జలజార్ష్యంకపదార్చకా! బసవరాజా! దామరాజాన్వయా! 264

సీ॥ దామరాజాన్వయోదన్వన్నిశాభర్త
బసవరాజులచేత వినపు గుఱుపు
వోడమి, యీభువనంబు విడిచినఁ, దజ్జ్ఞాప
కంబుగాఁ జిత్రపటంబు బొకండు
చేయించి, మునిసిపాల్ చేరుమాన్ మొదలైన
వారలు శుభకృత్సంవత్సరమున
మాఘాంతదశమి నమరుభానువాసర
మందు, మ్యూజియముపెన్ హాలుసోనఁ
బెద్దసభ చేసి, కర్జంబు విన్నవించి,
గాసెనను దీసి, తచ్ఛాయ కంటఁ బఱుప,
జదివె నీపద్యనవక మానమయమందు,
నందువడ్డాదిసుబ్బరాయాహ్వయుండు. 265

రాయబహద్దరు కందుకూరి వీరేశలింగముగారిని గుఱించిన చరమ పద్యములు 1919.

మ॥ జననం బొందెను రాజమహేంద్రపురి; శిష్యత్వంబునన్ దత్పురీ
ఘనవిద్యాలయమందె విద్యఁ గఱచెం; గాలేజి నవ్వీటనే
తెనుఁగొజ్జయ్యె; దిన తద్విశ్రుతిని సందేశాంచె సంస్కర్తనాన్;
గొనిపోదే విధి! లింగసూరిఁ, దుదిదగ్ధుం జేయఁగాఁ జెన్నప్రోల్.

ఆ॥ రత్నలింగకవులు, రాజమహేంద్ర చె న
న్నపురి పండితులుఁగ నాఁడు మాఱి; న

రత్న మాల్కెఁ దచ్చితారోహణపదంబు;
లవర! దైవఘటన లతివిభ్రతంబు. 267

తే. క్రైస్తవశకంబు విధుసోమరత్నభువుల
జరగుసిద్ధార్థివైశాఖచరమపక్ష
పుంత్రయోదశిఁ గుజవారమునను జనియెఁ,
గందుకూరివీరేశలింగకవి దివికి. 268

క॥ సుకృతులు దుష్కృతులును, బ్రా
యికముగ నిహజీవనమున నెల్లర కొదవున్;
సుకృతులె కని యీశుఁడు లిం
గకవీంద్రుని యాత్మ కిడుతఁ గైవల్యంబున్. 269

క॥ డబ్బుగ నుండిరె మనియెను
డెబ్బదిరెండేండ్లు; ధీపటిష్ఠత నెన్నేఁ
గబ్బములు వ్రాసి, ప్రజమన
ముబ్బించెను లింగకవి, నిరుపమానం డనన్. 270

---

శ్రీ త్రిశేషులైన కొక్కొండ వేంకటరత్నము పంతులుగారిం గూర్చిన
చరమపద్యములు—1915.

శా॥ అమ్మా! నీకనుఁదమ్ములం దొలఁకుదుఃఖాశ్రుల్ గనన్, భారతీ!
చుమ్మల్ చుట్టుక పోయెదుం గనుఫు;నీసూనుల్ కవుల్ రాణ్మహేం
ద్రమ్మాదున్ మతి లేరె? రత్నకవిచింతన్ మాను; చాలించె దే
హమ్మున్ డెబ్బదినాలుగేండ్లమని; యుం కాతం డమర్త్యుండగున్.

క॥ ఆనందను, జ్యేష్ఠంబున,
రే, నెలఁ బాడ్యఁగ నెడుతిథిని, భృగువారమునం
దా ననిచె నమరవిభుఁడు, వి
మానముఁ గొక్కొండరత్నమానితకవికిన్. 272

---

బ్రహ్మశ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రికవిగారి మరణమును గూర్చి గౌతమీగ్రంథాలయపక్షమున (16-12-1920) జరిగిన సభలో నగ్రాసనాధిపతిగానుండి చదివినపద్యము.

తే॥ అరయ, రవి, యాదివాకరుఁ డస్తమించి,
తోఁచు నిజరూపమునను బ్రొద్దుటను మరల;
నకట! కవి, యాదివాకరుఁ డస్తమించెఁ;
దొంటిగతి నింకఁ దా మనకంటఁ బడునె! 273

---

ఆంధ్రగీర్వాణసాహిత్యఖనులును, మత్పితృసఖులును, నాకు గురువులును, దవశ్యాలులునైన బ్రహ్మశ్రీ భాగవతి. వాసుదేవదీక్షితులవారి నిర్యాణమును గుఱించి. (వేణీసంహారములోని పీఠికచివరఁ జేర్పఁబడిన పద్యశ్లోకములు రెండును వీరు రచించినవే.)

క॥ దొడ్డమపేటా! నీదగు
దొడ్డరతన మభ్రమణిని దొలుచుక చని శ్రీ
బిడ్డనిఁ జేరె వ. సు. గురువు,
పెద్దలతోఁ గలసి యుండ బిడియుంపడె నాన్. 274

—మిత్రుఁడైనకస్తూరినరసింహరాయమంత్రి, తన్నిర్యాణము—

శా. శ్రీకాంతామణిపేరిపుణ్యయువతిం జేపట్టి, సోమోఽద్యై
శాకల్యం బగునోడరేవుకులమం దై యిల్లటంపల్లుఁడున్,
వే కాంచెన్ వసుకౌస్తుభప్రభవగో వేణీరసోన్మగ్నతన్,
మాకస్తూరినృసింహరావు నిజనామం బొంద సార్థక్యమున్. 275

క. అప్పాల మునిఁగినముప్పుం
దప్పించె వరాహమూర్తి ధర; కట్టిద యా
నొప్పమి దొడ్డమ్మముతా
కిప్పుడు కస్తురిన్నృసింహుఁ డెడపెఁ ద లెత్తన్. 276

తే॥ నవహారికృంబరీనిక్కాక, నవయుగంధ
రంబు, నవశిష్మగాను, మంత్రి మెుంజగురుని
తో విచారించ, గ్రంథు దుందుభి చెనంగ
జ్యేష్ఠ శుద్ధత్రయోదశి నేగె దివికి. 277

మ॥ సిరి రూ పొందిక రించిన క్లైనయం దన్ శ్రీ శ్రీమహాంత్మ్యనం
దరి, కస్తూరిన్నృసింహా రావు ప్రియకై, నాం డాది సంస్థానమున్
హరియన్ దాంక సేవె, సాధ్యకనమూర్త్యక్ః పన్సు రాజానుతున్;
మరి లక్షుల్ ముడిచెక్;స్మరించుచుంబ క్షేంబాసె నిశ్చింతతన్.

క॥ పింగళయందుం జనన౯,
బాంగాసాబ్దమునం బరిణియును, దుందుభియం
దుం గడయూరుఘ,నసురా
సంగాతికి నారసింహవచివాగ్రణికిన్. 279

క॥ మనె నఱువదినాల్గేండ్లనమున;
మనుమల మనుమరాండ్రి మునిమనుమల నె
త్తెను;వీడెం దాల్చు పొర బలెం
దనువు;న్నరసింహ రావు ధన్యుండు గదా. 280

క॥ పరమాత్ముం డనాయానపు
మరణము గలిగించినట్లె, మచ్చిరనఖక
స్తురినారసింహమంత్రికిం,
గరుణం బ్రసాదించుం గాతం గైవల్యంబున్. 281

---

జమీాన్ దారిణి శ్రీవాడ్రేవురంగనాయకాంబగారు, ఆమెవిర్యాణము.

22-6-1911

చ॥ ముదిమి శిశుత్వ, మెుగ్గ టని ము న్నెనుమాటక లక్ష్య మయ్యె,శె
బ్బదిమధుమాసముల్ గడపుపండితరాజ్ఞికి రంగమాంబకుం

గుదురుగఁ గూఁతుకూఁతుపెదకూఁతుకొమారునిపుట్టువేడుకన్
ముదితలు డోలికోత్సవము ముచ్చట దొడ్డమపేట సల్పుటల్. 282
ఉ॥ బిడ్డఁబిడ్డ, లర్థిఁ దమబిడ్డలబిడ్డలతోడఁ దొట్లలో
నిడ్డచిరాయురాలు, కయి కెమ్మ్రైక లేదని యర్థు లాడఁ జే
ర్పడ్డవదాన్యరాల్, క్షుధితుపాలికి వంటకు, నన్నపూర్ణ, హా!
దొడ్డమపేటరాజ్ఞి, శివుతోఁ గనె నైక్యము భీమనాథుతోన్. 283
క॥ వలితగను నవతరించిన
యనఘాద్వైతప్రబోధ మహావెలుఁ గెగసెన్,
మునుఁగుడినము, దొడ్డమపే
టను, దీపావళిబెడం గటన్ బగలె కనన్. 284
ఆ॥ ఏఁబదేండ్లకంటె నెక్కుడుగా బ్రహ్మ
చర్యమునఁ దపంబు సలిపి, వాడ
రేవురంగమాంబ, ప్రియు సుందరేశునిఁ
గలసికొనియె దివిని గాల యుక్తి. 285
తే॥ పతగుడులమొదలినము, నాశ్వయుజదర్శ
భానుదినమునఁ, దత్ప్రజ్ఞ వాడరేవు
రంగమాంబ దొడ్డమపేటరాజ్ఞి, మోక్ష
సౌధ మెక్కెను, జితి యెక్కె జనరవపువు. 286
ఆ॥ దహనతాప మాఱ ధర్మోదకములు నే
త్రాంజలులను జోషకాంబ రంగ
మాంబ కొసఁగి, తత్సమాధిరాతను జెక్క
వ్రాసె వసుఁడు చరమపద్యము లివి. 287

—• వసురాయమాతామహీనిర్యాణము •—

క॥ పువ్వులతే ర్వసురాయని
యవ్వలు, బాలాంత్రశేషమాంబకుఁ; బండై

నొవ్వక రాలెను శుభకృ
త్సన్వత్సరపుష్యపుకృష్ణనలిదాద్వాదశి రేన్. 288

—• శ్రీ శ్రీవిక్టోరియాభారతచక్రవర్తినీ నిర్యాణము •—

ఉ॥ తొమ్మిదిజీవరత్నములఁ దోరపు*బంగరుజూబిలీని, హృ
ద్యమ్మని యెల్ల రుల్లసిలఁ దాపినయోవసురాయమా స్తకూ!
యెమ్మెయిఁ జెక్కిదో యిప్పుడు, మృత్యువిమోచితరాజ్యభారవై
యిమ్ముగఁ జక్రవర్తిని శయించునవరాధిపయిన్ నువర్తముల్?

ఉ॥ అచ్చపుఁగొప్పవర్తికొన నంటినదీపపుమొగ్గ, చూడఁగా,
నచ్చరితానువర్తనము నల్పుతజిన్ గని బుద్ధి, హాంశీగా;
గచ్చిక నంటుదివ్వె కెనగా యది యొంటెడ; మేల్పొందించి, నే
మచ్చికఁ జక్రవర్తినినమూధి కొనంగవఁ బద్యహారముల్. 290

మ॥ పదియుందొమ్మిదినూర్లయేండ్లరుగఁ బ్రాప్తం బౌశతాబ్దంబ! నీ
వుదయం బొందితి యూశ్వగండమున; నయో్య! నిన్నుఁ గన్నట్టియి
ర్వదిరెన్నాళ్ళకె, నీయరిష్టమున సర్వత్యామహారాజ్ఞి స్వః
పదముం జేరె, నిజప్రజానిచయ మేద్వం బంచఖండంబులన్.

సీ॥ పంచఖండేశ్వరిఁ బంచత్వ మొందించి,
శార్వరీ! సార్థకసంజ్ఞ వైతి;
కన్నిటిజడి సర్వఖండాలఁ గురియించి,
నవశతాబ్దంబ! యన్వర్థ మైతి;
తమ కెగ్గు చేసి, మంగళవారమా! ఏవ
రీతలఁతుణ సమర్థించుకొంటి;
విను మీఱు పెనువెల్గుఖపనీమఁ గుర్తింకించి,
బలుప్రదోషమ! పేరు నిలుపుకొంటి;

* 13వ పేజీ చూడుఁడు.

తే॥ వీరు నల్వురు పాతకుల్; మిమ్ముఁ గూడి
యక్కటా! చెడె శుభనామ యగుధనిష్ఠ,
బ్రతికినన్నాళ్ళు మీపాలవట్టికలకు
మైలబొట్టు, విక్టోర్యాసమూధిచట్టు. 292

ఉ॥ జాబిలితేటవెన్నెలలశారదశర్వరి గన్నకన్నులం,
జీబుటమూసచీఁకటిపసిఁ గనుభంగిని, నీమరాణిహాం
జాబిలినాఁటియుత్సవముఁ జూచినచూపులు, నాపెఖుట్టికం
భూబిలమందుఁ బూడ్చుదినపుందురవస్థను గంటి మక్కటా! 293

సీ॥ బడులలో విద్యార్థిబాలుఁ డొక్కఁడు లేఁడు;
కచ్చేరులను వ్రాఁతకాఁడు లేఁడు;
బాజాలులో నువ్వుపప్పుఁగడియు లేదు;
సంతచావడిఁ గూరసరకు లేదు;
కాటాలయొద్దను గిజ్జతూనిక లేదు;
కొట్లదగ్గఱఁ గొల్చుకోలత లేదు;
దాతిపై నమ్మోటఘూత మన్నది లేదు,
వట్టెడపై నుత్తిపెట్టు లేదు;
తే॥ పట్టణము లేమి, యూళ్లేమి, పల్లె లేమి,
యాత్మఁ బాసినదేహంబు ననుకరించె,
మేటివిక్టోర్యసార్వభౌమీమతల్లి
చెల్లి, భూగర్తమున నత్తమిల్లునాఁడు. 294

శా॥ ప్రాప్తిదుర్యోతవిషాదవేదనల, వార్తావతిప్రకాళుల్ త్వదీ
యౌదార్యాదిగుణంబులం బనవు, చత్యంతంబు శోకింపఁగా
నీదేహచ్యుతి, కొడుకజ్జులుఁగన్నీరో యనం దోఁచె, హిం
దూదేశోత్తమచక్రవర్తినిరో! త్వద్దుర్వర్తమానాంకముల్. 295

చ॥ పదిపదియేండ్ల కొక్క మఱి ప్రాయము ప్రజాగణసంప్రతీక్ష, ని
న్నిదొ మఱితోమ్మిదో పదులు, నీఘనవిక్టొరియా! ప్రజా! మహా!
యిది మొద లందుఁ బుత్రజనదీక్షితనామము గాన రాము గా;
చెదరదె త్వత్కుటుంబజనచిత్తము దెబ్బఁ బుత్రపౌత్రికన్. 296

సీ॥ అలదిగంతాలజా బరగంట కందించు
తీవ యున్నది మాకు; నీవు లేవు;
గంట కాఱ్లామడ గడపుసౌఖ్యప్రవృత్తులు
త్రోవ యున్నది మాకు; నీవు లేవు;
ఖండాంతరముల శీఘ్రముగఁ జేర్చెడుఘనమ
నావ యున్నది మాకు; నీవు లేవు;
పాడుపల్లెలలోనఁ బావనగాతమౌ
సేవ యున్నది మాకు; నీవు లేవు;

తే॥ హా! హిమాచలసేతుపర్యంతధరణి
మండలైకాతపత్రసామ్రాజ్యరాజ్ఞి!
ప్రాజ్ఞవిక్టోరియామహారాజ్ఞి! జననీ!
చనినదానవె మహిఁ బాసి స్వర్గమునకు? 297

సీ॥ ప్రాప్తవృత్తాంతసుహృద్భృత్యమహాత్మ్యాంశ మే
యంబ నీ కెడపె శుద్ధాంబుధుకుల,
హాయిగా నావలల్ వేయు పెక్కేఁడు లీ
వెత్తఁగా నాయె నేయింతికతన,
రంగువంతెనలమేల్ రతనాలపావట
చేర్లు, నేరాయి కైసేసె మిమ్ము,
శ్వాపదక్రవ్యాదసంపర్క ముడిపి, త్రై
ర్థికమైత్రి మీకు నేయుత ఘటించె,

తే॥ నక్కటా! భూతధాత్రీ! యనంతచక్రి!
జీవధునులార! వసులార! చెల్లిపోయె
నట్టిమాచక్రవర్తిని; యామెకీర్తి
తనయ నేఁడెరె తలి తండ్రి దాదు లగుచు. 298

ఉ॥ కుంటక ధర్మపుంగవము గోత్రఁ జనంగ, యుగాది నేల నే
పంటవలంతి తేఁ, డతనిపాలన మెంతన, నాల్గు నర్వదేం
డ్లుంటివి రాచగద్దియ, నహా! "కలి షష్టి"యటంట కల్లగన్;
వింటిమె నిన్నువంటిరమణిన్? విక్టోరియచక్రవర్తినీ! 299

మ॥ నరిగద్దెన్ వసియించుని న్గని, హరిశ్చంద్రాదికోర్వీశు లా
ర్వురునోండోర్వుల మోముచూచుకొనుచున్ రోషేర్ష్యలంగాంతురో
పరితీర్ణాజజగత్పురావరిచితత్వత్కీర్తి సోత్కంఠులై
కరముం గేలిఁ దెమల్ప వత్తురో, యెఱుంగన్; రాజ్ఞి! విక్టోరియా!

మ॥ భవదర్థంబు ప్రసిద్ధయుద్ధములలోఁ బ్రాణంబుఁ గోల్పడ్డశూ
రవరుల్, నీకు సమీక్షతూర్యములతోఁ బ్రత్యుద్గతుల్ నల్పఁగా
దివిఁ, బ్రత్యర్థిధరాతలేశ్వరులు, గద్దెల్ డిగ్గి యగ్గింత్రొ, యా
హవసన్నద్ధతఁ గాంతురో మరల; నన్వర్థాఖ్య! విక్టోరియా! 301

చ॥ మనుమల, మన్మరాండ్రు, మునిమన్మల, నెత్తెను నెత్తుఁ గాంచినం;
"దినకరుఁడస్తమింపఁ" డను దేశము నేలెఁ, బ్రభుత్వ మెంచినన్;
దనయుని, జ్యేష్ఠు నిల్పె స్వపదంబున, రాజ్యసమాప్తిఁ జూచినన్;
వినము ను గానముం జగతి విక్టోరియాసమభాగ్యశాలినిన్. 302

చ॥ విజయము దెల్పు పేరు, నలపేరికిఁ జాలినదామహాజి, మ
క్కుజనభయంకరాజమునకుం దగుశాంతియు, శాంతి కర్హమౌ
నిజవిజితాంస్వనిగ్రహము, నీకడఁ గా కిటువంటిపొందికల్
ప్రజ కనె నెందు? న్వర్భవనభాగ్యవిక్టోరియచక్రవర్తినీ! 303

ఉ॥ ఆఫ్రికట్రాన్సువాల్ రణజయోత్తుంగజర్మనిజగర్వగన్నమై
ఖ్యాపిత దత్సమిత్స్ఫుటవిశిష్టసపుత్రభటాళి ముచ్చటం గా
నపరిమితప్రతాపమున నాకముఁ జెందె జనునామె నైజప్రియా
ప్రాప్రియత న్నుతించక, యకృతజ్ఞులు రాజ్ఞ గణించెనం, బ్రహ్మో!

శా॥ లండన్‌పట్టణ మాబిడం గనుమహాలాభంబుఁ గోల్పోయె, నో
హిందూగర్వారి! నీకు నేమి కొఱ వయ్యె న్నేఁడు? విక్టోరియా
ముం దున్నప్పటికంటె నున్నతపదంబుం బొందె; నిన్ గోరి ముక్
సందర్శించిన యామెనందనుఁ డహో! నాథుండు నీ కిత్తఱిన్.

ఉ॥ ఒప్పులకుప్ప, యామె మహి నుండఁగ వ్రాలిన వెన్నిసాస్ల కన్
తెప్పల వన్ని స్త్రీపురుషనిర్మలవర్తన కొజ్జ లయ్యె; హా!
చెప్పెడి దేమి విక్టోరియజీవచరిత్రమహత్వ! మక్కటా!
తప్పెఁ గదా ధరాప్రజకుఁ దాదృశలాభము దివ్యమూర్తి గాన్.

శా॥ కోకే ర్వెట్టినయట్టితీరు గలముక్కుం, గొప్పకన్నుం, ధను
ష్కోటిం గా దనుభ్రూవుఁ, గుండలపుశష్కుల్యాభకర్ణంబు నై,
ఫోటోగ్రాఫున నేకపార్శ్వ మగుత్వన్మాత్రాస్య, మన్మన్మనో
వాటిన్ నాటె, స్వపక్షచిహ్నముగ; నిర్వాణాఢ్య, విక్టోరియా!

ఉ॥ నాణెములందుఁ, బత్రముల, నాణెపుఁజీట్లఁ, దపాలబిళ్ళలన్,
రాణి, మఱిం బటంబుల, నిరంతరముం గనుచుంటి; మయ్యొ! గీ
ర్వాణపదంబుఁ జేర నని కాఁగను; హిందుధరిత్రి! తద్బహిః
ప్రాణము సప్తమెడ్వరుడు నామెకుమారు భజింపు మింపుగన్.

ఉ॥ మానవమాత్రశక్తి మహిమండల మేలునె? మానవీనభూ
జానికి సప్తమెడ్వరుఁడు చంద్రిన కీర్తిఁ దమానుషక్షమా
జ్ఞానబలప్రతాపము లొసంగి, చిరాయురనామయత్వసం
తానసమృద్ధు లిచ్చి, నిరతం బహితంబు హతం బొనర్చుతన్.

శ్రీ శ్రీసప్తమైడ్వర్డుచక్రవర్తినిర్యాణము (6—5—1910)

ఉ॥ తూరుపునందు దైత్యగురుతో నరుదేరఁగఁ దోఁకచుక్క, సా
ధారణచైత్రమందుఁ గడద్వాదశి శుక్రుదినంబురాత్రి, వి
క్టోరియరాణిపెద్దకొడుకున్ భరతావనిచక్రవర్తి, భూ
భారము డించి యెడ్వరుడు స్వస్థితఁ గాంచె జగంబు చింతిలన్.

---

ఆ॥ నేల పూలతోడ, నింగి చుక్కలతోడ,
సాగరంబు ఫేనసమితితోడ,
నిండి యుంటఁ జూడ, నీయలంకారప్రి
యత్వ మభవ! కరతలామలకము. 311

చ॥ బహుళచమత్కృతిస్ఫురితభావరసాభరణప్రబంధమున్
సహృదయుఁడౌ నటన్నఁ, గవి,శ్రాంతిక దే ఫలమంచునెంచు; న
న్వహము మహాకవీంద్రులు సహస్రముఖంబుల మెచ్చుచుందురే
మహితభవత్ప్రపంచకృతి మాటికి; నే మనుకొందు? ఈశ్వరా.

ఉ॥ రాతిరి యెల్లఁ గూరి నిదురన్ మృదుశయ్యను దల్లియొద్ద, వ
ర్వాతను లేచి తండ్రియెదురన్ జర లాడెనుబిడ్డఁడుం బలెం,
బ్రీతిని మాయకౌఁగిటను మిక్కిలి మూఢత నుండియుండి, నే
నీతతి నీదుమ్రోలఁ జరియింతు మెలంకువ నొంది యీశ్వరా.

---

తే॥ వివిధవిషయప్రసక్తిని వేలువేలు
తఱుల రచితంబు లైనపద్యములు కూర్పఁ
బడినవసురాయచాటుప్రబంధమందుఁ
గ్రాల్ తురీయప్రకీర్ణప్రకరణ మిద్ది. 314



శ్రీరస్తు.

శ్రీపరమాత్మనే నమః.

# వసురాయచాటుప్రబంధము.

## స్వవిషయప్రకరణము

ఉ॥ తల జడగుంపు, దాన నెల దైవతకపున్నది, నెన్నొసంట మం
ట లెగయుకన్ను, కంఠమున నల్పు, నురంబున సర్పహారముల్,
మొలఁ బులితోలు, మై మసనపుంబసుమం, బజుకైఁ గపాలమున్,
వెలఁదుక సామెయిం, గలుగువిగ్రహమేఁ గనుమోక్షి కాంచెదన్.

---

శా॥ శ్రీరామామణిపేరిసాధ్వి వరియించెం; గాంచె నన్ జ్యేష్ఠు సు
బ్బారాయాహ్వయు, నచ్చనాఖ్యు, సుతులన్; బ్రఖ్యాత మా పాండితిం
గోరంగిం గఱపెం గుమారులకుఁ దెల్గుం గూర్మిఁ జెక్కంద్రకున్;
నూరిన్ సూరపరాజమంత్రిఁ దెలుతున్ జోడించి కేల్ మద్గురున్.

చ॥ జ్వరమును బక్షవాత మయి, వ్రాయ జనాభను మన్నెపూళులం
దిరుగ, విరోధికృత్సమఁ జనెం దివి కచ్చన, మామకప్రియా
వరజుఁడు జ్యేష్ఠమానసితపక్షమునన్ నవమిన్, గుమారు లి
ర్వుర, నతిఁ, గూఁతు లిర్వురఁ, గురున్నను ముంచి విచారనీరధిన్.

---

## విశ్వరూపస్తవము

క॥ శ్రీకృష్ణ! విశ్వరూపం
బాకొలువునఁ దాల్చినప్పు డకుఁగఁగఁ బుట్టుం

జీకునకుఁ గన్ను లిచ్చితి;
వా కిదు తత్త్వము నలువ వసురాయసికిన్. 4

ఉ॥ మీానము గడ్డమున్ నరసి, మే లనుభూతిని విద్య నేరుపన్
వాసిని గన్నదొడ్డబడిపంతులు, మాయయగారితోడ సా
వాసమునన్ ఘురంగపురి వర్తిలు, చేనవయేఁట నతురా
భ్యాసముఁజేసెఁ గీర్తికులుఁ, డన్నవరాజు; దలంతుఁ దొల్గురున్.
ఉ॥ పేర్మిమిడి నాంధ్రపండితకవిన్ ననుఁ జేయఁగ, నాంధ్రశబ్దచిం
తామణి షష్ఠహాయనమునన్ జదివించి, ఫలంబుఁ జూడకే
యామరలోక మొందితిరి; హా! పిత! సూరపరాజమంత్రిను
తాప్రియ! హరిస్తవం బిది, సుతగ్రథితం, బవధారు సద్గురూ! 6
ఉ॥ పుట్టుక దృష్టి నష్ట మయి పుట్టినయంబికపట్టి, తన్నుఁ జే
పట్టి యతర్కితంబుగ సభం గను లిచ్చినవిశ్వరూపునిన్
బట్టఁగ రానిహర్షభయభక్తులు, నద్భుత, మొక్కపెట్ట లోఁ
దొట్ట, గగుర్పు గద్గదిక దొట్రు వశం కయి, మొక్కె యిట్లనున్.
ఉ॥ శ్రీకరుణాసముద్ర! యదుసింహ! వికుంఠపదాధినాథ! లీ
లాకలితావతార! కుటిలద్విషదంతక! బంధురత్నణాం
గీకృతదూతభావ! నినుఁ గేవలమానవుఁగాఁ దలంచుమా
పాప్రకృతకృత్యముల్ సయిఁపఁ బ్రార్థన; నిశ్చల! భక్తవత్సలా!
మ॥ పరపృథ్వీశులు పాదపీఠము భజింపన్, సర్వభూచక్రమున్
బరిపాలించితిఁ; గాంచితిం దనయులన్ బ్రఖ్యాతులన్ నూర్వురన్;
జిరభోగానుభవంబు నొందితిని; లక్ష్మీనాథ! యుష్మత్పదాం
బురుహాలోకము నేఁడు నా కిదుముదంబుం గూర్ప దం దేదియున్.
మ॥ కను మర్త్యుం డతిఘోరసంతమసవుంగారాగృహంబందు బం
ధనముం గొన్నిదినాలె, నల్పి యపరాధం బుత్కటం; బచ్యుతా!

చనియెన్ బాల్యము; జాతిజవ్వనము; హా! సంఘల్లి యుగాగ్రికృతిన్
ననుమిగ్రింగెన్ జర; యుంటి నట్టిజగతిన్నా; న్యాతపాపిష్ఠుండనై.

మ॥ చదువున విన్కి, నారకము స్వర్గము, సస్యాసనంబు లిట్టి ద
ట్టిది యనుచుం గ్రహింతురు; ఘటిల్లుఁ బరంబున వాని కంటజో;
తదుభయరూపముల్ హృదయదర్పణసంగతిఁ బ్రత్నసూతనా
స్మదనుభ వాకృతిం బొరసె; మాధవ! యింటిని గంటి నే నిటన్.

మ॥ "చెడుగుల్ గూడ, నెఱుంగ నేర్చిన, మహాశ్రేయోనిమిత్తంబు"ల
న్నడుగుల్ నిక్కువమంచు నెన్నుదును; నిన్నా సర్వభూతాత్మకున్
వెడఁగుల్ గట్టెడ మంచు నాకొదుకు లివేళం గడంగం గదా
యుడిగెన్ నా చెలు; గంటిఁ బెన్వెలుఁగు; ధన్యుండన్ జగన్నాయకా.

ఉ॥ కాళుల వ్రేళులం గలుగుకన్నులు, నా కిపు డానసంబునన్
గ్రాలుటఁ జేసి, క్రొత్తలును బ్రాఁతలు గ్రొత్తలె యై పదార్థముల్,
చాలఁగ వింత గొల్పెడు; బలా! బలువింతలవింత, యీజగ
జ్జాలము నీశరీరమున సర్వముఁ దోఁచుట; పూరుషోత్తమా! 13

చ॥ కను లిటు నీప్రసాదమునఁ గల్గినదానికిఁ దో, వసంత! మ
జ్జనకునికిం బలెన్ గవనచాతురియున్ లభియించె నేని, త్వ
త్తనుభువనాద్భుతప్రథమదర్శనజాతవినూతనాత్మభా
వనశుభవర్ణనాపరిమబంధ మొనర్పనె సత్ప్రబంధమున్? 14

చ॥ వెలుతురుచీకువాలులకు వేఁడిమియే గలభేద, మంచు లోఁ
దలఁచెదుపుట్టుగుడ్డికిఁ, బదార్థవిభేదము, వర్ణభేద, మం
దులపరిమాణభేదముఁ గనుంగొనుశక్తి నిమేషమాత్ర నా
కలవడునట్లు చేసితి; మహాత్మ! భజింతు భవత్పదాబ్జముల్. 15

ఉ॥ స్థావరభేదముల్, సకలజంగమభేదములున్, వచింపఁ జే
ర్చై వినుచుందు; నైనను గ్రహింపఁగ నేరను సంజ్ఞ దృష్టిచే;

నావిషయంబునన్ ముదుక నయ్యె నిసుంగ; మదాంధ్యమున్ బలెన్
దేవ! తదజ్ఞతన్ దొలఁచి తెల్పవె నీమెయిచిత్రిమూర్తులన్. 16

చ॥ ఇమిడుచుశక్తి నీది పరమేశ్వర! యద్భుతగోచరంబు; వి
శ్వము భవదీయదేహమున, స్వల్పపుబీజమునన్ వటావనీ
జము బలె సంతరించి; తెది సాగదు నీ వెద నెంచ? నాదునే
త్రమున నజాండ మెల్లఁ జొరదా? వరదా! మురదావనీరదా! 17

ఉ॥ పొక్కిలిదమ్మిలోనినలువా మోములసామి విరించియో? కుడిన్,
మిక్కిలికన్ను గల్గి, యరమేఁ జెలి గ్రొల్గొర శంకరుండొ? నీ
యక్కునఁ బొల్చుతల్లి సిరియా? మొగమందలిజోతు, లర్కుఁడుం
జుక్కలతేఁడు నొక్కొ? వినుచొప్పిటుగాంచితి; నేఁ గృతార్థుఁడన్

ఉ॥ వాకొన రావు నీ; యెదుటివస్తులఁ గొన్నిటిఁ బోలునట్టి వె
న్నొకలలందు నంధతఁ గనుంగొనిన ట్లిపు డేస్మరించెదన్;
జీకుగఁ బుట్టనో వెనుకఁ జెందినమేనుల? వానివాసనల్
గా కవి యేమి? గంటి నినుఁ; గాంచ నిఁకన్ భవదుఃఖ మీశ్వరా!

ఉ॥ స్థానము వీడి, యెక్కడనొ జాడయుఁ దోఁపక తా నడంగినన్,
మేనును వీను బంధునరణిన్ దనకార్యము నిర్వహించుటన్,
వానిన యిప్పుడున్ దడవు వస్తువివేకముకై భవత్కృపా
దానము నాదుచావు; పరతంత్రత దానికిఁ బాపు; శ్రీపతీ! 20

చ॥ మఱచినవిద్యమాదిరిని, మాధవ! సృష్టిచరాచరాత్మకం
బెఱుకకు వచ్చె నీమహిమ, నీక్షణమే యభిధాయుతంబుగన్;
గొఱఁతలుఁ దీర్ప భక్తులకుఁ గొంగుఁబసించితివి నీవ; నీకడన్
మొఱ వృథగా దటన్నమునిముఖ్యులవాక్కది నిక్క మచ్యుతా!

ఉ॥ అంబుజమిత్రిమండలము నద్దపుబిల్లను జేయఁగల్గుతే
జంబున వెల్గునిన్ గనెదు చర్మపుఁజక్షువులున్, జిరానుభూ

తిం బడయం దరం బగుత్వదీయపృస్పృష్టపరిజ్ఞయుఁన్, నిమే
షంబునఁ బొందఁ బున్నె మెవి నల్పితినో తొలుబాముననా! హరీ!

శా॥ బృందారాజహారాద్యమర్త్యవృతు నిన్, భృగ్వాదులన్, బుత్రులన్,
గాంధారిన్, హితబంధులన్, విదురునిన్, గాంగేయు, ద్రోణాదులన్
గందమ్ముల్ వికసింపఁ గంటి నిటు; భాగ్యం; బైహికాముష్మికా
నంద మ్మొక్కటఁ గల్గె నీకరుణఁ జెందన్; నందవ్రాన్నందనా!

శా॥ పాదాంభోజమృణాళనాళముక్రియన్ భాసిల్ల మిన్నేఱు, గ్రీ
వాదీవ్యన్నిజహారవల్లరుల శేషం గ్రాలఁ దారావళుల్,
రోదోంతఃపరిపూర్ణ, నీతను వహో! రోమాంచమున్ గూర్చి కృ
ష్ణా! దృష్టుల్ మిఱుమిట్లు గొల్పు; నుపసంహారం బిఁకన్ సల్పవే.

చ॥ తలతల మంచు మించు లమితంబులుగా నుదయించి, పై హారా
ద్వాలయము నొందఁ, గేవలత విన్నునఁ దోఁచు వినీల మేఘముం
బలె, నొకదర్శనీయ మగు భావమునం గనుపట్టి, చింతలో
మలఁచి మహోజ్జ్వలాకృతిని; మాయ త్వదీయ మమేయమవ్యయా!

ఉ॥ తెల్లనితమ్మి రేకు, లెలదేఁటుల తెక్కలుఁ, గెంపు, నింద్రుజా
బిల్లిని, మల్లెమొగ్గలను, వెన్నెల, సింగము, నంటిబోదెలన్,
నల్లనివానమేఘము, నొనర్చుటకున్, విధి కాది రుక్మిణీ
వల్లభ! మాదిరుల్ మది భవన్నయనాదులుగాఁ దలంచెదన్. 26

ఉ॥ బంగరుఁ జేల మంగమున, బన్నసరంబు లురంబునందు, ర
త్నాంగదముల్ భుజంబుల, రథాంగము గేలఁ, గిరీటముం బ్రథా
నాంగమునందు, నుంగరము లంగుళులం, గలమోహనాంగ! ని
న్నంగన లెంత, యోగులు నిజాత్మలఁ బొంగి కవుంగిలింపరే!

ఉ॥ పొత్తులకందువై కెడపెఁ బూతనఁ; గానల నాల మేపుచున్
నృత్తము సల్పెఁ గాళియునినెత్తిపయిన్, మధురాపురంబులో

మత్తగజంబు మల్లులను మామను జంపె, నసంగ, నట్టిలో
కోత్తరుఁ జూడ నోఁచ, నను నుత్తల మిత్తితిఁ బాసెఁ గేశవా!

మ॥ తనయప్రేమ, మదంతరాత్మహితబోధంబుల్ చెవిం బెట్ట, కే
ననయంబుల్ ప్రియసోదరాత్మజులెడన్ వ్యాజంబునం జేసితిన్;
ననయుల్ సాధులు వారు, క్రూరుననుఁ నిచ్చన్ గోముఖవ్యాఘ్రమం
చనుకో; రుల్లము వొక్కెఁ; నిక్కలకుఁ బ్రాయశ్చిత్తమున్నే? హరీ!

ఉ॥ భానునిరాకఁ జీకటిని బాసినబైలును బోలె, లోనియ
జ్ఞానము నీదుదర్శనమునన్ నిమిషంబున విచ్చి మొగ్గగా,
మానసమొప్పె నిర్మలతమై నిపు; డెప్పుడ దిట్ల యుండ, నీ
మేనికి జీవయాత్ర విరమింప వరం బిడు ముక్తినాయకా! 30

ఉ॥ "దైవపరుండు గా వలదు; దా నలువన్ వలె నర్వపౌరుషం;
బావల దాని దిద్దు విధి" యం చెఱిఁగింప, నెఱింగియున్ ఫలం
బీ వవతారమూర్తివి హరీ! నభయం దిటు నంధి కెన్ని యో
త్రోవలు దొక్కి; తీజడమతుల్ విన; రేల వృథాశ్రమం బికన్?

ఉ॥ "ఇలతలబర్వు డించుటకు నెత్తితి వీ వవతార" మందు; ర
క్కలనము దీఱ నొక్క కలిగెం బలువేఱిమి వీరి కిట్టు లి
క్కలమునఁ; దప్ప దేది గన, ఘోరపుసంగర; మయ్యెడున్ మహా
ప్రళయము; ధర్మమున్నకడ వ్రాలు జయ;మ్మని నిశ్చయించితిన్.

మ॥ కొలువున్ వీడక మున్న చేయు మరలం గ్రుడ్డిన్ ననుం గృష్ణ! వే
వెలుఁగ జ్ఞాకరమట్టు; లీకనుల నే వీక్షింప నీ కన్యమున్;
నలినాక్షా! వెలిఁ జీఁకటయ్యెఁ ద్రుటి; నైనన్ దొంటియట్లొందకు
మ్మల, మానందము గందుఁ గంచు నిను బ్రహ్మాండాధిపున్ లోవెలిన్.

ఉ॥ అంధుఁడ నాకె కాక యిపు డందఱకుం జగ మంధకారమే;
సింధునుతామనోహరుఁడ! శ్రీహరి! హస్తిపురంబు వీడితే?

బంధుసుహృత్కుమారపరివారసమూహసహాయభూమిభృ
త్సింధురసైంధవాదులకుఁ జెల్లెనె యొక్కటఁ గాల మక్కటా!

క॥ అనె; మీఁదటివృత్తాంతము
జనకా! భువి నున్నయపు డసకృదావృత్తిన్
వినిచితిరి మీర యొరులకు
వననిధిగంభీర మైనవాచాధాటిన్. 35

క॥ భవహరము విశ్వరూప
స్తవ మిది వసురాయకవి పితకు స్వర్గస్థునకున్
జెవి నిడియెఁ బొడమఁ బ్రియదా
శ్రీవు సూరపరాజమంత్రిసుత్రామునకున్. 36

క॥ కొఱవడినకనుల నిడినన్
గతివేల్పును బుట్టుగ్రుడ్డి గని పొగడినయీ
చిఱుఁగబ్బము వసురాయం
డఱువదిరెండేండ్లయీడునందు రచించెన్. 37

క॥ తారలు నభమున నెటు లటు
తారాసంఖ్యాక మైన స్తవపద్యంబుల్
ధారుణి నివి శోభిల్లును
సూరపరాజాత్మభవవసుకవికృతంబుల్. 38

---

—• జనాదికము •—

సీ॥ పుట్టుక పాసెర్లపూఁడిలంకను, దండ్రి
బందుగులింట నానందయందు;
మొత్తనిపొత్తుల నత్తమిల్లుట, శైశ
వక్రీడ, పదాశొంకువత్సరముల

ప్రాయంబు ననుక, నారంగ మాకోరంగిఁ;
గన్నవారలవియోగంబు నటనె;
యత్తయు మొదలు పరాన్న మేడేండ్లు దొ
డ్డమ్మపేట దివాణమందు; శ్రీము
ఖాబ్దమున సొంత కాఁపుర మక్కటికనె,
ప్రథమజాయావియోగహృద్వ్యథయు; భావ,
రాణ్మహేంద్రంబునందు నాంధ్రంపుటొజ్జ
పదవి; వసురాయచరితంబు ప్రథిత మవల. 39

క॥ ఆనందను, శ్రావణమున,
భానుదినోపేతశుద్ధపంచమితిథిఁ, జి
త్రానక్షత్రాదిఁ, గులీ
రానన్, సుదృఢాత్ముఁడు వసురాయఁడు పొడమెన్. 40

చ॥ ఇనుఁడు బుధుండు లగ్న మగునెండ్రిని జంద్రుడు మంగళుండుఁ గ
న్య, నళిని గేతువున్, మకరమందు గురుండు, వృషంబునందు రా
హ్వనతనుజాతులున్, మిథునపింటను శుక్రుఁడు; వక్రులందు నిం
దునితనయుండునుం గురుఁడునున్; వసురాయనిజన్మపత్రికన్. 41

ఉ॥ గౌతమిఁ గట్టి కాలువలు కాటను ద్రవ్విన కాలమందు సం
భూతుఁడ నైనవాఁడఁ బదుమూఁ డగునేఁడులయామతల్లికిన్;
మాతకు లేమిఁ బాలచట మంటిని మోసెకునుప్పరమ్మలే,
ప్రీతిని నన్నుఁ జన్గుడిపి పెంచిరఁ, టేమి ఋణానుబంధమో? 42

మ॥ జననం బాది పదేండ్లు మామకనివాసం బయ్యెఁ గోరంగి; యా
వెనుకన్ దొడ్డమపేట యయ్యె నటులే; వేయేండ్లకున్ రాణ్మహేం
ద్రినివాసంబును నేఁటి కేఁబదికిఁబై దాఁటెం గదా; యైనఁ, బాం
గును విన్నన్ హృది, పిన్ననాఁటి నెల వాకోరంగివర్ణత్రయిన్. 43

వృథుగృహచ్ఛిద్రగుప్తిస్నేహధూర్వహ,
మిలుతేఁటులకు సొంతగృహము సూవె;
కాయయాత్రికష్టకంటకోపానహ,
మిలుతేఁటులకు సొంతగృహము సూవె;
గీ॥ మధురసంపక్వరయోరుహమధులిహమ్ము,
నిల్లుతేఁటులకును సొంతగృహము సూవె;
నైకదివ్యఫలామరానోకహమ్ము,
నిల్లుతేఁటులకును సొంతగృహము సూవె. 49

సీ॥ సుందరాకృతిఁ దాల్చి ముందు నిల్చి ప్రమోద
కంధిఁ దేల్చునవ్వ కాయకష్ట మిల్లు;
శీతవర్షాతపవాతభీతి నడంచి
తాల్మిఁ బ్రోచెడికన్నతల్లి యిల్లు;
దేహధర్మమునందు నూహ పాఱినతోన
మీఱునారటముపేరూఱ టిల్లు;
నతిథి నభ్యాగతి నాదరించుమహోప
కారబుద్ధికి సహకారి యిల్లు;
తే॥ పేరుఁ బ్రఖ్యాతి రాఁగలదారి యిల్లు;
సప్తసంతానములతోడ సాటి యిల్లు;
సంచితార్థంబులకు నెల్ల శరణ మిల్లు;
చాల నుడు లేల గార్హస్థ్యమూల మిల్లు. 50

సీ॥ "గ్రాస మన్యుల దైన, వాసంబు తనది గా
వలె" నన్నలోకోక్తిఁ దలఁచి తలఁచి,
"యిల్లు లేనమ్మ తా హీనత 'పడు" నన్న
యాఁడుసామెత సారె కరసి యరసి,

"పరగృహావాసంబు సిరయుజేల్పు" నను
వండితవాక్యంబుఁ బట్టి పట్టి,
పిల్లి పిల్లలఁ బోలెఁ జెల్లుసంసారంబుఁ
దరలించి యిల్లిల్లుఁ దిరిగి తిరిగి 51

తే॥ యీసడంబులఁ బడి పడి, యిటికి యిటికి,
విసిగి, వేసారి, యీశ్వరు వేఁడి వేఁడి,
యిరువదేం డుండి రాజమహేంద్రనగరి,
నిపుడు మన్మథ వసు రాయఁడిల్లు గట్టె.

ఆ॥ గజమునొద్ద గున్నకలభంబుగతిఁ, బోగ
యోడ వెనుకఁ జిన్నయోడపగిది,
రాణ్మహేంద్రనగరి స్త్రైనింగు కాలేజి
మేడకుడిని, వసునిమిద్దెటిల్లు. 52

—• నూయి •—

శా॥ నూయీ! నేజయనామశాబ్దమున నిన్నుం డ్రవ్వఁగాఁబూనికొం
కాయల్ గొట్టితి; వానితోయములె తత్కాలప్రభావంబుచే
నాయెం గావలె నక్షయంబు లిటు నీయందుం, ద్వదర్థంబు రూ
పాయల్ నూర్వ్యయపెట్ట, నీవమృతకుంభం బైతి మాపాలికిన్.

క॥ నీ వున్నా, వన లున్నది;
బావీ! నీక్రింద వెచ్చపడ్డ శతముపై
వేవేలు వచ్చువడ్డిగ
భావింతుం, దావకీనపానీయంబుల్. 54

---

ఉ॥ ఉత్తరమందు వడ్లమరలోరులు, దూర్పున రైలుఘోషతోఁ
గ్రొత్తగ సాగుచున్నయపురూపపుఁ "గృష్ణసినీమ" గొల్లుఁ, డో

లోన్నత్తులు నాటకంపువెలముక్కలనమ్మఁగ యామ్యమందు, నీ
గత్తర లింటి చుట్టు; నెటు గంటికిఁ, గూరుకు పూర్వయామినిన్.

—• పుత్రిజననాదికము •—

చ॥ భవుకము; చాంద్రిమాననలవత్సరమార్గశిరంపుశుద్ధపున్
నవమిని, వేకువన్, రవిదినంబున, నుత్తరభాద్రిరిక్కమూఁ
డవచరణంబుఁ దాఁకినఘటన్, వసురాయనికిన్, సుశీల స
త్యవతికిఁ గల్గెఁ బుత్రుఁడు, చిరాయువు వంశకరుం డితం డనన్.

క॥ చనుమఱకిింద మ ఱొకచిఱు
చనుమఱవలెఁ దోఁచు మచ్చ, సరవిని వసురా
యనికిం, దన్నలసంభవ
తనయునికిన్, వామమందు దక్షిణమందున్. 57

చ॥ లగనమునందు శుక్రిఁడు తులన్; రవిసౌమ్యులు వృశ్చికంబులో
నఁ; గుజవిధుంతుమల్ ధనువునన్; శశిమీనమునందు; మేకయిం
ట గురుఁడు; కేతువొండు మిథునంబున; మందుఁడుకర్కటంబునం
దు; గురు డు వక్రి లర్, జుఁడునున్, వ.సు.సీశ్వరు జన్మపత్రికన్

8-6-1921 దుర్మతి స॥ జ్యేష్ఠశుద్ధతదియ బుధవారము

సీ॥ శ్రీవేదమూర్తు లౌ చెళ్ళపిళ్ళాన్వయ
వేంకటవిద్వత్కవీ! జొహారు;
వసురాయఁడు సఖుండు ప్రార్థనాపూర్వక
విజ్ఞప్తి మీకుఁ, గావించుకొనెడు;
నైదవయేఁ డాట నక్షరస్వీకార
మస్మత్కుమారున కవసరంబు;
మొదల మీయోజ్జనం బొదవిన, వానికిఁ
గరతలామలక మౌఁ గళ లటంచు

తే॥ నీశ్వరుఁడు నాకుఁ దోఁపింప, నితని, సుతుని
మాతులుని, బంపితిని మీసమునకుఁ;
బ్రార్థనము వృథ పుచ్చక బయలుదేఱి
వచ్చి హితుకోర్కె యీడేర్ప వలయు రేపు. 59

సీ॥ శ్రీవేదమూర్తు లౌచెళ్ళపిళ్ళాన్వయ
వేంకటవిద్వత్కవిప్రథితుఁడు
తండులంబుల నిండుతళియ, మధ్యమ యొక్క
నుంగ్రపంగళిఁ బట్టి, యోనమాలు
వరుస నొక్కొక్కఁడే వ్రాయించి చదివింప,
నక్షరస్వీకార మైన వేఁట,
దుర్మతి జ్యేష్ఠముతొలుపక్షపుఁజతుర్థి,
నమరేజ్యవారోదయము పునర్వ

తే॥ సుపత్రియుక్తకర్కటమున, సుతున కీశ్వ
రప్రసాదరాయనికి శుభప్రదముగ
జరిపె వసురాయకవి, తాను సతియు, బంధు
మిత్రకవిబుధాశీర్వాదమేదురముగ. 60

ఉ॥ ఐదువివాహముల్ వరుస నాబ్దికమాత్రఫలంబు లైన, నే
నాదను నల్వదెన్మిదివయస్సున నాఱవపెండ్లి యాడఁగా,
గాదిలికూఁతురుం గొడుకుఁ గల్గిరి; దానికి వడ్డి, దుందుభిన్
శ్రీదయితప్రసాదమునఁ జిన్నికుమారుఁడు పుత్రిపూర్ణకున్. 61

తే॥ దుందుభిని, భాద్రపదకృష్ణమందుఁ, దదియఁ,
బంగుదిననిశఁ, బ్రథమభప్రథమపంఘ్రిఁ,
బ్రథమలగ్నమ్మున జనించెఁ బ్రథమపుత్త్రుఁ,
డనుఁగుగుడిపాటిసూర్యనారాయణునకు. 62

ఉ॥ ఇందుఁడు మేషలగ్నమున, హేళి మృగేంద్రమునందుఁ, గన్యలో
మందుఁడు సౌమ్యరాహుసురమంత్రులునుం, దులశుక్రుఁ, డుర్వరా
నందనుఁ డొక్కఁడుం ధనువునన్, మఱి మీనమునందుఁ గేతు, వీ
యందమునం గ్రహాళి వసునాత్మజతొల్సుతుజన్మపత్త్రికన్. 63

క॥ ఎఱజీడిమావిపిందెను
జిఱువి తోకఁ డిపలఁ దోఁప సృజియించినవాఁ
డొఱ పగుతిలకాలకముం
గుఱు తిడె వసురాయదుహితకుఱ్ఱవితలపై. 64

6-4-1921 రౌద్రి సంవత్సరఫాల్గుణ బ ౧3 బుధవారము.

పుత్త్రికయగు చి॥ సౌ॥ అన్నపూర్ణయత్తవారియూరగు కోరుకొల్లునకుఁ బయనము సేసినసందర్భమున రచించినపద్యములు.

క॥ తాడేపలిగూడెముకడ
జోడెద్దులబండి యెక్కి, సూనుఁడు నేనుం,
జేడియు, యాబిడపెదతలి,
దో డేగురుఁ గోర్కొలనికిఁ దొడఁగితి మేగన్. 65

ఆ॥ గణపవరము చేరెఁ, గమలాకరం బందుఁ
గన్న మాయు చుండఁ గంచరంబు;
ఉండి చేరెఁ, జుక్క లుప్పరంబునఁ దోఁపఁ;
జెఱకువాడఁ జేరెఁ, జీఁకటిపడ. 66

క॥ పా లున్నతల్లిపిల్లల
పోలిక గా, నుండికాల్వపొడుగున దాళ్వా
చే లెన్నొ, పొట్ట నిండం
బాలను బోసికొని యేపుమైఁ జూపట్టెన్. 67

ఆ॥ గాలి మబ్బు వాన గలయమీసతమిస్ర,
దారి దప్పి, పేరెడారి బీతు

గూరి, తిరుగుబాటసారిమూడిరి, వేవె
లుంగుమేలు నెవఁ డెఱుంగఁ జాలు? 68

తే॥ రాద్రితుదినాఁటిభీకరరాత్రి నుండ
వలసెఁ గోర్కొల్లుదరిని గోపాలపురిని;
నందు నాగేశశాస్త్రి వృద్ధాదరించి
మఱపు రానియాతిథ్యము మా కొసంగె. 69

తే॥ కూర్మి విందు తాడేపల్లిగూడెమందు
గయుఁడు తొలిమజిలీ సల్పెఁ; గాన దారి
సౌఖ్య మగు ననునూహకు సాక్ష్య మొదవె
మును జెఱకువాడ, గోపాలపురిని వెనుక. 70

తే॥ ప్రాప్తనూతనవర్షదుర్మతిని మొదలి
నెల, మొదలిపక్షమునను, మొదలిదినమున,
మొదలిరిక్క, మొదలిసారి, మొదలిపట్టి
రమణునూ రొక్కరుకొ ల్వసురాయఁడు కనె. 71

క॥ శనివారదుర్ముహూర్తము
చనునంతకు నూరిబయలిజామాతృరసా
లనవారామమునం దా
మనిసిరిఁ గని, కంటి మవల మాబంధువులన్. 72

చ॥ ఇలుకడ బైలుదేఱునపు డే నెద వేఁడితిఁ, బానకాలమం
గళగిరినారసింహుని, "సుఖంబుగఁ బైనము సాగనిమ్మ, గా
దిలినుతఁ బూర్ణఁ దోడుకొని దేవరకొండకు వచ్చునట్లుగా
సలుపు," మటంచుఁ; బ్రస్తుతము సామి ద్వితీయము నడ్డె నేలకో?

క॥ అల్లునిమంచితనం బది
తెల్లని కాకి యనుకొంచు, దేవుని మ్రొక్కం

జెల్లింప మంగళాద్రికి
వెళ్లక, మళ్లితిమి తొల్లి వెళ్లినదారిన్. 74

చ॥ పదకవితల్ రచించుహరిభక్తుఁడు, పూర్ణ నానందభర్త, సం
పద గలగేస్తు, వృద్ధడవివంశ్యుఁడు, లక్ష్మయ, తాళ్ళపాకెమం
దుదయమె దారిలో మముఁ బ్రియోక్తుల బంధులనాఁగి స్వీయమా
సదనమునందు విం దధికసత్కృతి నల్పెను దాను బిడ్డలున్. 75

చ॥ కువకువఁ గూయుకోయిలలకూఁతలచేతను వీనువిందు, న
న్నవవలిగాలికందువలనున్న నితాఁకున మేనివిందుఁ, గ
మ్మనలపుఁ గ్రుమ్మరించుకుసుమమ్మలజృంభల నాసవిందు, వే
కువనె ఘటిల్లు; విందు లిటు గొల్లలు వేంకటరామయా! భవ
ద్భవనమునన్ వసంతమునఁ బాంధులకున్,వసురాయహృత్ప్రియా!

క॥ అన్న కఱవయ్యె నసుమా
యన్నివిచారంబు దూర మాఁ జేరువలో
నున్నత్రిదశసము నిన్నున్
బిన్నం గనఁ, జెఱకువాడ వేంకటరామా! 77

తే॥ ఆత్మనలరించు నిష్కళంకానురాగ
మెటు లొదవె వసురాయునియెడలఁ జెఱకు
వాడ వేంకటరామయామహ్వాయున? కైన
సంభవిల్లదె చెఱకున స్వాదురసము? 78

చ॥ కొలఁకువెడందనోర్వనలకున్ నలుమూలలఁ దాఁకునెండమం
టలఁ దెర లెత్తి క్రాఁగునెసటం గలయంబడి క్రిందు మీఁదుగా
మిలమిలలాడు చొ ళ్ళుడుకుమీలరుచిం గన మూఁగువెల్లకొం
గలొ యనఁ దోఁచె వేసవిని గణ్పవరహ్రదపుండరీకముల్. 79

క॥ ఇలు వెడలినయీరేన్దిన
ముల కే మేపురము భద్రముగ నిలు నేరం

గలిగితిమి మరల, శ్రీమం
గళగిరినరసింహదేవుకారుణ్యమునన్. 80

---

వీడుకోలుసంభాషణము.

(1916 సం॥రం జూలై నెలలో నేను బోధనాభ్యసనకళాశాలనుండి శాస్త్రకళాశాలకు మార్పఁబడినపుడు జరిగినసభలోఁ జదివినవి.

క॥ శ్రీహరి,యిట వసురాయ
స్నేహంబునఁ గూడుకొన్న శిష్యులకుఁ,సదు
త్సాహసహకారిసుజన
వ్యూహమున,కభీష్టసిద్ధు లొనఁగుం గాతన్. 81

శా॥ నాతోఁ బుట్టితి వన్న హేతువున నిన్ మాతోడఁబు ట్టంచు,నేఁ
బ్రీతిన్ నీకనుముద్దుబిడ్డలకు మచ్ఛ్రీసూక్తులం గూర్చితిన్;
ఖ్యాతిం గాంచినబోధనాభ్యసనవిద్యాశాల! యెం దుండినన్,
జేతోబంధము నాకు,నీనుతులకు,న్నీకుం,దృఢంబే సుమీ. 82

మ॥ నియతిం బ్రైమరి పేరఁ బుట్టి,పయి నిన్ని స్పెట హైస్కూలు,యూ
నియనాఖ్యోన్నతపాఠశాల వయి, ట్రైనింగ్ కాలెజీ నా మహో
దయముం బొందితి;బోధనాభ్యసనవిద్యాశాల! భవ్యత్వదా
శ్రియని శ్రేణి లభింప,నెక్క రెవరు చైచ్ఛస్థాన మస్మాదృశుల్?

మ॥ పిడుగుంబాటునఁ దోఁచుదోసమునహో పేర్మాతె; నైనన్ నిలం
బడె నీ కెప్పటిగౌరవం;బడె భవత్ప్రాగున్నతిం గూర్చెడున్;
దడవుం గా దిఁక, జార్జిభూవిభుజయధ్యానంబుతోనే వినం
బడు నిన్ గూరిచి,బోధనాభ్యసనహర్మ్యంబా! శుభోదంతమున్.

మ॥ అనుఁగుంబాలకబోధనాభ్యసనవిద్యాసౌధమూర్ధన్యమం
డనవిద్యార్థికుమారులార! మనడెందాలం దొలంకాడుహే

చ్చనురాగం, బధికోష్మ మభ్రిసలిలంబట్టుల్, బయల్పుచ్చఁదా
ననుకూలించుట, నస్మదీయవిరహం బన్యోన్యహార్దంబ యా. 85

మ॥ వనమం దొక్కకిరాతుఁ డాది గురుభావం బొందుమృద్విగ్రహం
బునఁ గావించుచు, నేయ నేర్చి స్వకృషిం, బూజించె నయ్యెజ్జఁ బ
త్తనసంశితుతు లైననాగరకవిద్యార్థుల్, పెడంబాటు వే
శ నుపాధ్యాయునెడం గృతజ్ఞతను దెల్పక్ సల్పరే సద్విధుల్?

మ॥ తలిదండ్రుల్ దయఁ బెంచు దేహము నుపాధ్యాయుండు చేపట్టి, య
ర్మిలి దానిం బురుషార్థసాధనముగా, శ్రేయోనిధానంబుగా
జలుపుం; గాన శుభద్వితీయభవమున్ సంస్కారరూపంబునం
గలుగం జేయుగురుండు, శిష్యునకు సత్కారార్హుఁ డెక్కాలమున్.

మ॥ చదువున్ నేర్పనతండు ఛాత్రునకు సాక్షాద్దేశికుం; డొజ్జకుం
జదువు న్నేర్పనతండు గౌణగురుఁ డెంచం; బాలురారా! బడిన్
మదికిన్ మీచిరమైత్రి నొనసుభవజ్ఞానాదికంబున్ నెన
ర్వోదలన్ నేఁడలపోసి, కోరుదు శుభంబుల్ మీకు వాలాయమున్

ఉ॥ భక్తియొ ప్రేమయో గలుగుపట్టుల, వారికి దేనియందు నా
సక్తియొ దాని సల్పుటయ శ్లాఘ్యతమం బగు; బాలురార! యీ
యుక్తిఁ దలంచి, నం దసుప నూహ యొనర్చెద రేని, శ్రద్ధమై
రక్తి వహింపుఁ డాంధ్రమున; రం డట కీ రిట గెల్చి చెచ్చెరన్.

చ॥ ఇరువదియేండ్ల కెక్కుడుగ నీబడి నల్పుమదీయ మొజ్జనం
బరసినకృష్ణనాములయు, నర్జునమూర్తులయున్, మహాకృపం,
జిరపరికాంక్షితోత్పదము చేకుఱె రాజకళాలయంబునన్,
బురజనపారకోపకృతిఁ, బొందుగ నందఱ కేఁ గృతజ్ఞుఁడన్. 90

మ॥ కరుణాపేశలమానసా! శుభగుణాకారా: యుపాధ్యక్షు! సో
దరవాత్సల్యపరస్పరప్రియసహోపాధ్యాయవర్గంబ! ని

ర్భరభక్త్యుల్బణచాతురీవివశభావచ్ఛాత్రసంఘుంబ! యీ
యరె నా కానతి, మీదుసన్నిధిని బాయం,బోఁగళాశాలకున్.

ఆ॥ పోవ నూరు విడిచి పొరుగూరికి; మదీయ
గృహము బడికి సన్నిహితమె; గాన
వచ్చి పోవు నవుడు నిచ్చఁగం చుందు; మె
వ్వటిప్రియంబె నిలుపఁ బ్రార్థనంబు. 92

21-6-1913 పై వరుసలోని చివరదంత మూడుఁగా రచించినవి.

ప్రమాదీచ సం॥ జ్యేష్ఠబహుళ 3 శనివారము.

చ॥ ఎడలఁగఁ బాలపండ్లు, మొలకె త్తితి వెన్నఁడో పిన్ననాఁడు; నేఁ
గుడిచెద నిష్ట మాబిఱునుఁగూడును, గూరలు, వర్వు, లప్పడాల్,
వడియములు, వేఁగుభక్ష్యములు, వాచవిగింజలు, నీబిగిం; గటా;
యుడిగము నేఁబడే శ్నలిపి యూడితివే వసురాయదంతమా! 93

చ॥ తెలివి ప్రకాశమాన మగు దేహబలంబునఁజేసి; దేహపుం
బలము ప్రవర్ధమాన మగు మర్త్యున కిష్టపదార్థభుక్తి చే;
వలయుపదార్థముల్ దినుట త్వత్పటిమం గద; యింత యేల? నీ
చెలిమిన భక్ష్యభోజ్యరుచి జిహ్వ కలంతివె నీవు: దంతమా! 94

ఆ॥ పోయి వచ్చువస్తువులవియోగంబునఁ
బుట్ట దారటం, బ వెట్టి వైన;
నీవిధంబు నరయఁ, దావకవిరహంబు
తరమె విస్మరింప? దంతవరమ! 95

క॥ స్థానభ్రంశము నొందిన
చో, నఖములు దంతములును శోభిల; వైనం
గానమె గౌరవ మెనయం
గా నవి, వ్యాఘ్రముల వైన, గజముల వైనన్? 96

తలపైని జూపపెంకు వడఁదోసినకాకినిగూర్చినది.

శా॥ నాకుం దానపువేళ సోఁకునను బెగ్గాయుంబుగాఁ దోసి, తో
కాకీ! యెత్తిలుచూరు పెంకు, నభియోగం బుండ దగ్రత్రుళ్ళచే
నీరగ్గానని చేష్టలన్ సలిపె దీ; వే మాయెం మం దిందుకున్
లే కున్నే? నిను గచ్చపప్పు నిడి నీల్గింపండె యేబోయఁడో? 97

---

స్వప్నమునందు వర్షము కురియుట చూచి వర్ణించినది.

మ॥ మచతురంగాకృతిమింటఁబన్ను మొగుళుల్ ఝూంఝుమదుద్వేగసం
గతి నుద్రిక్తము లౌచు, నొండొకటి పీఁకం దాఁకఁ, జంచత్తటి
చ్ఛితహేతుల్ మిఱుమిట్లు గొల్పఁ గనులన్; ఘోరవంబుల్ చెవుల్
సతతంబుం బధిరం బొనర్పఁ;దుడిఁ గీలాలంబు వాఱెన్ భువిన్.

1882, సం॥లో నేను శ్రీసూక్తివసుప్రకాశిక మనగ్రంథము రచించునప్పుడు దానియందలిద్వితీయభాగములోనియేఁబదినాలుగవ పద్యము నొకరాత్రి భోజనముచేసి యారంభించి

చ॥ చతురుఁడు దూరభీరుతయు సమ్ముఖశూరత చూపు, వంచనా
చతురుఁడు కేవలం బతనిచర్యలకున్ విపరీతకార్యుఁ డు—

అనిపూర్వార్థమును ముగించితిని గాని,నే నాపుస్తకమందుఁ జేసికొన్న నియమముచొప్పున నయ్యంశమునకుఁ దగినలోకదృష్టాంతము స్ఫురింపదయ్యెను. అందుచేత నారేయి యంతయు నామనస్సు తత్సాదృశ్యముకొఱకు లోకమంత గాలించినది కాని, నిద్రలేమి తక్క నందువలన ఫలితమేమియుఁ గనంబడదయ్యె. అట్టిసమయమునఁ గవనమహిమను గూర్చి యీక్రిందికందము రచించితిని.

క॥ అమృతకవనంబులకు సా
మ్యము కేవల మొక్కమధురిమ నె, కాదు సుమీ,

సుమనోజీవనములు నై
యమరత్వము ననిమిషత్వ మవి యొదవించున్. 99

---

1884 సం॥రం లో ఆర్ట్‌మన్ అనునమెరికాదేశీయుఁ డగు నొకపాదిరీ రాజమహేంద్రవరములో మిషన్‌హైస్కూలు స్థాపించెను. ఆదొరకు నే నప్పుడు తెలుఁగు నేర్పుచుండినందునను, జీత మెచ్చుగా నిచ్చెద నని యాయన చెప్పినందునను, బైతరగతులకుఁ బాఠము చెప్పఁ జేకూఱు ననుఉత్సాహమునను, నంతకుఁ బూర్వము నే నున్నయిన్నీసుపేట నడిమితరగతిపాఠశాలయందలి పదునేను రూపాయలవేతనము గలయుపాధ్యాయత్వమునకు విడుదల యిచ్చి, యిరువదియైదురూపాయలజీత మేర్పఱిచిన యీక్రొత్తయుద్యోగమునఁ బ్రవేశించితిని. అప్పాఠశాలయందు నామిత్రులు నిడమర్తి జలదుర్గాప్రసాదరాయాదులు కూడ నుపాధ్యాయత్వమునఁ గుదిరి యున్నందునఁ గొన్నిమాసములు వేడుకగాఁ గాలముగడచెను; గాని యప్పాదిరీదొర యీసంవత్సరము సెప్టెంబరు 17 వ తేదీరాత్రి యీ నన్నమరణుఁడు కాఁగా, నిఁక ముందు పాఠశాలగతి యేమగునో యని నాఁడు మిక్కిలి విచారము కలిగినది. కొంతసేపు మిత్రుల మందఱము, కలిసి మాటలాడికొని ప్రొద్దుపోయినపిమ్మట నిండ్లకు బోయి శయనింపఁగా, దెల్లవాఱుజామున నీక్రిందిపద్యమున వర్ణింపఁబడినచొప్పున నాకొకస్వప్నము వచ్చినది.

తారణ సం॥ భాద్రపద బ ౧3 బుధవారము. 18-9-1884.

ఉ॥ కాఁపుర మున్నయింటిపెణకం, గలలోన మహాత్మ-రాశకీ
లాపటుజిహ్వ లార్చు చనలం బెగయంగను, గుండె వ్రక్కలై
యాపద కంగ లార్చితిని; నంతటిలోఁ బయికప్పు మ్రగ్గె; నా
హా! పరమాద్భుతంబు, చెడ దం దొకవస్తువు; మేలు కాంచితిన్.

ఈకల నిక్కల యయ్యె. ఇంటికవ్వ కాలిపోయినట్లే పాఠశాలాధిపుడై నయూదొర యారాత్రియే కాలధర్మము నొందెను. ఇంటియందలిపదార్థ మొకటియేనియుఁ జెడనియట్లే బడియందలి యెవ్వరికిని జీవనహాని కలుగదయ్యెను. ఆర్ట్మన్ దొరగారు గతించిన తోడనే మిషన్ వారిచేత నిరాకృత మైనను డీటిక్కు అనుమతి యొకపాదిరీదొరచేత 1885 సం॥ మునను, నైకమత్యముగలతదుపాధ్యాయులచేతనే 1886, 1887 సంవత్సరములను బోషింపఁబడి, పూర్వోక్తమైన మిషన్ హైస్కూలు తుదకు 1888 వ సంవత్సరమున యూనియను హైస్కూలునఁ జేర్పఁబడెను. (చూ. ప్రశంసాపత్రికరణము పే. 76) ఈయూనియను హైస్కూలే 1894 సం॥ లో ట్రయినింగు కాలేజిగా మారెను. (చూ. స్వవిషయపత్రికరణము పే 267, ప. 83) స్వప్నము లిట్లు కొన్ని భావిఫలసూచకము లని తెలుపుట కీవృత్తాంతము వివరింపఁబడియెను.



చిత్రభాను సం॥ భాద్రపదమాసములో (1882 సెప్టెంబరు) నాకు ద్వితీయకళత్రవియోగము ప్రాప్తించినది. కొన్నినెలలు జరిగిన పిమ్మట బంధుమిత్రులు పెక్కండ్రు నన్ను వెండియు గార్హస్థ్యమునఁ బ్రవేశపెట్టుటకై యోజించిరి. తృతీయవివాహమునకు నాకుఁ బూర్వ నాప్త లూహించినకన్యకను జూడ వలయు నని యభిలాష పుట్టి, నాకు మిత్రుఁడును గన్యకకు దగ్గఱచుట్టము నైనయొకనితో నామనోరథము తెలియఁబఱిచితిని. అప్పు డతఁడు పున్నమ వెళ్ళినతరువాతఁ గన్యకను దద్బంధువు లీయూరు తీసికొనివత్తురప్పుడు చూడ వచ్చు నని చెప్పెను గాని యెన్నిపున్నమలు వెళ్లినను నతనిమాట నెఱవేఱదయ్యెను. అందువలన నొకనాఁ డీపద్యమతనియొద్దఁ దద్విషయమున రచించి చదివితిని.

క. పున్నమ వెన్నెల తేఁడే
మెన్నో మాఱులు లభించె నీక్షించుటకుం;
గన్నులు కాయలు గాచినఁ,
గన్నియ నెమ్మోము చూడఁ గలుగదు సఖుఁడా! 101

ఈక్రిందిపద్యము నేను గొన్నియేండ్లక్రిందట రైలులోఁ బ్రయాణము సేయుచు రచించి, కాకినాడలోఁ బోలవరపుజమీందారు కొచ్చెర్లకోట వేంకటకృష్ణారావుగారును దివాకర్ల తిరుపతిశాస్త్రిగారును గూడుచున్నచోట గుండలించిన పదము విడిచి మిగిలిన దంతయుఁ జదివి, విడిచినపదమును బూరింపుఁడని వారి నిరువురఁ నడిగితిని తిరుపతిశాస్త్రిగారు పూరింప లేకపోయిరి. వేంకటకృష్ణారావుగారు 'కలువ' యనిపూరించిరి. అదియే నాయభిప్రాయము.
తే॥ కన్ను మోడిచి పగళులు గాఢనిద్రఁ
గనును; గను విచ్చి రేలు మేల్కొనుచు నుండు;
నిది నిశాటాంగనయొ; కాసిమొడలఁ బాంథ
హృదయపుటభేదనము సేయు నెట్లు? (కలువ) 102

---

1885 సం॥ ప్రాంతమున నేను ముద్రింపించిన శ్రీసూక్తివసుప్రకాశిక మనునీతిపద్యగ్రంథమును బాఠశాలలోఁ బఠనీయముగా నేర్పఱుచుటను గుఱించి, యాకాలమున యూనివర్సిటీపరీక్షలకుఁ దెలుఁగుగ్రంథములను నియమించునధికారము గల సమర్థి రంగయ్యసెట్టిగారికిఁ, దన్ముద్రితగ్రంథము పంపుచు వ్రాసినపద్యము.
చ॥ పుటలనుమళ్ళలోనఁ గొని పోసినవాఁడ సువర్ణబీజముల్;
పొటుకునఁ జిన్కులేక యవి పొట్లుచు నున్నవి; రంగనాథ! యు
క్కటికపువర్షముం గురిసి, గ్రక్కునవాని ఫలింపఁ జేసెదో;
యిటులిఁకఁ జేయఁబోకు మని, యీవ్యవసాయము మానిపింతువో!
(కప)

చింత చెట్టు.

సీ॥ * బడికిఁ గొంపో వచ్చుబంట్రౌతుఁ గనుఁబ్రామి
పిననాఁడు ననుఁ జంకఁ బెట్టుకొంటి,
† కంఖాణశకటవేగంబు నాఁగి, యనేక
వాక్య సార్థముగఁ బ్రాయమున మనిచి,
‡ తడుగు, లొదల, శారదాతప మేర్వ, నా
తిథ్య మిచ్చితి నీద దేర ముదిమి,
ననుదిన మపు డిప్పు డనక జిహ్వాకఁ జారు
భావంబునను దుష్టిపఱుచు చుంటి,
గీ॥ నవ్యకోరంగి; రామచంద్రపురదక్షు
వాటికారథ్య; గోవూరిబాహ్యసీమ;
నచటు నిచ టన కెల్లెడ; నామ్లభూజ!
నీఁకు వసురాయఁ డేదారి నీఋణంబు?॥ 104

---

* 1864 వ, సంllనఁ గోరంగిలో నింగ్లీషుపాఠశాల స్థాపింపఁబడినది. ఈకాలమున బాలికాపాఠశాలలోనిపిల్లలను బ్రతిదినము బడికిఁ దీసికొనిపోవుట కొకయాఁడునౌకరు నేర్పటిచినట్లుగా నాదినములలో నింటింటికివెళ్ళి బాలకులను బూఁటఫూఁటకు బడికి హాజరు పెట్టుటకై యొకమగనౌకరును బెట్టినారు. ఇప్పటివలె బడి పదిగంటలకుఁ గాక, తెలుఁగు బడులవలెఁ బ్రారంభమున నుదయకాలమందే తెఱవఁబడుచుండెడిది. ఒకనాఁడు నన్ను బడికిఁ దీసికొనిపోవుటకై యానౌకరు మాయింటికై పునకు వచ్చుచుండఁగా వానిని దూరమునఁ జూచి బడికిఁ బోవుటకు నిష్టములేక పొరుగింటివారిచింతచెట్టెక్కి వానికిఁ గనఁబడ కుండ దాఁగుకొంటిని. అవిషయ మిందు సూచింపఁబడినది.

† 1886 సం॥ర ప్రాంతమున నేను వేసవిసెలవులలో రామచంద్రపురము తాలూకాలోని మాదాడ్డమపేట గ్రామమునకుఁ బోయితిని. అప్పు డట సంస్థానాధిపురా లగు శ్రీ శ్రీ వాడ్రేవు రంగనాయకమ్మగారి తృతీయపుత్రిక వ్యాధిగ్రస్తురాలుగ నుండుటచే నామెకు వైద్యము చేయుడెప్పురనిమిత్తము దివాణమువారి గుఱ్ఱపుబండి ప్రతిదినము రామచంద్రపురము వెళ్ళి వచ్చుచుండెను. గుఱ్ఱముమిక్కిలి

యున్నతము, బలిష్ఠము. బండియు దానికిఁ దగినదే. రెండును గ్రొత్తగాఁ జెన్నపట్టణమునుండి హెచ్చువెల యిచ్చి కొని తెచ్చినవి.

ఒకనాఁ డుదయ మా వైద్యుఁడు దొడ్డమ్మపేట వచ్చి మం దిచ్చి తిరిగి రామచంద్రపురము వెళ్ళుచుండఁగా నప్పు డప్పురమున సబురిజిస్ట్రారుగ నున్న బోడపాటి రామలింగేశ్వరప్పగారను మిత్రునిఁ గలిసికొని మాటలాడునభిలాషతో నేను గూడ నాబండి నెక్కితిని. బండిని నడుపునౌకరు పెద్దవాఁ డొకఁ డున్నాఁడు గాని, నాఁడు వాఁ డెక్కడకో పోయినందున వానికొడుకు సుమారు పదుమూఁడుపదు నాలు గేండ్లయీడు గలవాఁడు తండ్రిపనికి సిద్ధపడి వచ్చెను.

బండి కదలి పావుగంటలో దాక్షారామము దాఁటి రామచంద్రపురము రోడ్డుమీఁద నెక్కి శరవేగమున నేగుచుండెను. వేగాతిశయమునకు సంతసించి బండిలోని డ్రెస్సరు "ఆహా! కుఱ్ఱవాఁ డయినను వీఁడు కోచిమాన్ పనికి మిక్కిలి తగినవాఁ" డని నాతోఁ బ్రశంసింప నారంభించెను.

అప్పు డటు ప్రశంసించునతనినోటిమాట నోట నుండఁగనే బాటపయిని నెవ్వడిం బోవునాబండికుడివైపుముందుచక్రము పెడిల్లుమని యొకతూమువాతెన పక్కగోడకుఁ దాఁకెను. ఆతాఁకుతో నొకయడుగు వెనుకకు జంకి బండి త్రుటిమాత్ర మట నాఁగెను. తోడనే మే ములికిపడి బండి దిగ నెంచితిమి. కాని యాక్షణమే గుఱ్ఱముకాళ్ళు నాలుగును మాప్రాణము లయిదింటితో నొక్కసారిగాఁ బయికి నెగిరెను. దానిదవుడు నెవఁ డాఁపఁగలఁడు. బాటపొడుగున నిరుప్రక్కల దగ్గఱదగ్గఱగా నున్నగున్న నేరేళ్ళమొదళ్ళను నినుపయిరుసులకొనలు దగిలి పెద్దపెద్దపెచ్చు లెగిరి పడునట్లు హయగతి ననుసరించి బండి యిటు నటుఁ బామునడకను బఱచుచుండెను.

రోడ్డుకెలఁకుల నున్న వివిధవృక్షములచిక్కనికొమ్మలు పందిరి వేసినట్టు లొక దానితో నొకటి యొత్తుగా నత్తుకొని యుండినందున బండిపయిని గూర్చుండి పరుగు నాఁపుటకు సత్తువకొలఁదిని బట్టి కళ్ళెమును బిగలాగుచున్న తురకకుఱ్ఱవాఁ డొకచెట్టుకొమ్మ తలకొత్తుకుఁ దగిలి వెలగకాయలాగున నూడి క్రిందఁబడెను. అప్పు డాగుఱ్ఱముచర్య చెప్పవలసినదేమి?

ఆ॥ కోరీతి, యాఁతకల్లు గ్రోలి కైపెక్కిన,
దంపమీఁద దాని నంటఁబోడచేఁ
బుట్టలేలు, పైఁగఁ బట్టెఁ బిశాచంబు,
చెప్పనలవె దానిచేష్ట లింక

అన్నట్టులుండెను.

రామచంద్రపురమునొద్ద నొకపెద్దకాలువ యున్నది. దానిమీఁద బల్ల కూర్పున వంతెన యొకటి నిర్మింపఁబడినది. క్రిందనుండి రహదారీపడవలు మొదలైనవి కొయ్యలతోఁ గూడఁ బోవలసివచ్చినప్పటికి నావంతెనవల్ల నాటంకము కలుగ నేరదని చెప్పవచ్చును. అది అంత ఎత్తుగా నుండుటచేత దానితోఁ గలుపవలసినయారోడ్డును వంతెనకడను మిక్కిలి యెత్తయి యొడ్డొలకముగా నుండెను. అచ్చో దానియుభయపార్శ్వములును గొందిలోయలవలె నగాధములయి ముండ్లతుప్పలతో నిండి రోడ్డుమీఁదఁ బోవుబండ్లు లేశమాత్రము నూటి దప్పి యొత్తిగిల్లినను వానిపాలికి మృత్యుదేవతావివృతాస్యగహ్వరము లని పేర్కొనఁదగి యుండెను. వేసంగి యగుటచే నప్పుడు మరమ్మతునిమిత్తము కాలువ కట్టివేసినారు. నీరంతయు నింకిపోయినది. వంతెనమీఁదనుండి క్రిందికిఁ జూచువారికిఁ గన్నులు దిరుగుచుండెను. కాలువతోడిపాటుగా వంతెనయు నప్పుడు మరమ్మతునకు వచ్చి పొట్లపండులాగున నుండెను.

ఇఁక రెండుమూఁడు నిముసములలోఁ బూర్వోక్తమయిననిరంకుశాశ్వము వంతెనమీఁద నెక్కఁగలదు. కావున బండిలో నున్నమాయాయుష్కాలపరిమాణము గూడఁ దావన్మాత్రమె యని నిశ్చయించికొని యనన్యాయత్తమయినచిత్తముతో నాపద్బాంధవుఁడైనపరమేశ్వరుని ధ్యానించుచుంటిని. అంతలో వెండి యుఁబెడిల్లుమని యొకభయదధ్వని చెవిని బడినది. కట్లన్నియుఁ దెగి కాలువ దిగి పాటిపోయెడిగుఱ్ఱమును, రోడ్డుప్రక్కచింతమ్రానికిఁ జక్రము తగిలి యాపార్శ్వమంతయు నూడి కూలఁబడినయద్దాలకలువపులక్రొత్తసవారిబండియుఁ గంటఁ బడినవి. మాను పట్టు లెగిరిపోయినమాప్రాణములు మరల వచ్చి కుదుటఁ బడినవి

ఈయంశమందు సూచింపఁబడినది.

అనోకహ మనఁగా శకటగతినాఁపునది యనువృక్షపర్యాయపదము.

ఇట్టి విషయములుకొన్ని స్మృతియందుండుటచేతనే, స్వవిషయప్రకరణములోని 40 వపద్యమున 'సుదృఢాయుఁ'డను విశేషణము చేర్పఁబడినది.

§ ప్రకృతి ప్రకరణము 255 పద్యము, చూడుఁడు.

## విప్రలంభము.

క్రీ. శే. నాతృతీయకళత్రముపేరు విజయలక్ష్మి. ఈమెజన్మస్థాన ముంగుటూరు * పుట్టినింటివారు తల్లాప్రెగ్గడవారు. విజయలక్ష్మి జనకుఁడు, సర్వారాయఁడుగారు. ఆయన కడచినస్వభాను సంవత్సరములో (క్రీ. శ. 1883) ఘోరవ్యాధికారణమున జీవితాశ లేక యప్పటికిఁ బెండ్లియీడు వచ్చి యున్నతనపుత్రికను దగినవరున కిచ్చి కన్యాప్రదానపుణ్యము మూటఁగట్టుకొని పరమపదము చేరవలయు ననుకోరికతో నుండఁగా, ద్వితీయకళత్రవియోగము నొంది

* ఈసందర్భమున నాకుఁ గర్ణగోచరమైనచారిత్రవిషయ మొకటి యిట వ్రాయుచున్నాను. పైతల్లాప్రెగ్గడవారిమూలపురుషులలోఁ బ్రకాశరాయఁ డను నొకప్రఖ్యాతుఁ డూరిలో విశేషభాగ మాక్రమించునంతటిపెద్దదివ్యభవనము కట్టినాఁడఁట. ఆయనబాంధవవర్గములోనివాఁడైనతురగా రామకవి యొకప్పుడు చుట్టరికమునుబట్టి చూడ రాఁగాఁ, బ్రకాశరాయఁడు తాను నిర్మించినభవన మాయనకుఁ జూపుచు, బావమఱఁదిపరిహాసమున నొకగదిలో నాకవిని విడిచి, తా నీవల వచ్చి కార్యాంతరవశమున నాయనమాట మఱచిపోయినాఁడఁట. పిమ్మటఁ బద్మవ్యూహము పన్నినట్లున్నయాయింటిలోనుండి యీవలకు వచ్చుదారి గానక రామకవి ప్రకాశరాయనిఁ బిలిచి పిలిచి తుదకుఁ బ్రాణము విసివి తిట్టుఁగవి యనుతనబిరుదు సార్థక మగునట్లీక్రిందిరెండుపద్యములను జెప్పినాఁడఁట.

తే॥ అంగణము లెన్ని, కేళీగృహంబు లెన్ని,
యోడుబిళ్లలయిండ్లెన్ని, మేడ లెన్ని,
కట్టెఁ గా కేమి సూర్యప్రకాశరాయఁ?
డుంగుటూరిండ్ల రాకాసు లుండవచ్చు.

చ॥ ఇరువదిచేతులుం దలలుఁ నింటియ తక్కువ; యంతె కాని వీఁ
డరయఁగ రావణాసురునియంతటివాఁడు ప్రకాశరాయఁ, డీ
శ్వరపదభక్తికిన్, సమరశక్తికి, ధర్మముపై విరక్తికిం,
బరవనితానురక్తికిని, బ్రాహ్మణవృత్తి హరించుయుక్తికిన్.

రామకవిశాపమువలన నప్పటిముంగుటూరుగ్రామము పాడుపడిన దనియు, వేఱొకచో మరల నాయూరు నిర్మింపఁబడిన దనియుఁ జెప్పుదురు.

దాదాపు ముప్పదిసంవత్సరములవయస్సులో నున్న నన్నుం గూర్చి, రాజమహేంద్రవరములో నాయొద్దం జదువుకొనునాయూరివిద్యార్థులు కొంద ఱొకనాంటి వేకువ నాయనతో ముచ్చటించిరంట. కాని పూర్వాచారపరాయణత్వమును బట్టి కడిగిన కాళ్లు కడుగుట కిష్టము లేక సర్వారాయండుగారు కొంత్రుపడు చుండంగా, నప్పుడు నిద్ర లేచి విజయలక్ష్మి తనతల్లితో నేమో చెప్పుచున్నట్లు మాటల సవ్వడి వినంబడి, యమ్మాయి యేమి చెప్పుచున్న దని భార్య నాయన ప్రశ్నించె నంట, మఱేమియు లేదు. తా నేనుంగు నెక్కి-నట్లు కల వచ్చిన దనుచున్న దని యామె ప్రత్యుత్తర మిచ్చెనంట. తనతోంటిపాటు సమయమున నీస్వప్నవృత్తాంతము శుభోదర్క మైనయుపశ్రుతిగా గ్రహించి, యీకన్య కవికుంజరపరిగ్రహము గావలసినదే యని, సంశయరాహిత్యమునొంది నా కీకన్య నిచ్చుటకు నిశ్చయించుకొనినారంట.

విజయలక్ష్మిని బెండ్లియాడినపిమ్మట నలచరిత్రములోని "దమయంతి తానత్యంత కాంతిరూపాభిజాత్యవిమలగుణసమృద్ధి వెలుంగుచు" అనువాక్యము తత్సుందరివిషయమున నాకు స్మరణకు వచ్చుచుండుటంజేసి కాంపురమునకు వచ్చిననాంటంగోలె నామె నాదరపురస్సరముగ ననురాగాతిశయమున లాలించుచుం, గాలక్రమమున నేర్పుమై విదుషింగావించితిని. ఆంధ్రగ్రంథములలో నే దేని పద్యకావ్యమొకటి యామె కిచ్చి యది సాంతముగాం జదివితి నని యామె యన్నప్పు డందలివిషయములుకొన్నిటిని గుఱించి ప్రశ్నించి,తృప్తికరమైనప్రత్యుత్తరము వడసినపిమ్మటం దదీయాభిలాషానుసారముగా ముగించినప్రతిపుస్తకము నామెకు బహుమాన మిచ్చినట్లు పద్యరూపమున నాయాయికావ్యములపై వ్రాసి ప్రోత్సాహము కలిగించుచు వచ్చితిని. మద్గ్రంథకోశమునం దిప్పుడు కానవచ్చిన రెండుమూండు

పుస్తకములముఖపత్రములమీఁద లిఖితములై కనుపట్టునట్టిపద్యము లీక్రిందఁ గనఁబఱుచుచున్నాను.

మ॥ చెఱకుంబానకముం బలెన్, విజయలక్ష్మీ! కాండషట్కస్ఫుర
ద్వర రామాయణకావ్యపుణ్యకథ నాస్వాదించి తీ, వేకదీ
క్ష రుచిన్ మానసములోపలం జదివి యీగ్రంథంబు; నే నంచుకు
న్బరితోషించుచు దీని నీకు బహుమానం బిచ్చితిం బ్రేయసీ!
25-2-1885

శా॥ వారస్త్రీరచితమ్ము ను మ్మదని తెల్పన్ రాధికాసాంత్వనం,
బారా! యెట్లదిచేయఁ గల్గె ననుచున్ సాంతంబుగాఁ జూచి, ఛం
దోరీతుల్ సెల వింపు, పద్యములు నేనుం గూర్చి మీఁచిత్త మెం
తే రంజించెద, నంటి; మేన్ విజయలక్ష్మీ! కొమ్మి యీపొత్తమున్
18-3-1890

శా॥ రంగారాయచరిత్రి పాటగను గూర్పంబడ్డదే కాని, యీ
భంగిం బూర్వము గద్యపద్యమయకావ్యం బుంట యాలింప; న
న్నుం గౌతూహల మొప్పఁగాఁ జదివి తెంతో యోపికం; దీని నీ
కుం గావించితిఁ బారితోషికముఁ; గైకో నెమ్మిఁ గాంతామణీ
22-3-1892

ఈమె, యొకనాఁ డుదయించుచున్న చంద్రునిఁ జూచి తనకుఁ దోఁచినభావమును, దెలిపి, దానిని బద్యము చేయుఁడని నన్నుఁ గోరఁగా రచించినది—

ఉ॥ లోకములోనఁ గొండొకఖలుం డుదయింపఁ, గ్రమంబుగాఁ దదీ
యాకృతితోన వర్ధిలుఁ జుమా మలినాశయవృత్తి కూడ; దో
షాకర! వేతె యిందులకు సాక్ష్యముఁ దేఁ బని లేదు చూడుమీ;
నీకళ లెక్కు వౌకొలఁది నీదుకళంకము హెచ్చుచుండదే? 108

—

తనలావణ్యాదులను వర్ణించుచు నప్పుడప్పుడు నేను వ్రాసిన పద్యములయెడల మిక్కిలి మక్కువ గలదై వానిక్రింద నాప్రియురాలు "ఇవి విజయలక్ష్మీమీఁదిపద్యములు విజయలక్ష్మివ్రాలు" అని స్వహస్తముతో నాచాటుపద్యపుస్తకమున నప్పటి కున్నపద్యములిన్నని లెక్కించి వ్రాసికొన్నది. ఆవ్రాలు చూచి యామె కంతటి యాసక్తిఁ గలిగించినయాపద్యములను బొత్తిగా నెత్తివేయుటకుఁ గాని, వానియందలిపేరు మాత్రము మెత్తివేసి వేఱువిధముగాఁ బూరించుటకుఁ గాని, మనసు గొలుపక, పరిస్థితులనుబట్టి బుట్టినవానిని బుట్టినట్లుగా నాపద్యముల నిందుఁ బ్రకటించుచున్నాను.

విజయలక్ష్మి ప్రహ్లాదమూర్తి యనునొకకుమారునిఁ గని యాబిడ్డ 18 మాసములవాఁడై యుండఁగా 18 సంవత్సరములప్రాయమున జన్మస్థలములోనే ఖరసంవత్సరమున స్వర్గస్థురాలైనది.

మ॥ అజునేర్పాటులు మార్ప రామి, ఖరవర్షాషాఢశుద్ధాష్టమిన్
గురువారంబున, నంగుటూరఁ బతియున్ బుత్రుండు మాత్రాదిబం
ధుజనంబుల్ పరితాప మొందఁ, బదునేనన్ మూఁడు నేఁడ్లీడుగ
ల్గి, జరత్కాంతగతిన్ జనెన్ విజయలక్ష్మీదేవి స్వర్వాటికిన్. 109

సతీస్మృతి పుట 18.

కన్నపుత్త్రుఁడు ప్రహ్లాదమూర్తియు వివాహితుఁడై రాజమహేంద్రవరకళాశాలయందుఁ బ్రథమశాస్త్రపరీక్ష కాసంవత్సరము పోఁదగినతరగతిలోఁ జదువుచుఁ బందొమ్మిదవయేఁటఁ బ్లవంగసంవత్సరమునఁ గాలధర్మము నొందెను.

మ॥ ధరకున్ వచ్చి విరోధిమార్గశిరశుద్ధంపుంద్వితీయాసితన్, ౧
సరి వర్ధిల్లి, ప్లవంగభాద్రపదకృష్ణద్వాదశీరాత్రి, స్వః
పురికిం బోయితి; రాకపోకల శ్రమంబుం గంటివే కాని, యే
పరితోషంబును బొందితీ భవమునం బ్రహ్లాద యేకాత్మజా!!

సుతస్మృతి పుట. 2

శృంగారపద్యప్రకటనవిషయమున నుపక్రమింపఁబడిన యీ యుపోద్ఘాతము ప్రస్తావానుప్రస్తావములమూలమునఁ గరుణప్రసంగముతో నుపసంహరించి పాఠకులకు విషాదము గలిగింపవలసివచ్చినందులకు నెంతయుఁ జింతిల్లుచున్నాను. కానిండు. చీఁకటిలో నుండి చూచినప్పుడే చిన్న చుక్కలు గూడఁ దేజోవంతములై కానఁబడఁ గలవు.

ఆ॥ కువలయంబు నేలుకొనుచున్న దంటయుఁ,
జక్రవర్తితనము జరుగుదంట,
తామరల కెదిర్చి తగుదిట్ట, తనజట్టు;
సార్థ విజయలక్ష్మిసంజ్ఞ సతికి. 109

ఉ॥ మానిక మన్న నిన్ను నవమానము సు; మ్మది కాంచనంబునం
గాని తనర్ప; దట్లె కనక మ్మనినన్ మణిఁ దాల్ప కొప్పు; దిం
తీ! నగ లేకయే తనరు నీ కెది దీటని రోసి కాంచెదం,
దేనెలు చిందు చిప్పుడె వనిన్ వికసించినపుష్పమంజరిన్. 110

క॥ కనుబొమ్మల పై నలుపుం,
గనీనికల లోనినలుపుఁ, గాటుకనలుపుం,
గనకాంగితళుకువాల్దెలి
కనుదమ్ముల, కెంతొ వింతకాంతి ఘటించున్. 111

ఉ॥ కాటుకనిగ్గులోనఁ దెలిగన్నులబెళ్కులు, నల్లమబ్బుతో
డ్పాటున నీలనీల మగువాఁగున మిట్టిపడుమీలతళ్కులన్
సాటికిఁ బిల్వఁ, జెల్వ, సరసం బగుచూ పొలయించు నావయిం,
గోటను నీటుగాఁ గుటిలకుంతలముల్ సవరించు చోరమై.

మ॥ బిగువుంగుబ్బలగుత్తపున్ఱవికపైఁ, బింబోష్ఠి, కెంపెక్కుక్రొం
జిగురుం గ్రేణి యొనర్చుపాణి నిడి మున్, జెల్వొం జిరాకాంతితం

బగుగ్రేఁగంటిమెఱుంగుఁజూపు, మెఱపోయన్ భ్రాంతి దోఁపంగనో,
యగ మూర నిగ్గిడించె నావయిని; దూప్పై యద్ది వేధించెడున్.

చ॥ కరతలపీడనంబునను గందనిచక్కనిపూలచెండ్లు, క
ప్పురమున రూపు నేపు చెడిపోవనివచ్చనినిమ్మపండ్లు, మేల్
పరిమళసంపదల్ గలిగి వర్ధిలుబంగరుగిండ్లు, నీకు నే
వరమతపంబునన్ గలిగెఁ? బాగ్యము చే ననుకొందు; సుందరీ!

చ॥ ఒకనిసిఁ దాను మేలుకొని యుండ నవోఢ, కడిందిసిగ్గునన్
ముకుళితనేత్రియై నిదురపోయెడులాగునఁ బిల్వ నూరకుం
టకుఁ గలుపించి, నేను మఱి రే యటు సేయ, సబాష్పనేత్రగో
ళక యయి వెచ్చనూర్చినవెలందుకమో మెదఁ బాయ దెప్పుడున్.

తే॥ గాసెన దొలంగునద్దంబుకరణి, మబ్బు
మఱుఁగు దొరఁగినజాబిల్లిమాడ్కి, నీటి
పైకి వచ్చిన విరిదమ్మిపగిదిఁ, దలుపు
తెఱవ నెన్నఁడు దోఁచునో తెఱవ మోము? 116

ఉ॥ తెక్కలు గల్గినన్ నెగసి తివ్వన, నిక్కడ నున్నయట్టు లా
చుక్కలతేనిమండలము చుంబన మే నొనరించి వత్తుఁ గా;
గ్రిక్కనఁ, బాదలేపనము గల్గిన, నాహృదయంబు చల్లగా,
నక్కట! శీతశైలశిఖరాగ్రములం దమి వ్రాలి, వత్తుఁ గా. 117

ఉ॥ దుస్సహ మావియోగశిఖధూమము పైకొనెనో, యహర్నిశం
బుస్సురు మంచు నేఁ దలఁచుచుండిన, నీశుభమూర్తి నాదుచే
త స్సనుదర్పణంబునను దాఁ గన రా; దకటా! తలోదరీ!
లెన్నగ దూరమందలిచెలిం గలఁ గాంతు రఁ; టెంతధన్యులో.

ఉ॥ తారకలార! యీవిరహితారకలున్ నిసి యెల్ల మీవలెం
గూరుకు లేనివై యిపుడు కూడను తెప్పల మాటుకో; వినీ!

మీరలు వేగఁబోక నిటు మిన్కుమిను క్కనుకున్కిపాట్లతో
జాఱెద రేల? పీనికడ జాగరణంబును నేర రాదొకో? 119

ఉ॥ అక్కట! పుట్టినింటి కిపు డంగన యేగినసందుఁ జూచి, నన్
జిక్కులఁ బెట్టుమన్మథునిచేఁతల కారట మెచ్చి, పాన్పునన్
బొక్కుచు వేగుదాఁక నిసిఁ బోయినపోకలఁ జూచి పోదురే
చుక్కలు! మీరు, నాటకముఁ జూడఁగ వచ్చినవారికైవడిన్.

చ॥ కలకలనవ్వునీమొగముఁ గన్గొనురాత్రులఁ బోలె, నిప్పుడున్
మెలఁతరో! నిద్ర లేమి సమమే కనుదోయికి; నైన శోభలోఁ
గలదు కొఱంత; నిక్క మిది, గల్వలు వెన్నెలతేనిసన్నిధిం
బలెను దమిస్రలన్ నిదురఁ బాయవె? యెప్పవు గాక ప్రేయసీ!

ఉ॥ అద్దము చేతఁ బట్టుకొని యాకసమందలిచంద్రుఁ బోలె, నీ
ముద్దులుమూటగట్టునగుమోమును సన్నిధి చేసికొందు నీ
వొద్దను లేక యున్న; నిసి నల్లము నీయెడఁ ద్రిప్పి; యందు కో
ముద్దియ!సాక్షియుగ్మమిదె,మూఁతమెఱుంగనికన్నుఁజెందొగల్

చ॥ హృదయ! యహర్నిశంబు మదిరేక్షణపై వల పూడి నీవు పో
యెదుసరి,యామెయున్నయెడ;కెచ్చుగఁ గన్నులనశ్రులూరెడున్
నిదురను వానిచెంతఁ ద్రుటి నిల్వఁగ నీయక పాడుచేసె, దే
మి? దశట! చెడ్డక్రోఁతి వన మెల్లను గాలిచె నన్నపోలికన్. 143

ఉ॥ కోడిని బట్టి కూర కని కుత్తుక గోసిన దోన మున్న దే
యాడుచుఁ బాడు చిద్దఱము హాయిగఁ గూడి వసించురేయి, వా
యోడకకొక్కురోయని,యయో! త్రుటిలోనన,యిప్పుడే మొకో
యేఁడులుఁ బూఁడులుం గడవ నెంతకుఁ గూయదు ప్రాణనాయికా!

సీ. వంటికొద్దియు నొక్క పానంబుఁ జేసితి,
గంటి మాత్రము మోవిఁ గాన రాదు;
గాఢంగఁ జనుమొనల్ గాఁగిలించితి వెదఁ,
గస్తూరి యంటుట గాన రాదు;

గిలిగింత లెన్నని గొలిపితి కొనగోళ్ళ,
గాయంబు నెఱకులఁ గాన రాదు;
తావిగందంబు న త్తరువుఁ బూసితి మేన,
గ మ్మనువల పేమి గాన రాదు;
తే॥ కోర్కి తీఱంగఁ వేడ్క నన్ గూడి తీవు;
మానసంబున కూఱట గానరాదు;
ఇంద్రజాలంబు మించిన దీవిధంబు;
కన్ను విచ్చిన నీరూపు గానరాదు. 125

మ॥ కనకాంగీ! చిగురాకు గేరుచును, ధిక్కారించుచుం జక్కెరన్,
గన నానీయధరంబు, మన్మదనతృష్ణాసన్నిపానంబు, నే
గొనబుంగోయిలలీల, రాచిలుకబాగుం గాన రా నానుచున్,
ఘనమోహంబున నంతలోఁ దెలిసితిం,గన్నీరు మున్నీరు గాన్.

ఉ॥ ఆమనిమైంద్రజాలికుఁ, డనంగుఁడు పయ్యెర యంగు సేయఁగా,
మామిడికొమ్మకేల, సుమమంజరిపించియముం గదల్చుచుం,
దా మధుపాళిఝుంకృతులఁ దందన పాడుచుఁ, దావిచొక్కనన్
నామది మోహపెట్టి, లలనామణి! యెల్లెడ నిన్న చూపెడున్.

చ॥ కలదు గదా మతంబు, వెలిఁ గాంచుప్రపంచము మిథ్య; వాసనల్
తలఁపునఁ బట్టి తోఁచు నటు దా మని, దానికి, దారుకాణగాఁ
గలలను గాక, రాతిరి పగల్ పనులప్డును, నాదుడెందమం
దలియలివేణి దూరగ గనంబను మ్రోల, విలాసభూషమై.

చ॥ ఎడఁద త్వదీయ మెట్టిదొ యదృష్టము; జానుగ సానుగుణ్యాపున్
విడియపుఁజెల్మిచేత ద్విగుణీకృత మాభవదోష్ఠరాగ, మో
పడఁతి! మదాత్మరాగమును బల్మిని దెచ్చెను దీమ మాచు నీ
యడుగుఁజిగుళ్ళచెంత కిపు; డల్లనఁ బెంచెదొ దాని, ద్రుంచెదో!

ఉ॥ పానుపునందు నొంటిగను బండుకొనంగను, రేయి నా కయో!
తానదిప్రియామయమయ్యె, నయుతప్రహరాయతమయ్యెడుం జెలీ;
యేను వియోగసాగరము నీగతి నీఁదుచు నుండఁ, బైగనీ
వానలు, గోరుచుట్టుపయి భారపురోఁకటిపోటు లన్నటుల్. 130

ఉ॥ అంబుధరంబు నీతుఱు, మహాంగనిరీక్షణముల్ మెఱుంగు, లైం
ద్రం బగువిల్లుభ్రూ, పమృతధారలు వాక్కులు, నైనవాదుడెం
దం బనుచాతకంబునకుఁ, ద్వద్విరహాంబు నమాగమంబె ఘ
ర్మంబును, వానకారును, జుమా విజయేందిర! మన్మనోరమా!

ఉ॥ కుంపటి, తేళ్ళపుట్ట, యుడుకుంబెన, మల్గులపేర్పు, రేఁగుము
ల్కంవలతోడ్గు, వేసఁగియెడారి, కటా! చలిచీమగుంపు, బ
ల్రంపపువాయి, సూదులకరండమునుం బెనుఁబాముచుట్ట, చె
ల్వంపుమిటారి నావిజయలక్ష్మికి దవ్వగునాకు శయ్య రేఁ.

చ॥ ఒకపనిమీఁద నొక్క రొకయూరికిఁ బోయినయప్పు, డచ్చటన్
మొకమెఱు కున్నవారిఁ గని ముచ్చట లాడక రారు; చారుహా
ల్లకకుముదాసితోత్పలకలాపజలాశయ ముంగుటూరిలో,
ముకురకపోల నాయనుఁగుముద్దులగుమ్మకు భద్రమే? శశీ! 133

మ॥ మరుఁడా! నల్లెరుమీఁద బండివలె బల్మి దీవు నామీఁదికే
యరుదెం; తాకనకాంగిమీఁదను భవజ్జ్యార్భాటముల్ చెల్లవో?
విరి వానీ విశిఖాలు నేలఁ బడ; న న్వేధింప; కెళ్ళైనఁ, జ
క్కెరబొమ్మం గొని తెమ్మ నావిజయలక్ష్మిన్ నీకు మేలయ్యెడున్

ఉ॥ గందవుఁగొండనెత్తముపైఁ గాఁపుర ముండినబోయవాండ్రతోఁ
బొం దొనరించి, నేర్చితివి పో పవమానుఁడ గొప్పవిద్య; నీ
ముందఱఁ బాంథసంతతికి బొత్తిగ నిల్వఁగ రాక యున్నదే;
యొందుకు వారిమానధన మెల్ల హరించెదు దోఁపుకాఁడవై.

ఉ॥ దక్కినపున్సముద్రమును దాఁటిన దాఁటెనుగాక, మిక్కిలిన్
మక్కువతో లసన్మధువనంబున గంతిన గంతెఁ గాక, పీఁ
డక్కట! మందు; డెక్కరణి నాపవమానకుమారుఁ బోలెదన్?
స్రుక్కు వియోగులన్ మిగుల నుక్కఁగఁ జేయును సోఁకుదయ్యమై

చ॥ ఎదపయి నత్తమిల్లి తరుణీ! పురుడించితి ముందు కుందమున్;
హృదయములోనఁ దోఁచి యిపు, డేమిది కుంతమ వైతి? త్వద్రసా
స్పదసరళత్వ మెల్లఁ బరుషత్వము నొందె వియోగవేళ; హా!
మృదు వతితీక్ష్ణ మండ్రు బుధు; లియ్యెడ నానుడి తథ్యమే గదా!

చ॥ గుబగుబఁ గ్రుమ్మనట్టు లగు గుండియ, లూపిరి పుచ్చభారమా,
నబల! వడంకుఁ, గాఁగు, నొడ, లాఱెడుఁ గుత్తు, కెలుంగు రాల్ప[డున్,
నిబిడ మగు న్నిడూర్పు, గమనించినఁ గాళులు తేలిపోవు, నీ
సొబగు మనంబునం దలఁచి చూచినమాత్ర; నిదేమి మాయయో!

క॥ నుడివెదవు మధురవాక్యులు;
కడకన్నులఁ బ్రేమ మొలుకఁ గాంచెద; వైనన్
బడఁతి! నినుఁ దలఁచుకొన్నను,
గడగడ నాదేహ మేమొ కంపము నొందున్. 139

ఉ॥ కొండవిధంబునన్ బరు వగున్ హృదయంబునఁ జింత, దీని నో
యండజయాన! త్రోయఁదరమా మరి యొంటను? నీకు నాపయిన్
మెండుగఁ బ్రేమ యుండినను, మీటిన ఖంగను నీయెడందపై
కొండ లురంబుఁ జేర్పు మనుఁగుం జెలి! లాగదె యేనుఁ గేనుఁగున్!

చ॥ గడు వసునొడ్డు దవ్వులను గంటఁ బడన్, ధృతితో వియోగపుం
గడలిని నీఁదియీఁది చిరకాలము, డస్సినవాఁడ నౌట, నో
పడఁతుక! చేరు వాకొలఁదిఁ బారము, భారము మేర మీఱుచున్
గడ యొకయేఁడుగా మదికిఁ గానఁగ నయ్యెడుఁ నియ్యెడన్ జెలీ!

చ॥ ఇరునెల లొక్కపక్షము సహించినదాన, విఁకొక్కరేయి యీ,
విరహాభరంబు సైఁపు మన, వెచ్చగ నూర్చెద వేమొ? డెందమా!
స్మరణకు వచ్చె, నిన్నుఁ బలుమాఱిటు రేఁపును మాపటంచుముం
దర నడియాస పెట్టుటను, దద్వ్యథమే యనుకొందు విప్పుడున్.

చ॥ పొదుఁగునఁ బాలుగోవునకుఁ బోలెను, డెందమ! పూఁటపూఁటకున్
బొదలెడుఁ బ్రేమ జవ్వనికిఁ బూర్వము దా నుపభుక్త మాచునే
యది యిఁక వెల్లివాఱు విరహంబున నం చనుకోకు; మిప్పుడున్
బొదుఁగునపాలె సాటి; యది బొంకన, నీతడ వేల బోటికిన్?

ఉ॥ పావడ పల్కు లాడ, జరబాజొలెపయ్యెఁట జీరులాడఁ, గె
మ్మోవిని లేఁతనవ్వొలయుముద్దులమో మలరింపఁ గల్వలన్,
గావరుఁ డైనసూనశరుగర్వము దూలిచి యేలఁ జాలులీ
లావతిఁ జొక్కి నావిజయలక్ష్మిని గాంచునదృష్ట మెన్నఁడో?

ఆ॥ వచ్చకప్పురంపుఁ బలుకులు వోలె, నా
కనులఁ జల్లసేయఁ గలవి యగుట,
భాసురాంగి! నీవు వ్రాసినవర్ణముల్
సారెసారె కేను జదువుకొందు. 145

---

కీర్తిశేషురాలు కలకంఠకంఠి నాద్వితీయజాయ కోరఁగా
1878 సంవత్సర ప్రాంతమున రచించిన కీర్తన

కాళియమర్దనము.

కళ్యాణిరాగము—ఆదితాళము

నీలవేణీ! యాలకింపవే-కాళియమథనము.
లోలలోచన! మధురచరితమే॥

పల్లవి

శీలవంతుఁ డైనపరి-క్షిన్నరేంద్రునితోడఁ గరుణా
శాలియగుశ్రీశుకమహాఋషి-శౌరికథలను దెలుపు చిట్లనె॥నీ॥

చరణములు.

పాలుపెరుఁగుల బంతిచలుదులను-జెలికాండ్రుఁ దానును-
మేలముల బంతెంబు లాడును-భుజియించి కొండొక-
కాలమున బలుఁడొకఁడు దక్కఁగను, దనతోడిగోప-
బాలకులు దను వెంబడింపఁగను-ముద మొదను బాదలఁగ-
నాలమందలఁ దోలుకొని పెన-తాలు జాలుగ గరఁగ మురళీ-
నాళములఁ బూరించుచును గో-పాలకృష్ణుం డడవి కేగెను
॥ నీల ॥ ౧

అడవిమొగ్గముల వెడల నడఁచుచును-గడుమేపు లడరెడు-
కడలకును గదుపులను ద్రోలుచును-నెడనెడనునటఁజిడు-
గుడులు మొదలగునాట లాడుచును-నొకఁడొకనిఁ గడవఁగఁ-
బుడమి వడఁకఁగ వడిగఁ బఱచుచును-గడుదడవు వారీ-
వడువునను నెండలను బడుటను-బడలి వడగొని యడుగు
తడఁబడఁ-
దోడుకుగమితో యమునయందలి-మడువునొద్దకు నొడలు
నేర్చిరి ॥ నీల ॥ ౨

మడుఁగులోపలిజలము లెప్పుడును-గాళీయుఁ డనంబడు-
పడగదారివిషానలంబునను-గళపెళ మటంచును-
నుడుకుచును బొంగుచును నుండెడును-గావునను దానఁ
దడిసి వీచెనుగాలి సోఁకినను-గడుపొడవునను దివిఁ-
గడచిచనియెడుపక్షియైనను-పడయ కప్పుడయొడలు దెలియక
నుడిసి యానదినడుమఁ బడిమడి-సెదును; గడమవి నడవ
నేటికి ॥ నీల ॥ 3

నీరువట్టున నరుదెంచిన-పసిగాపుఁజిన్నికు
మూరు లావులు హరియు, మించిన-తొందరను దెలియఁగ

నేర కాకాళిందివంచన-యుదరంబులను ద
ద్వారిపూరముచేత నించిన-నది యేమొ యపుడే
వీరు వా రన నేల? యానది-వారి గ్రోలినవార లెల్లను
సారసాక్షుఁడు దక్క, నిర్గత-సారులై హృతజీవు లయిరి.
|| నీల || ౪

ఎడలి యసుఱులు కీలు పసచెడిన-మరబొమ్మ లోయన
నోడలు వడఁకుచుఁ, బుడమిపయిఁ బడిన-తోడుకులను గొల్ల
బుడుతలను గని కరము నెయ్యమునఁ-దన యెడఁదలోపలఁ
బొడమి పొదలెడుకనికరంబునఁ-గృష్ణుండు సర్వే
శుఁడు మహాత్ముఁడు దేవుఁడాశ్రిత-సులభుఁడగుటఁ గటాక్ష
వీక్షా
చ్ఛలసుధావర్షమునఁ దన్మృతి-నుడిపి పొగడఁగఁబడియె
నయ్యెడ || నీల || ౫

బ్రదుకఁ జేసినపిదప యదుకులుఁడు-శనహృదయమున నా
హ్లాదమునను గాళియుఁ డనెడుఖలుఁడు-గలఁ డని యెఱింగి
కదిరి ముదిరినకినుక పెనఁగొనుచు-నీగూఢపాదము
మపము సదమద మైనఁ గా కెపుడు-ముద మొదవుచుమునా
నదియుదకమకలుషముగాది-య్యుదసజంతుసముదయమున కా
పద దొలంగ మదీయబలసం-పదను ఫణిఁ జదిపెద నటం
చనె || నీల || ౬

నీరజాక్షుం డటులు దలపోసి-తత్తీరనీప
భూరుహారోహణము వెసఁ జేసి-పింఛంబుతోఁ గచ
భారమున దోరముగ ముడివేసి-కటిసూత్రమును దిగ
జాఱకుండఁగ మిగుల బిగఁ దీసి-నిజభుజముఁ జఱచి

దారునను గుప్పించి యవ్వసు-ధారుహాగ్రమునుండి మడువున
ధీరుఁ డయి గుబగుబవినాదము-బోరుకలఁగ గుబాల్న
దుమికెను ‖ నీల ‖ ౭

దుమికి, కరపదతాడనంబులను-నమ్మడుఁ గలఘుకర
ఘుమఘుమధ్వనిఁ బొంగఁ గలఁపఁగను-గాళియుఁడు ఘూత్కా
రములు నిగుడఁగ నెగడి, కడువగను-వీఁడెవఁడో సంక్షో
భమున నాహ్రదమునను నీఁదెడును-నాకడిమి యెఱుఁగఁడు
నిమిషమునను మదీయవిషదహ-నమున భస్మము సేసి,
శమనుగృ
హమున కనిచెద ననుచుఁ గఱచియ-ధముఁడు హరియెడలను
బెనంగొనె ‖ నీల ‖ ౮

కాటువడి నిశ్చేతనునిఁ బోలి-యగపడెను కృష్ణుని
పాటు గనిగోగణము కడుజాలి-నంభారవంబులు
మాటికిని జేయుచును ద్రుణపాళిఁ-గొఱుకటలు మాని
చేటు వడి యుండంగ గోపాళి-యతిదుఃఖమున హా!
యేటిబ్రతుకు కామేటిపన్నగ-మేటిలో మననఘునిఁ గఱచెను
గాటముగ, రక్షకులు మన కీ-చ్చోట నెవ రని సోలి
వ్రాలెను ‖ నీల ‖ ౯

వ్రేతలకు వ్రేలకును మందలను-నయ్యెడను మహో
త్పాతములు గనఁబడెను ముందఱను-నది చూచి మిక్కిలి
భీతు లయి నందాదు లందఱును-స్త్రీబాలవృద్ధన
మేతు లయి డెందములు వందురను-గోవిందుఁ డెవ్వరి
చేత నేనియు గోపగోసం-ఘాతములతోఁ జిక్కెనో యని
కూఁత లిడుచును నడవి ఘూర్ణిలు-ఘోషమున ఘోషంబు
వెడలిరి ‖ నీల ‖ ౧౦

తరళమనములతోఁడ నట్టులను-హరిశరభకరిభీ
కరవనంబుల కరిగి చెట్టులను-నడుగుచును జనిచని
సురుచిరము లగునిసుకతిట్టలను-గోగోపబాలక
ఖురపదంబులనడిమిపట్టులను-హలకులిశముఖశుభ
కరసురేఖల నమరుమార్గా-భరణములు హరిచరణములు గని
సరణి యిదె యని యరయు చందఋ-నరయముగ నదిఁ
దటియవచ్చిరి ॥ సీల ॥ ౧౧

వచ్చి తత్సరిదంతరంబునను-వాఖిలకాల
వ్యాళదీర్ఘ శరీరరజ్జునను-బంధింపఁగాఁబడి
చచ్చినట్టులు చెయువు లేమియును-లే కున్న వెన్నల
ముచ్చుఁ గని కన్నీరు జాఱఁగను-గోపికలు నందుని
మచ్చెకంటిని బొదివికొని వగ-హెచ్చి కృష్ణా! నచ్చి ప్రాణము
లిచ్చినారము వానిఁగొని నీ-వెచ్చటికిఁ బోయి తని యేడ్చిరి
॥ సీల ॥ ౧౨

అప్పు డడలునఁ గడుపు దరి గోయ-యశోద, నందను
తెప్ప లార్పక చూచి ధృతి పాయ-నాయన్న! నిన్ని
డెప్పరవునప్పంబు పైన వేర్యి-ననుఁ దలఁచుకొంటివె?
చెప్ప వేమిర? నీకుఁ బగ నేయు-మాహృదయముల నె
ల్లప్పుడును జగ మంత నీ వే-యనుచునుందుము నీవు పోయిన
యప్పు డిది మా కేల? యని హ్రిద-మందు నందఋ దిగఁ
దలంచిరి ॥ సీల ॥ ౧౩

మరణకాంక్షను మనుఁగు చొరఁబాఱు-వారలను జూచి
నరభసంబుగ బలుఁకు విసుఁ డీరు-నుఱి మీఁదెఱుంగరు
గురుజనులు దైన్యమున కెడ మీరు-ధైర్యమున కిది యవ

సరము నిలునిలు: డనుచుఁ బలుమాఱు-బోధించి యూఁగెను
సరళమతి నాతండు హరిదళ-సరి యెఱుంగును గాన, నంతట
సరసి జాక్షుం డటులు భక్తుల-నరయుటకు నిరుగడియు
లుండెను ॥ నీల ॥ ౧౪

పిమ్మటను హరి మేను వెంచుకను-నొక టొకటిగా భుజ
గమ్ము నావృత్తులును విడివడెను-నపు డేమి చెప్పుదుఁ
దమ్మికంటి తదీయపుచ్ఛమును-బట్టుకొని తకతెయి
ధిమ్మనుచు శతఫణము లదరఁగను-జరణద్వయాభర
ణమ్ములెల్లను గల్లుగల్లన-నెమ్మిఁ దాండవకేళి సలుప ము
దమ్మునను దేవతలు సుమవ-ర్షమ్ము గురిసిరి పొగడి రంతఱు
॥ నీల ॥ ౧౫

అటులు కృష్ణుఁడు నటన మాడుచును-నుండఁగను భుజగము
జొటజొటను ముక్కులను నోళులను-నొలికెడువిషముతో
దటము చెడి మూర్ఛిలఁగ నేడ్చుచును-దత్సతులు మాపెని
మిటిని గావవె దేవ! నీయెడను-నితఁ డాచరించిన
యటమటము లపచారములు ని-క్కటపుదయ క్షమియించి
యనన
క్కటిలుఁ జంపక నీవు బంధులుఁ-దటినిఁ జటుకున విడిచి
పొండని ॥ నీల ॥ ౧౬

వ్యాళభీకువు లెల్ల నెల నెలను-ఫలభక్ష్యములు వృ
క్షాళి మొదళులఁ దమకు బెట్టఁగను-ఫణు లడలుచును గరు
టాలమంతున కందుఁ బాలిడును-నే నట్లిడమిఁ గా
త్రాళమున న న్నతఁడు డఱుమఁగను-నది శరణుచొచ్చితి
బైలువడి నే బ్రదుకలే నన-జాలివడి మత్పాదచిహ్నితు
జోలికిని గరుడుండు రాఁ డని-కాళియుని వెన్నుఁడు
వెలార్చెను ॥ నీల ॥ ౧౭

ఆదరంబున దీనిఁ జదివినను-వ్రాసినను విన్నను
లేదు వారికి భయము విషమునను-నని పలికి మెల్లన
నీఁదుకొనుచును వచ్చి యొడ్డునను-దనుఁ జూచి యధికా
హ్లాదమున బాష్పములు గురియుఁగను-మున్నట్టినందయ
శోదలాదిగఁ గలుగుబంధుగము, చుట్టు రాఁగను భద్రముగ వ
డ్డాది సుబ్బారాయ వరసుఁడు మోదమున వ్రేపల్లెఁ జేరెను
నీలవేణీ యాలకింపవే-కాళియమథనములోలలోచన మధుర
చరితమే ౧౧౬ 116

---

## —• నృసింహపంచాశిక. •—

1908, సంవత్సరము డిసెంబరునెల 21 తేదీని చెన్నరాష్ట్రప రిపాలకుఁడయిన సర్. ఆర్థర్ లాలీప్రభువు గుంటూరుపురమునకు విచ్చేసెను. అయ్యవకాశవిశేషమునఁ దత్ప్రభుసమ్మానసంఘపౌర జనులు తమపురమునకు నా రాకనపేక్షించుట తటస్థించినది. నేనును వారప్రార్థన మంగీకరించి ప్రభుగౌరవార్థము సంఘపక్షమునఁ గొన్ని పద్యములు రచించి సభాంతరమునఁ జదివి ముద్రిత మయిన తత్ప్రతి నధిపునకు సమర్పించితిని.

అట్లు నే నక్కడకుఁ జనినప్రయోజనము నెఱవేఱినతోడనే మరల రాజమహేంద్రవరమునకు రావలసినవాఁడ నయినను, దత్కాలమున నూతనముగా నప్పురమున స్థాపితమైనగుంటూరుమండల కరగాహికచ్చేరియందు సిరస్తాదారుగా నున్నవారును, దత్పూర్వము గోదావరీ మండలములోనిదిగా నెంచఁబడు గోపూరుగ్రామము నివాసమైనవారును, నాకు మిగులఁ బూర్వపరిచితులును, విశేషించి పూర్వోక్తసమ్మానసంఘముచే నే నాహూతుఁడ నగుటకు హేతుభూతులు, నయిన మ॥ రా॥ రాచర్లసుబ్బారావుపంతులుగారు తమ

నూతనమండలమునఁ జేరినదియు మండలరాజధానికిఁ జేరువనున్నదియు, నగు మంగళగిరి మహాక్షేత్రమునకుఁ, దత్కాలసంప్రాప్త మయిన ముక్కోటిపర్వదినమున శ్రీపానకాలనృసింహస్వామివారిని సందర్శింప మా రావులపర్తి వేంకటాచలపతిరావు మొదలగు నమిత్రిందియుద్యోగస్థులతోడ సకుటుంబముగా నేగ బయలు దేఱుచు సాదరముగా నన్నుఁ గూడ నాహ్వానము చేసినందున, యాదృచ్ఛికముగాఁ దటస్థించినయమ్మహాలాభమునకు సంతసిల్లుచు వారిని గలసి యరిగి, తద్దివ్యస్థలసందర్శనమున నేత్రసాఫల్యము గావించుకొంటిని. పిమ్మటఁ గొండ యెక్కి మేము దఱి మందలియాలయమున స్వామిసమ్ముఖమున నిలిచితిమి. నిలుచునంతన, తద్వేళావిశేషమో, స్థానవిశేషమో, నాయదృష్టవిశేషమో, కారణమేమో చెప్పఁజాలనుగాని, నాకప్పు డద్భుతమయిన యొకానొకయావేశము గలిగినది. మఱియు నప్పటికి దాదాపు పదునైదు పదునాఱుమాసముల క్రిందట నాకు సంప్రాప్త మైనయేకపుత్రవియోగశోక మాకస్మికముగా నత్తఱి హృదయకుహరమున భగ్గున దరికొన్నది. ఎదుటఁ గనఁబడు వేలుపు నృసింహమూర్తి యగుటయు గతించినపుత్రుఁడు ప్రహ్లాదమూర్తి యగుటయునే, తదాకస్మికశోకాగ్నిప్రజ్వలనమునకు ముఖ్యకారణము. అప్పుడు మండుచున్నమానసముతోడను, గాలువలుగట్టు కన్నీళ్ళతోడను, గద్గద మగు కంఠస్వరముతోడను, నాదురవస్థ గోచరింప ఝుడితిస్ఫురితము లయిన నృసింహాస్తవపద్యములు కొన్ని తత్రత్యభక్తజనములనయనము లశ్రుజలపూరితములుగాఁ జదువ దొరఁకొంటిని. పంచాశికలోనిచివర నాలుగుపద్యములు మాత్ర మప్పుడు రచించినవి కావు. ఇదియే నృసింహాస్తవప్రస్తావము.

క॥ శ్రీనాథ! శోణితము మును,
పానక మూవెనుకఁ, గ్రోలవా? "సరసుతికిం
బూనిననాలుకఁ బొగడెద
వా న?'' న్నన కీవు; మంగళాద్రినృసింహా. 147

క॥ పదోకండు పసిఁడికుండలుఁ,
బదోకొం డంతస్సు లున్నత్వద్గోపురమున్,
బదోకొండవకీలకపు
వ్యదినము చొరఁ గంటి; మంగళాద్రినృసింహా. 148

క॥ కలఁ గరిపై నను నేఁ గను
ఫలమో, రజతహరిపీఠిఁ బ్రభుకుంజరు, మం
జులకుంజరనిభగిరి నిను,
నలరుచుఁ గనుఁగొంటి; మంగళాద్రినృసింహా. 149

క॥ ఏనుఁగురూపునం గిరి
గానంగా నగుట బ్రమసి కాదేని, యిటన్
మానిమనోగుహ నిడునడు,
గానం గత మేమి? మంగళాద్రినృసింహా. 150

క॥ స్థావరనరతిర్యక్కులు
దేవరయాకార మాటఁ దెల్లము సేయున్,
గ్రావముపైఁ దావకమూ
ర్త్యావిర్భావంబు; మంగళాద్రినృసింహా. 151

క॥ ఈయవతారంబున, భవ
దీయము లౌనాయుధములు, ద్విషదురువక్షో
పాయకరశాతనఖరము
లై యమళతఁ గొలుచు; మంగళాద్రినృసింహా. 152

క॥ కుటిలరిపువిపులవక్షు
స్తటిఁ దటఁపించినను, జెప్పఁ జాలఁ; గటా; యి
చ్చటు, త్వన్మృదుపదకమలా
భ్యటనమునకుఁ దగునె? మంగళాద్రినృసింహా. 153

క॥ నరులు మృగప్రాయత సం
చరించుటలు గాంచి, వారి శాసింపఁగ న
చ్చెరు వగుసీరూపమున వి
హరింతువని యెంతు; మంగళాద్రినృసింహా. 154

క॥ కానిక నీకుం బెల్లపుఁ
బానకమే యనఁగ నేల? భక్తులు కల దే
దే నొకఁ డర్పింతురు; కొను
మా నాకవనంబు; మంగళాద్రినృసింహా. 155

క॥ నీనామము కలకండము
గా, నాకవనంబు విమలకమలము గాదా?
పానకమేతన్మేళన;
మానుము చెవులార; మంగళాద్రినృసింహా. 156

క॥ గవి నిడి గుడపానక, మేఁ
జెవి నిడి నుడిపానకంబు, శీలిఁపగ, రెం
డవ దిత వనుక్రైవడిఁ, గా
యవె నీ వాద్యంబు? మంగళాద్రినృసింహా. 157

క॥ పోగు వడుఁ బుట్లతరబడి,
నీఁగకు సిలి యిడవు గుడము; నెవ రెం తిడినన్
దాగె దరమె పానక; మా
హా! కడుచిత్రంబు; మంగళాద్రినృసింహా. 158

క॥ నీకడుపున బడబానల
మై కాఁక మఱుఁగుఁ; గాన నన్వాహము నసం
ఖ్యాకములు పానకపుచే
ర్లాకడఁ జే రడఁగుఁ; మంగళాద్రినృసింహా. 159

క॥ పానకమును దినదిన మీ
వానెడుశంఖంబు దక్షిణావర్త, మరి
ప్రాణహరపాంచజన్యమ
య్యా; నన్యము గాదు; మంగళాద్రినృసింహా; 160

క॥ మొనట శిలాస్తంభంబున
నుదయించుటఁ బ్రియము శైల మునికికి నీ; కిం
దుదకము కఱ; వెటు మనఁ బ్రజ?
హ్రదము బ్రసాదింపు; మంగళాద్రినృసింహా 161

క॥ నీ వున్న తావునను బ్రజ,
సేవకుఁ గోటానఁ గోట్లు చేరుం, గానన్
జీవనతృణకాష్ఠసమృ
ద్ధావని గావలదె మంగళాద్రి! నృసింహా. 162

క॥ తానము, పానము, పాకము,
పానక, మొనరింపఁ గష్టపడుప్రజ కెపుడున్
వానతతిఁ బోలె ధారల
నానందం బొనఁగు మంగళాద్రి; నృసింహా. 163

క॥ ముప్పదిబారలవగ్గం
బప్పాలు చేఁదుకొన నూతి కఁట! యీముప్పాల్
దప్పంగఁ జేయవకు నీ
రప్పా! రప్పింపు మంగళాద్రి,నృసింహా. 164

క॥ రా, వేంకటగిరిపతి నీ
కోవెలకున్ మంగల ధనికులసాహాయ్యం
బావహిలుటఁ దర్పించిన
దావాపిం బోవు మంగళాద్రినృసింహా. 165

క॥ సుదృఢరిపుహృదయగిరితట
భిదురభవన్నఖరరోచి, వివిధభయధ్వాం
తదివాకరకర, మెట నా
కది తోడగుఁ గాక; మంగళాద్రినృసింహా. 166

క॥ పెంపుడుఁజిలుకను దమపే
రింపుగఁ బలికించుకొందు; రిడుదురు ఫల; మా
సొంపున నీ కందములఁ బ్రి
యంపడి నుడివింతొ? మంగళాద్రినృసింహా. 167

క॥ గుంటూర్మచ్చున నను నీ
గుంటికి రప్పించుకొంటి గురువత్సలతన్;
దంటయవతారమూర్తి వ
టంటకుఁ దగియుంటి; మంగళాద్రినృసింహా. 168

క॥ నుడిగించి పుత్రశోకము
నుడిగింపఁగ నిరుడె "యాపదుద్ధారక" యం,
చడిగింతు నేఁడు దయతో
నడఁగింపఁ గొఱంత; మంగళాద్రినృసింహా. 169

క॥ ఇచ్చి కయికొంటి ప్రియము
వచ్చినయేకాత్మజుని భవద్భక్తాఖ్యున్;
బిచ్చ మిడు కొడుకు నీవే
రచ్చిఱుతకు నిడుదు మంగళాద్రినృసింహా. 170

క॥ దానము సద్వస్తువు నిడఁ
గా నగుఁ, గొనరాదు మగుడఁ, గటకట! యాయు
ష్షీనుని మును పొసఁగితి; మే
లౌనందను నీవె; మంగళాద్రినృసింహా. 771

క॥ మరుఁ డెట్టు లైన, భాషా
వరుఁ డుండుట వెలితి లేదు ప్రభువ; కయో! మ
ద్దురవస్థ యెఱుఁగ వే? దయ
నరసి కొఱఁత దీర్పు; మంగళాద్రినృసింహా. 172

క॥ కీలాలము కీలము భూ
గోళఖగోళములఁ బఱపుగోరం గొఱన్,
బాలేందునిరుచిఁ జూపి మ
దాలోకమలర్తు; మంగళాద్రినృసింహా. 173

క॥ అగ్రమున దివ్యమంగళ
విగ్రహు నినుఁ దొలుతఁ గనినవిఘటిక నెఱుఁగన్,
జాగ్రత్స్వప్నమొ, దే
వాగ్రణి! వివశతను; మంగళాద్రినృసింహా. 174

క॥ వెలిపట్టుగొడుగు, లిరుఁగెలఁ
కుల వీచోపులుఁ, గిరీటకుండలముఖభూ
షలు, గరుడవాహ, మెన్నఁగ
వలవియె నీకివి? మంగళాద్రినృసింహా. 175

క॥ చేతాళపుఁబతిమను గాఁ
జూతున్ నినుఁ గనుల; నైనఁ జోద్యము, హృదికిన్
జ్యోతిర్మయుఁడుగఁ దోఁచి, మ
హాతమ మడఁగింతు మంగళాద్రినృసింహా. 176

క॥ అంతరచిన్మూర్తి నిజ
స్వాంతములం గనుచు, విగ్రహార్చనమును ధీ
మంతులు గావింతురు స
ర్వాంతర్యామి వని మంగళాద్రినృసింహా. 177

క॥ ఈకుండలమకుటాదులు
నాకోఁదిని బట్టి నీకు నగలందురు; గా
కాకాశభూవిభున కవి
యాకల్పము లగునె? మంగళాద్రినృసింహా. 178

క॥ వెలుఁగుల సన్నిటి మ్రింగెడు
తలమానిక, మెల్లమేల్ రతనములనెల వా
మొలనూలు, దివికి భువి కిడి;
తెలుపమె నీలచ్చి! మంగళాద్రినృసింహా. 179

క॥ హేమంతం బుపహారము
హేమపుదామములసామి కిచ్చెనో యనఁగాఁ
జేమంతి బంతిసరు లిం
పౌ మెడ నీ పూన; మంగళాద్రినృసింహా. 180

క॥ నీ మంజుళసుస్నిగ్ధ
శ్యామలతను వనునవీనజలదంబునకున్
జేమంతిసరము లోకరయొఱ
పౌ మెఱపులు గావె? మంగళాద్రినృసింహా. 181

క॥ చతురర్థంబులఁ బూరుష
తతికి నిరంతరత నిచ్చుదాతవు గానన్
జతురాయతబాహువులు ద
యతో ధరించితివి; మంగళాద్రినృసింహా. 182

కII భవదభయవరదహస్తము
లవి యూర్ధ్వాధఃప్రసారులై; యనిశముఁ గ
న్గవఁ గట్టినయట్టులు నా
కవు, చూఱట నొసఁగు; మంగళాద్రినృసింహా. 183

కII నీరూపము ధ్యానించినఁ,
బేరెంచినఁ, జరితములను వినినఁ, జదివినన్,
నా తొపులకములకు నీ
రార ముదశ్రువులు మంగళాద్రినృసింహా. 184

కII అవతారములం దుగ్రమె
యవుఁ గా కిది, భక్తశత్రుహారసద్యోభీ
ష్టవదాన్యము నాశ్రితపా
ణ్యావలంబము గా దె? మంగళాద్రినృసింహా. 185

కII భ్రమరములటు పదకోకన
దములం దులసీదళములు త్వన్నామసహ
స్రము చెలఁగ వ్రాలుశుభసమ
యము పుణ్యులు గందురు; మంగళాద్రినృసింహా. 186

కII ప్రాపంచికసుఖసమితిం
డీపించుక లేదు; ననుఁ ద్వదీయమనోజ్ఞ
శ్రీపాదకమలమధులి
డ్వ్యాపారునిఁ జేయు మంగళాద్రినృసింహా. 187

కII మచ్ఛమ వై కచ్ఛపమై
యచ్ఛపుఘోణి వయి నిలిపి తడు గంటఁ గ నీ
కచ్ఛతురాగమధరధర
లచ్చెరువడ బుధులు; మంగళాద్రి నృసింహా. 188

క॥ తిర్యగవతారముల కిది
పర్యవసానం బటన్న భావము నరసాం
కర్యంబునఁ బ్రకటించితి;
వర్యాంత్రచ్ఛేది! మంగళాద్రినృసింహా. 189

క॥ కడపటిసంధ్యారక్తిమ
నుడుపతికళ చదలఁ బోలె, నురురక్తాక్త
ద్విడురఃఫలకంబున సొం
పడరదె నీసఖము! మంగళాద్రినృసింహా. 190

క॥ భూమి రజఃకణికాకృతి,
వ్యోమం బళిరీతిఁ, బత్పయోజములకుఁ గా,
వామనుఁడ వైతి, వదితి మ
హాముని యుప్పొంగ; మంగళాద్రినృసింహా. 191

క॥ నీ వద్రి సార్థకాఖ్యము
గావింపఁ దలంపు గొంటి కాఁబోలు; జనుల్
సేవింప వచ్చునంతనె
యావహిలుక్ శుభము; మంగళాద్రినృసింహా. 192

క॥ కొండంతయాస, దేవర
కొండను సకుటుంబ మెక్కఁ; గోరిక చక్కం
బండింపు; మనంతబ్ర
హ్మాండసృజనకర్త! మంగళాద్రినృసింహా. 193

క॥ పూపను దోఁపించితి; ఫల
రూపము సరి నేఱుపఱిచి ప్రోవఁగదె కృపా
కూపారా! నిరపాయత;
నాపన్నశరణ్య! మంగళాద్రినృసింహా. 194

క॥ వినువక నాసంప్రార్థన
నసిగా విని నళను నీ వొసఁగినసుతునకున్
లనదీశ్వరప్రసాదా
ఖ్య నలిపి కృతి నైతి; మంగళాద్రినృసింహా. 195

క॥ భవదవ్యాజకృపానం
భవనరపుత్రాన్వితముగఁ ద్వద్గిరికిన్ స
త్యవతీపూర్ణానహితం
బవశ్య మరుదెంతు; మంగళాద్రినృసింహా. 196

క॥ వసురాయవిరచితం బీ
నృసింహపంచాశికాఖ్యకృతి రవిచంద్రుల్
వసుధ గలంతటికాలం
బన మెసఁగఁ నిలువు; మంగళాద్రి! నృసింహా. 197

---

తే॥ బ్రతికినన్నాళ్లుఁ దావక పాదసేవ,
పావనం బైననిర్దైన్యజీవనంబు
మమత యొసఁగుననాయాసమరణము తుది,
దేవ! కారుణ్యమునఁ బ్రసాదింపు వరము. 198

చ॥ పవ లెటు సంచరించినను, బందుకొనం జనునప్డు మాపటన్,
భవహరు నీకు నిర్మలమనంబునఁ దల్పుమ భద్రనిద్రకై,
తవిలి ప్రపంచయాత్ర బహుధా జరిగించిన జీవితంబునన్,
భవదవసానవేళ భవబంధహరున్ మది నిల్పు మర్త్యుఁడా! 199

---

తే॥ వివిధవిషయప్రసక్తిని వేఱువేఱు
తఱుల రచితంబులైనపద్యములు కూర్పఁ
బడినవసురాయచాటుప్రబంధమందుఁ
పంచమము తుది స్వవిషయప్రకరణ మిది. 200



సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము